



ముఖచిత్రం : దీపక రాగిణి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 42 నవంబరు 1980 సంచిక 5

ఏ ప్రభుత్వమైనా ప్రధానంగా పరిశీలించవలసిన ప్రజల సమస్యలు రెండు. ఒకటి, దేశంలో శాంతి, భద్రతలు. రెండు, నిత్యావసర వస్తువుల ధరలు. దేశంలో ప్రజలు శాంతంగా, నిర్భీతిగా తమ జీవితాలను గడుపుకోడానికి అనుకూలమైన వాతావరణం వుండి, ప్రజల నిత్యావసర వస్తువుల ధరలు సామాన్య ప్రజల అందుబాటులో వున్నట్లయితే, మిగతా రాజకీయ, సాంఘిక వ్యవహారాలను పరిష్కరించడంలో ప్రభుత్వ కార్యక్రమాలను కొనసాగించడంలో ప్రజల సహకారం పూర్తిగా లభిస్తుంది.

రెండున్నర సంవత్సరాలపాటు పరిపాలన సాగించిన జనత పార్టీ ప్రభుత్వంలో, ఏ కారణంచేతనైతేనేమి, ధరలు పెరిగాయి; శాంతి భద్రతలు క్షీణించాయి. మళ్ళీ, శ్రీమతి ఇందిరా గాంధి ప్రభుత్వం రాగానే, పరిస్థితులు చక్కబడతాయనీ, ప్రజల ఆర్థిక వ్యవస్థ క్షీణదశనుంచి బాగుపడుతుందనీ ప్రజలు ఆశించారు. కాంగ్రెసు పార్టీని గెలిపించడంలో ప్రజల ఆశ అదే.

కాని, శ్రీమతి ఇందిరాగాంధి ప్రభుత్వం ఏర్పడి ఇప్పటికి పదినెలలపైగా అయింది. పరిస్థితులు మెరుగుపడలేదు. ఒక విధంగా, పరిస్థితులు మరికొంత క్షీణించాయనే చెప్పవలసి వస్తోంది. పరిపాలనను చేబట్టిన కొద్ది కాలంలోనే, శ్రీమతి ఇందిరా గాంధికి, ఆమె కుమారుని ఆకస్మిక మరణ కారణంగా ఘోర మైన దుఃఖం కలగడం ఒక కారణం అయివుంటుంది అంతేకాక, విదేశ సమస్యలను అతి శీఘ్రంగా పరిష్కరించవలసిన అవసరం ఏర్పడడం మరొక కారణం అయివుంటుంది. పైగా, వివిధ రాష్ట్రాలలో నాయకత్వం విషయమై తగాదాలు రావడం, వాటిని సర్దవలసిన అగత్యం ఏర్పడడం కూడా, మరొక కారణమే.

ఏమయినా, దేశంలో అనేక ప్రాంతాలలో జరుగుతున్న అల్లరులను అణచి వేసి, వివిధ ప్రాంతాలలో సాగుతున్న ఆందోళనలను సర్ది, దేశం మొత్తం మీద శాంతి భద్రతలను నెలకొల్పడంలో ఇక ఏ మాత్రమూ ఆలస్యం జరగ నియ్యకూడదు. ఆలస్యం జరిగిన కొద్దీ, అల్లర్లు చేసేవారు పెచ్చు పెరిగి పోతారు. దౌర్జన్య హింసాకాండలు ఎక్కువ కావచ్చును. అవసరమైతే, కఠిన చర్యలనే అమలుజరిపి, అల్లర్లను అణచివెయ్యాలి న్యాయ విరోధమైన చర్యలకు పాల్పడేవారిని ప్రభుత్వం కఠినంగా శిక్షిస్తుందనే భయం అల్లర్లుచేసే వారికి కలగాలి. అలాంటి కేంద్ర ప్రభుత్వ విధానానికి రాష్ట్ర ప్రభుత్వాలు పూర్తిగా మద్దతు ఇవ్వాలి. ప్రభుత్వాలే కాదు: బాధ్యతగల పౌరులందరూ కూడా ప్రభుత్వంతో సహకరించాలి.

ఇక, నిత్యావసర వస్తువుల ధరల సంగతి ధరలను అదుపులోకి తేవడానికి ప్రభుత్వం సత్వర చర్యలను అమలు జరపాలి ఏ వస్తువు ధర చూసినా, 1980 జనవరి నాటికీ యీనాటికీ చాలా ఎక్కువగా వుంది. గవర్నమెంటు వుద్యోగులకు జీతాలు, భత్యాలు పెరగవచ్చును. పెద్ద పెద్ద పరిశ్రమలలో పనిచేస్తున్నవారికి భత్యాలు పెరగవచ్చును. వ్యాపారం చేసేవారికి ఆదాయం పెరగవచ్చును కాని, ఏ విధంగానూ పెరగడానికి అవకాశంలేని కొద్దిపాటి ఆదాయంతో జీవిస్తున్న వారి సంఖ్య మన దేశంలో చాలా ఎక్కువ. ధరలు

పెరుగుతున్న కొద్దీ వారి జీవితం దుర్భరమౌతున్నది. ఒకరివద్ద చెయ్యి చాచకుండా జీవితం గడుపుతూ వున్నవారు, అప్పులపాలు కావడమో, ముష్టి ఎత్తడమో జరుగుతున్నది. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు వెంటనే, యీ సమస్య పరిష్కారానికి తగిన చర్యలు తీసుకోవాలి.

ధరలను నిర్ణయించడంలో, ప్రభుత్వం న్యాయమైన, సరసమైన పద్ధతులను అవలంబించాలి. ఇంతవరకూ, యీ విషయంలో ప్రభుత్వం అవలంబించిన విధానం సరసమైనదని చెప్పడానికి వీలులేదు. ఏ విధమైన సంరక్షణ అవసరం లేకుండా, పుష్కలంగా కాపుకాసిన చింతచెట్ల నుంచి కాయలు కోసి అమ్మడం తప్ప వేరే బెడదలేని చింతపండు ధర కిలో ఎనిమిది రూపాయలదాకా పెరిగినప్పటికీ ప్రభుత్వం పట్టించుకోలేదు. కాని, పైరువేసి, దానికి ఎరువుపెట్టి, సంరక్షణ చేసిన రైతు దగ్గరనుంచి చెరుకును కొని, ప్రభుత్వం నిర్ణయించిన ప్రకారం కార్మికులకు జీతాలు ఇచ్చి ఫాక్టరీలను నడిపి చక్కెరను ఉత్పత్తిచేసిన ఫాక్టరీల గోడును ప్రభుత్వాధికారులు పట్టించుకోలేదు. వాటాదార్లకు డివిడెండు మాట అలా వుంచి, అసలు చక్కెర వుత్పత్తికి అయ్యే ఖర్చులు కూడా కిట్టని రేటులో చక్కెర ధరను ప్రభుత్వం నిర్ణయించింది. దానివల్ల ఎన్నో ఫాక్టరీలు దెబ్బతిన్నాయి. చెరకుకు తగిన ధర కిట్టుబాటుకాక, చాలా మంది రైతులు చెరకు పంట వెయ్యలేదు. ఫలితం ఏమిటంటే, వచ్చే సంవత్సరం మన దేశంలో అవసరాలకు సరిపోయే చక్కెర వుత్పత్తి జరగకపోవచ్చును. అయిదేళ్ళనాడు విదేశాలకు చక్కెరను ఎగుమతిచేసి మూడు వందల కోట్ల రూపాయల లాభాన్ని సంపాదించిన ప్రభుత్వం, వచ్చే సంవత్సరం చక్కెరను పెద్ద నష్టంతో దిగుమతి చేసుకోవలసిన అవసరం కలగవచ్చును. అంచేత, నిత్యావసర వస్తువుల ధరలను నిర్ణయించడంలో, ఆ వస్తువుల వుత్పత్తికి అయే ఖర్చు వెచ్చాలను పూర్తిగా పరిశీలించి, సరసమైన ధరలను నిర్ణయించడం అవసరం.

ప్రస్తుతం ప్రజలను బాధిస్తున్న రెండు సమస్యలను అతి శీఘ్ర కాలంలో ప్రభుత్వం పరిష్కరిస్తుందని ఆశిస్తున్నాము.

---

# 21 లక్షల క్రొత్త వ్యక్తులు గత సంవత్సరం డెట్ బిళ్లను వాడారు

# దీనికి ఒక ప్రబల కారణం వుంది— డెట్ యొక్క ఉజ్వలమైన ఉతుకు

ఇపుడు ముందుకంటే ఎంతో ఎక్కువ మంది డెట్ బిళ్ల యొక్క ఉజ్వలమైన ఉతుకును ఇష్టపడుతున్నారు, వారంటారు, ఇది మిరమిట్ల తెలుపును, ఎంతో ఎక్కువ పొదుపును ఇస్తుంది.

| ఉత్తమమైన డిటర్జెంట్ బిళ్లల వృద్ధి | |
|---|---|
| | క్రొత్త గ్రాహకులు |
| డెట్ బిళ్ల | 21,00,000 |
| రెండవ ఉత్తమ బిళ్ల | 14,00,000 |
| మొత్తము 49,00,000 క్రొత్త గ్రాహకులు | |
| మూలం రిటైల్ స్టోర్ ఆడిట్ రిపోర్ట్ జనవరి-డిసెంబర్ 1979 వాడకపు ఆధారం 1 బిళ్ల ప్రతి నెల, ప్రతి వ్యక్తి. | |

21,00,000 క్రొత్త వ్యక్తులు డెట్ బిళ్లను వాడడం మొదలెట్టారు.
మరి మీరు ?




## డెట్ బిళ్ల

వాడండి
తెలుపును పొందండి

Shilpi-DM-14A/80 Tel

# చిత్ర వార్తలు

వంశధార నదిపై సెప్టెంబర్ నెల ఆఖరి వారంలో ఆకస్మిక వరదలవల్ల అపార ఆస్తి, ప్రాణనష్టం వాటిల్లింది ఆ సందర్భంగా తీసిన ఛాయాచిత్రాలు



వరద ముంపునకు గురి అయిన ఒక గ్రామం

దెబ్బతిన్న రైల్వే లైను





విద్యుత్ ఘనయుద్ధరణం.



వరద బాధితులకు ఉచిత ఆహారధాన్యాల సరఫరా

వినాయక చవితి నిమజ్జన సందర్భంగా హైదరాబాదులో జరిగిన బ్రహ్మాండమైన
ఊరేగింపులో పాల్గొన్న ముఖ్యమంత్రి చెన్నారెడ్డి.





పుష్కరాల సందర్భంగా
కృష్ణా బారేజిమీద ప్రతిష్టించిన
కృష్ణవేణి విగ్రహం

విజయవాడ దుర్గాఘాట్ స్నానవాటిక.



# నిన్నకాని రేపటి రోజు

జయంతి వెంకట రమణ



పిల్లలు నలుగురు నాలుగు మూలల నుండి ఇంటికి వచ్చిననాడే పండుగ ఏ తల్లిదండ్రులకైనా. శేఖరు వచ్చాడు. ఒక్కడే రాలేదు. భార్యా పిల్లలతో వచ్చారు రాజా కూడ తన కుటుంబంతో వచ్చారు. రెండో కూతురు వచ్చింది. పిల్లలతో అనాకపల్లి నుండి పెద్ద కూతురు అత్తవారు ఆ ఊరే. ఆమె

కూడ ఉంది. వారేకాక బంధుబలగం అంతా ఉంది ఇంతమంది రావటానికి కారణం పెద్ద కూతురి కూతురు వివాహం జరగటమే పెళ్లైన మర్నాడే వెళ్ళిపోతా మన్నారు రాజు, శేఖరులు. సీతారామయ్య గారే వాళ్ళని ఒకటి, రెండు రోజులు ఆగమన్నారు రెండో కూతుర్ని కూడ కదలనీయ లేదు ఆ తరువాతే తానే చెప్పారు కొడుకులతోను కూతుళ్ళతోను మాటాడవలసి ఉందని ఉండబట్టలేక రాజు రహస్యంగా తల్లి నడిగాడు

"ఏమిటమ్మా! నాన్నగారు మాతో మాటాడవలసిన విషయం!" అని

"మీ నాన్నగారు నాతో ఏమీ చెప్ప లేదురా!" అందామె.

"ఇల్లు అమ్మకం విషయం అయి వుంటుందేమో నమ్మా" నడిగాడు.

"అదేమో నాకు తెలియదు రాజు" అందామె.

ఇక ఆమె నడిగి ప్రయోజనం లేదని గ్రహించి నెమ్మదిగా అవతలికి వెళ్ళి పోయాడు. వెళ్ళిపోతూ ఎందుకైనా మంచిదని చెల్లెలు సుమకు ఒప్పగించి మరీ వెళ్ళాడు

"నాన్న గారు అన్న లిద్దర్ని ఎందు కుండమన్నారో, మాటాడవలసిన దేమిటో తెలియక సస్పెన్సుతో కొట్టుకోలాడి పోతున్నారమ్మా. రాజు నన్నడిగాడు నాకేం తెలుస్తుంది. ఇల్లు అమ్మేసి ఇద్దరికీ వాటా చేసి యిచ్చేస్తారేమో అని అలాగా ఉ దమ్మా ఇద్దరికీ" అంది సుమ.

"అదే అవుతుందేమోనమ్మా" అంది తల్లి రాధమ్మ.

"అదేమిటమ్మా అలాంటావు? ఇల్లు అమ్మేస్తే మీ రెక్కడుంటారు? ఈ రోజుల్లో కాబట్టి ఈ మాత్రం ఆశ్రయా న్నైనా సంపాదించుకో గలిగారు. ఈ రోజుల్లో అయితే ఇల్లు కొనగలమా? కట్టగలమా? నాన్నగారు ఉద్యోగం లోంచి రిటైర్ అయి దాదాపు సంవత్సరం అయిపోతోంది ఈ ఇల్లు కూడ లేక పోతే ఎలాగమ్మ!" అంది సుమ

"పోనీలే సుమా! చిన్నదానివైనా నీ మనసుకు పట్టింది. అయినా మీ నాన్న గారెలా చేస్తే అలా! నేనేమీ చెప్ప లేను" అందామె విరక్తిగా

తల్లిని మరేమీ ప్రశ్నించలేక తిరిగి వచ్చేసింది సుమ పెద్ద కూతురికి పెళ్ళి హడావుడి అందుచేత ఆమెకీ విషయమే పట్టలేదు

రాజు తల్లితో మాటాడి రావడం శేఖరు చూశాడు

"ఏరా రాజూ! అమ్మేమంది?" అడిగాడు శేఖరు ఉముడ్ని

"ఏ విషయం?" అడిగాడు రాజు.

"అదే నాన్న గారు మనల నెందు కుండమన్నారో ఒకటైనా ఉంటుంది" అన్నాడు.

"ఏమిటి!" అడిగాడు రాజు.

నాన్నగారు రిటైర్ అయిపోయారు. ఆ తరువాతి కార్యక్రమం గురించి మాటాడతారేమో."

"అదే ప్రసంగం వస్తే మనం ఏం చెప్పాలో ముందుగా అనుకోవాలిగా" అన్నాడు రాజా

"ఏంచేద్దామంటావు?"

"ఏం చెయ్యాలో, ఏం మాటాడాలో పెద్దవాడివి నీవే చెప్పు"

"నాన్నగారికి ఉద్యోగం లేదు. అందుచేత మనలనుండ ఆయన ఆశించేది మన దగ్గర అమ్మా నాన్నా ఉండటం. అందుచేత నాన్నగారేదో నిర్ణయం తీసుకుని ఉండి ఉంటారు నేను పెద్దవాడిని కనుక నా దగ్గర ఉండాలని అనుకున్నా అనుకోవచ్చు," అన్నాడు శేఖరు

"నిజం కావచ్చు" అన్నాడు రాజా చాలా జాగ్రత్తగ

"అమ్మకు నీవంటే యిష్టం నీవు ఎంత కాదన్నా అమ్మకు నీ పక్షపాతం వుంది. ఎందుకంటే నాకు మా అమ్మాయి సీతమీద ఉన్న అభిమానం. మిగిలిన శిపై అంత లేదు మీ వదినకు రమేష్ అంటే అభిమానం. అలా పిల్లలమీద పక్షపాతం వహించని తల్లిదండ్రులు ఉండరు. అందుచేత అమ్మను బట్టి నాన్నగారు కూడ నీ దగ్గరే ఉండాలని అంటారేమో!"

"అదీ నిజమే" అన్నాడు రాజా మరీ జాగ్రత్తగ

"కానీ ఇద్దరూ నీ దగ్గర ఉండాలన్నా, నీకు కష్టమే నీదైన, నాదైన పెద్ద జీతం కాదుగదా"

"అదీ నిజమే" అన్నాడు రాజా కొద్దిగ తల ఎత్తి

"అందుచేత ఇద్దరికీ సమ్మతమైన మార్గమేదో ఆలోచించాలి," శేఖరన్నాడు.

"నాన్నగారికి పెన్షను వస్తుందాలి. ప్రావిడెంటు ఫండు కూడ వచ్చి ఉండాలి స్వంత ఇల్లుంది ఆయన ఉపాధ్యాయుడిగా పనిచేశారు కాబట్టి నాలుగురాళ్లు ట్యూషన్లు చెప్పి సంపాదించుకోగలరు. అందుచేత అమ్మా నాన్నా యిక్కడే వుంటే మంచిది. మనం ప్రతీనెల ఇంతో అంతో పంపితే సరిపోతుంది"

"నీ వన్నది నిజమే రాజూ! కాని వృద్ధాప్యంలో, కొడుకులుండి కూడ తల్లిదండ్రులను చూశారుకాదని లోకం అంటుంది"

"ఇది చూడకపోవట మెలా అవుతుంది? మనం ప్రతీనెల ఇంతో అంతో పంపుతాంగా. అప్పుడప్పుడు చూచి పోతూంటాముగా"

"కాని లోకాని కది అక్కరలేదు రాజూ"

"అయితే మరేం చేద్దాం."

(ముగింపు వచ్చే సంచికలో)

# మంజీర



జొన్నలగడ్డ లలితాదేవి

ఇంటర్ మిడియట్ ఫస్టియర్ ఆఖరు పరీక్ష రాసి ఇంటికి వచ్చింది మంజీర. గుమ్మంలోనే నిలబడి ఆమెకోసం వేయికళ్ళతో ఎదురుచూస్తోంది ఆమె తల్లి కమలమ్మ.

"ఏమే, పరీక్ష బాగా రాశావా?" అని అడిగింది అపేక్షగా కూతుర్ని చూసి.

"రాశానులేమ్మా" అంటూ జవాబిచ్చి తన గదిలోకి వెళ్ళిపోయింది మంజీర.

"అన్నం పెడుతున్నాను. త్వరగా కాళ్ళు కడుక్కునిరా," అంటూ వంట గదిలోకి వెళ్ళింది కమలమ్మ.

'ఈ రోజుతో పరీక్షలు ఆఖరుగదా సినిమాకి వెడదాం రా' అంటూ స్నేహితులు బలవంతంచేసినా తను వెళ్ళలేకపోయింది. మూడు రోజుల్లో తన నాట్య ప్రదర్శన ఒకటి వుంది. ఈ వూళ్ళో ప్రముఖ వైద్యుడు శ్రీ వేణుగోపాలరావు కుమార్తె వివాహ సందర్భంగా ఆ ప్రదర్శన ఏర్పాటుచేశారు. తమ గురువుగారు ఆ రోజుతో తనో పెద్ద నాట్యరాణిగా గుర్తింపబడాలన్న ఆపత్రయంతో మంచి మంచి అయిటమ్స్ నాలుగయిదు సెలక్టుచేసి తనచేత బాగా ప్రాక్టీసు చేయిస్తున్నాడు. పరీక్షలుగదాన్న తలంపుతో తను వెనకడుగువేసినా అమ్మ

ప్రోత్సాహం, ఇటు శేషాచార్యులుగారి బలవంతం- తనని మరీ అలసట పెడు తున్నాయి. అటు నాట్యం ఇటు పరీక్షల హడావుడి హైరానగా వుంది. ఒక బెడద తీరిపోయింది కనుక తను ఇక విశ్రాంతగా ప్రదర్శనకి తయారు కావచ్చు. అందుకే తను సినిమా ప్రోగ్రాంకూడా కాన్సిల్ చేసుకుంది.

గబగబా భోజనంచేసి గదిలో ఓ గంట హాయిగా నిద్రపోయి మళ్ళీ నాలు గయిందంటూ తల్లి లేపితేనే లేచింది.

కూతురి శ్రమ బాగా గ్రహించిన కమలమ్మ మంజీర సీరసపడిపోకుండా పళ్ళ రసాలు టిఫిన్లు అన్నీ అమరుస్తూనే వుంది.

తల్లి పెట్టిన టిఫిను, కాఫీ తీసుకుని టాయ్‌లెట్ అయి డాన్స్ క్లాసుకు వెళ్ళి పోయింది మంజీర.

మంజీర అటు వెళ్ళగానే రిక్షాలో దిగాడు అచ్యుతరామయ్య.

అన్నగారిని చూడగానే మహదానందపడిపోయింది కమలమ్మ.

"ఏమిరా అన్నయ్యా! హఠాత్తుగా ఇలా వచ్చావు!" అని అడిగింది కుర్చీ ఇస్తూ.

"ఏం లేదులే! పిల్లకి పరీక్ష లయ్యాయేమో మిమ్మల్ని తీసుకువెడదామని వచ్చాను," అంటూ కుర్చీలో కూర్చున్నాడు

అన్నగారి ఆపేక్షకి కళ్ళు చెమ్మగిల్లాయి కమలమ్మకి

తల్లీ, తండ్రీ గతించిన దగ్గర్నించి తన పుట్టింటిపేరుతో రాకపోకలు సాగిం చడానికి, చీర, సారె పట్టుకుని అత్తింటికి రావడానికి తనొక్కడే మిగిలాడు ఆ వంశానికి.

అలాగే తన భర్త గతించాక తమకి అతనే అండ, పెద్దదిక్కూ అయ్యాడు. ఏళ్ళు గడిచి వృద్ధాప్యంలో పడుతున్నా అవివాహితుడిగానే మిగిలిన అన్న అచ్యుతరామయ్యని తలచుకుని ఎప్పుడూ దుఃఖపడుతూనే వుంటుంది. "ఒక్కగా నొక్కడివి. పెళ్ళిచేసుకుని నాన్న వంశాన్ని నిలబెట్టరా!" అంటూ ఎన్నోసార్లు ఏడ్చింది మొత్తుకుంది. అయినా గారాలముద్దుగా చూసుకునే చెల్లెలి మాటని ఈ విషయం దగ్గరకి వచ్చేసరికి పూర్తిగా కొట్టిపారేశాడు అచ్యుతరామయ్య.

ఒక్కొక్క విషయంలో అతనెంత మృదుహృదయుడో- ఒక్కో విషయంలో అంత కఠినాత్ముడు. ఒక్కొక్క నిర్ణయం చేశాడంటే అది వజ్రసన్నిభం. దానికింక తిరుగులేదు. ఎందరి కన్నీళ్ళు, బాధలూ అతన్ని కదిలించలేవు, కరిగించలేవు.

అతనలా పెళ్ళిపెటాకులూ లేకుండా వుండిపోవడానికి పెద్ద కారణమే వుంది అతని యవ్వనంలో-అంటే ఇరవై మూడు, ఇరవై నాలుగేళ్ళ వయసులో అరవింద అనే అమ్మాయిని ప్రేమించాడు. ఆ పిల్లకూడా అచ్యుతరామయ్యని గాఢంగానే ప్రేమించినా - చివరికి - ఏకారణంచేతో మరొకరి ఇంటి ఇల్లాలై వెళ్ళిపోయింది. అంతే. అప్పటినించీ అచ్యుతరామయ్య బ్రహ్మచర్యంతోనే కాలక్షేపంచేస్తున్నాడు. పెళ్ళిచేసుకోమని ఎందరు చెప్పినా, తల్లీతండ్రి మొత్తుకున్నా, తిట్టినా, తిమ్మినా, ఏంచేసినా పెళ్ళికిమాత్రం ఇష్టపడలేదు. అపరంజి బొమ్మలాంటి అరవిందని అతనేనాడూ మరిచిపోలేదు. ఆమె ప్రణయానికి గుర్తుగా ఆమె ఇచ్చిన కార్డు సైజు ఫోటో అతనికి పవిత్ర దేవతారూపం అది చూసుకుంటూనే అతను రోజులు - వారాలు - నెలలు - సంవత్సరాలు గడిపివేస్తున్నాడు

పకోడీలు ఓ పళ్ళెంలో పెట్టి అన్నగారికి అందించి కాఫీ కలపడానికి లోపలికి వెళ్ళింది కమలమ్మ.

పకోడీలు తిని, కాఫీ త్రాగి "అయితే మంజీర పరీక్షలన్నీ పూర్తి అయినట్టేగా!" అని అడిగాడు.

"ఆ! అయినట్టే! కాని మూడురోజుల్లో దాని డాన్స్‌ప్రోగ్రాం ఒకటి వుంది అన్నయ్యా! అది అయ్యాక వెళదామంది. అందుకే ఆగిపోయాం. లేకపోతే ఈ పూటే బయలుదేరేవాళ్ళం కదూ. నువ్వూ కూడా నాల్గురోజులు వుండు. ఆ ప్రోగ్రాం చూసి వెడుదువుగాని." అంది అన్నయ్యతో.

"నా కెక్కడమ్మా తీరుబడి" అంటూ అక్కడే వున్న వారపత్రిక అందుకుని చదవసాగాడు.

డాన్సు బాగా ప్రాక్టీసుచేసుకుని చెమటలు కారుతూ వచ్చింది మంజీర. మామయ్యని చూస్తూనే చంగున లేడిలా దూకి "ఎప్పుడొచ్చావు మామయ్యా!" అని అడిగింది ఉత్సాహంగా. "ఇందాకేనమ్మా! పరీక్షలు బాగా రాశావా?" అని అడిగాడు ఆప్యాయంగా.

"ఆ రాశాను మామయ్యా! అయినా ఫస్టియరేగా!" అంటూ నవ్వుతూ లోపలికి వెళ్ళిపోయింది. వెడుతున్న మేనకోడలివంక సంతోషంగా చూశాడు అచ్యుతరామయ్య. తన కళ్ళముందు పుట్టి, తనచేత గౌన్లు వేయించుకుని ఆడుతూ పాడుతూ అల్లరిచేస్తూ తిరిగిన మంజీర ఈ రోజు పదహారేళ్ళ ముద్దుపిల్ల అయింది. చక్కని రూపం, అంతకుమించిన అంగసౌష్ఠవం, చదువులో చురుకుదనం, అన్నీ కలబోసుకుని గలగలపారే సెలయేరులా, అంకురించిన ముద్ద మందారంలా, చలాకీగా తిరుగుతూ అందరికీ కనువిందు చేస్తూవుంటుంది

లోపల వంటపనిలో కాస్త తల్లికి సాయంచేస్తూ "మామయ్య దేనికి వచ్చాడమ్మా?" అని అడిగింది మంజీర.

"నీకు శలవలుగదా మనని తీసుకువెళదామని"

"నా ప్రోగ్రాం మాట చెప్పావా?" కుతూహలంగా అడిగింది మంజీర.

"ఆ, అది అయ్యేదాకా వుండమన్నాను. మరి వుంటాడో వుండడోగాని" అంది కూర దింపుతూ.

"నేను చెబుతాలే అమ్మా! మామయ్య నామాట కాదనడు," అంటూ ధీమాగా జవాబిచ్చింది మంజీర.

ఆ మాటకి కమలమ్మ నవ్వుకుంది. కూతురివంకే మురిపెంగా చూస్తూ, "అయితే వెళ్ళి ఆమాటే చెప్పిరా."

"చెబుతాను. ఈ పచ్చడి కాస్తా రుబ్బేయనీ" అంటూ కాస్త వేగం పెంచి పచ్చడి పూర్తిచేసి చేతులు కడుక్కొంటూ మామయ్య దగ్గరికి వచ్చింది.

"మామయ్యా! నా ప్రోగ్రాం అయ్యేదాకా ఇక్కడే వుండవూ!" అంది గారాలుపోతూ.

"ఇక్కడ నా పనులెవరు చూస్తారమ్మా!"

"ఎవరో ఒకరు చూస్తార్లే వెనక పనులు ఎప్పుడూ వుండేవేగా!" అంది విసుగ్గా.

చివరకి మంజీర ముద్దు ముద్దుల మేనకోడలికి ఎదురుచెప్పలేక అతి ముఖ్యమయిన పనులు కూడా వాయిదావేసి ఆగిపోయాడు వెళ్లేవాడల్లానే.

"అన్నయ్య పెళ్ళిచేసుకుంటే కొడుకు పుట్టి మంజీరకి మొగుడయ్యేవాడు" అనుకుంది కమలమ్మ దీర్ఘ నిశ్వాసం విడుస్తూ.

ఆ రోజే మంజీరానృత్య ప్రదర్శన. అమృతరామయ్య, కమలమ్మ కూడా హాజరయ్యారు. తెర లేచింది. గజ్జెలు ఘల్లుమన్నాయి. మొదటి అయిటమే గిరిజాకళ్యాణం. తాపసి వేషంలో పువ్వుల పళ్ళెంతో పర్వతపుత్రి పార్వతీదేవిగా మంజీర ప్రత్యక్షమయింది.

ఆర్కెస్ట్రాకి, గురువుగారు వెనకనించి పాడే పాటకి లయబద్ధంగా అడుగులు వేస్తూ భువనమోహనంగా నర్తించసాగింది మంజీర. పచ్చని ఆమె దేహచ్ఛాయకు కాషాయరంగు చీర, దానిపైన తులసిమాలలతో అకుంఠిత దీక్షతో తపస్సాచరిస్తూ పరమేశ్వరానుగ్రహం కోసం పరితపించే తపస్వినిగా, ఆమె భక్తికి మెచ్చి ఆమెను స్వీకరించిన దేవదేవుని సరసన సిగ్గు బరువులతో జగన్మాతగా ఆమె చూపించిన హావభావాలకు చమత్కారానికి అమృతరామయ్య బొమ్మలా ఆగిపోయాడు. అ

జానపద నృత్యం, ఆ తర్వాత ఓ అష్టపది, చివరన నండూరి వారి ఎంకిపాట నృత్యంతో ఆనాటి కార్యక్రమం ముగిసింది.

డాక్టర్ వేణుగోపాల్ మంజీరని అభినందిస్తూ కానుక లందించాడు. గురువు గారిని పట్టుబట్టలతో సన్మానించాడు. తన మాతురిలోని ప్రతిభా విశేషాలకు తనే ఆశ్చర్యపోతూ, సంతోష తరంగాల మధ్య ఇల్లు చేరుకున్నది కమలమ్మ. అచ్యుతరామయ్య సరేసరి। అతనికి నృత్యం అన్నా, సంగీతం అన్నా చాలా ప్రేమ. మంజీర డాన్సు నేర్చుకుంటున్నదని తెలిసినప్పుడే మురిసిపోయాడు. ఇప్పుడు స్వయంగా ఆమె నృత్య ప్రదర్శన చూశాక యావద్భారత కీర్తి నార్జించి నృత్యశిక్షణలో విజయపతాకం ఎగురవేస్తున్న రుక్మిణీ అరండేల్, యామినీవంటి నృత్య కళాకోవిదుల్లోకి తన మేనకోడలు కూడా చేరిపోతుందని ఉప్పొంగిపోయాడు. అలా చేరిపోవాలని ఆకాంక్షించాడు కూడా.

ఆ మర్నాడే మంజీరను, కమలమ్మను తీసుకుని వచ్చేశాడు తన యింటికి అచ్యుతరామయ్య.

## 2

విజయవాడకి ఇరవై మైళ్ళ దూరంలోవున్న పల్లెటూరు అచ్యుతరామయ్యది. ఆ వూరుపేరుచెప్పి మోతుబరు లనదగినవారు పట్టుమని పదిమంది కూడా వుండరు. అసలిళ్ళే ఆ ఊళ్ళో చాలా తక్కువ. ఎక్కువ భాగం అంతా పొలాలే.

అచ్యుతరామయ్యకి అక్కడో ఇల్లు, పొలం వున్నాయి. అవి అతనికి ప్రాణం అనే చెప్పవచ్చు. రోజూ పచ్చని చేలని పలకరించందే అతనికి నిద్ర పట్టదు.

ఆ పచ్చని పొలాలమధ్య ఆడుతూ పాడుతూ తిరగడం మంజీరకి కూడా ఇష్టమే. తెల్లగ తెల్లవారి లేచి వంటమనిషి రామయ్య తెచ్చిపెట్టిన ఇడ్లీ ఆరగించి మామయ్యతో పొలానికి బయలుదేరింది మంజీర.

అసలే నృత్యం చేస్తుంది కనుక నడకలో ఓ విధమైన చమక్. ఉత్తుంగ శిఖరంమీదనుంచి తృళ్ళిపడే జలపాతంలాంటి వయసుతో చలాకీగా చిలిపిగా కబుర్లు చెబుతూ అచ్యుతరామయ్యని నవ్విస్తూ తను కేరింతలాడుతూ పొలం చేరుకున్న మంజీరకి పొలంగట్టు దగ్గరగా పాంటు, షర్టు ధరించిన ఓ అందాల యువకుడు దర్శనమిచ్చేసరికి బ్రేక్ పడిపోయినట్లాగిపోయాయి కాళ్ళు. అతను చిరునవ్వు నవ్వుతూ మంజీరకేసి చూశాడు. ఆ నవ్వు మంజీరని ముగ్ధురాలిని చేసింది. అతని చురుకు చూపులు ఆమె లేత గుండెలో బాణంలా దూసుకు

పోయాయి. ఈ పల్లెటూరిలో, ఈ పొలాల మధ్య సాక్షాత్తు మన్మధుడే దిగి వచ్చాడా అన్నంత అందంగా వున్న ఆ యువకుని చూసేసరికి మంజీర గుండె లయతప్పింది.

"ఏం బాబాయి! ఈ రోజు ఆలస్యంగా వచ్చావు?" అంటూ అచ్యుత రామయ్యని పలకరించాడు ఆ యువకుడు.

"ఇదుగో! ఈవిడగారి మూలాన," అంటూ నవ్వి "నీకు మా చెల్లెలు కమల గుర్తుందిగా, దాని కూతురు. పేరు మంజీర," అంటూ అతనికి పరిచయం చేసి "చూడు మంజూ, ఇతను నాకు బాగా కావలసినవాడు. విజయవాడ ఇతని నివాసం. పేరు శరచ్చంద్ర. అగ్రికల్చర్ బి.యస్‌సి. పాసయ్యాడు. నన్ను చూడాలనిపించినప్పుడల్లా వచ్చి వెడుతూవుంటాడు." అంటూ మంజీరకి పరిచయం చేశాడు.

మంజీర నమస్కరించింది. అతను ప్రతినమస్కారం మాట మరచినట్లు ఆమెనే చూస్తున్నాడు

"ఏం చదువుకుంటున్నారు?" కుతూహలంగా అడిగాడు.

"ఇంటరు ఫస్టియర్ పరీక్ష రాసి వచ్చాను," అంది అతని చూపులు తప్పించుకుంటూ.

"మా మేనకోడలు డాన్సు ఫస్టుగా చేస్తుంది మొన్నే ప్రదర్శన ఇచ్చింది. అబ్బ! ఎంత బాగుందనుకున్నావు" అంటూ గొప్పగా చెప్పుకున్నాడు అచ్యుతరామయ్య.

"అప్పుడే అనుకున్నానులే బాబాయి! ఈవిడ డాన్సర్ అయివుంటుందని," అంటూ నవ్వాడు శరచ్చంద్ర.

"ఎలా అనుకున్నావురా?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఆవిడని దూరంనించి చూస్తూనే వున్నాను. అది నడకలా లేదు, కథాకళీ డాన్సులా వుంది," అంటూ చమత్కరించాడు శరత్.

అతని హాస్యానికి ఓరగా చూసింది మంజీర. ఆ చూపు మన్మధుని బాణంలా అతని హృదయంలోంచి దూసుకుపోయింది.

శరచ్చంద్ర మాటలకు ఫెళ్ళుని నవ్వాడు అచ్యుతరామయ్య.

"ఓసారి రా మా యింటికి మా చెల్లెల్ని కూడా చూసిపోదువుగాని," అంటూ పొలంలోకి దారితీశాడు అచ్యుతరామయ్య.

"ఇతనెక్కడ వుంటాడు మామయ్యా!" కుతూహలంగా అడిగింది మంజీర

"మన మామిడితోట దగ్గర ఓ షెడ్డువేశాము. అతను ఎప్పుడు వచ్చినా అక్కడే దిగుతాడు కొన్ని వంటసామగ్రి వుంటాయి. అతనే స్వయంగా వండుకు తింటాడు. నేను భోజనానికి రమ్మని బలవంతం చేస్తేనే వస్తాడిక్కడికి, లేకపోతే రాడు." అంటూ వివరంగా చెప్పసాగాడు.

వరి వేశారు ఆ పంట అయిపోయింది. వేసవికాలం మళ్ళీ తొలకరి వానలు పడేసరికి పొలం దున్నటం అయిపోతుంది.

"ఈసారి చెరకు వేద్దామనుకుంటున్నానమ్మా!" అన్నాడు అచ్యుతరామయ్య పొలం అంతా కలియచూస్తూ.

"వెయ్యి మామయ్యా! ఉయ్యూరు షుగర్ ఫ్యాక్టరీకి తోలించవచ్చు," అంది మంజీర ఉత్సాహంగా.

మంజీరని ఎరిగున్నవారంతా పలకరించారు. అందరికీ నవ్వుతూ సమాధానాలు ఇస్తూ ఇంటికి తిరిగివచ్చింది మామయ్యతో. వెళ్ళేప్పుడెంత ఉత్సాహంగా వుందో వచ్చేటప్పుడు అంతకు రెట్టింపు ఆనందం వుంది ఆమెలో.

ఆమె కళ్ళముందు శరచ్చంద్ర గిరగిరా తిరుగుతున్నాడు. అతని రూపమే మరులుగొలుపే దనుకుంటే అతని చిరునవ్వు మరింత మధురంగా వుంది. 'ప్రపంచాన్నంతా జయించగలిగే చిరునవ్వు ఒక్క జవహర్‌లాల్‌దే!' అని ఎక్కడో చదివింది. అలాంటి కోవలోకే చెందుతాడీతను కూడా!' అనుకుంటూ అతన్నే తలంచుకుంటూ మధ్యాహ్నం భోజనంచేసి నిద్రలోకి జారిపోయింది మంజీర.

ఈ పల్లెటూరు వస్తే తనకి పొలమూ, రామాలయం తప్ప కాలక్షేపానికేం వుండదు. అదే తన బందరులో అయితే రావాలన్నా టైము కనిపించదు. చదువు, కాలేజి, డాన్సు, పుస్తకాలు. ఇంకో ఇరవై నాలుగు గంటలుండాలి రోజుకి అనిపిస్తూ వుంటుంది. నిద్ర కూడా సరిగ్గా వుండదు. ఈ పల్లె వస్తే అంతా తీరుబడే. అక్కడికీ చాలా పుస్తకాలు తెచ్చిపెట్టుకుంది. మధ్యాహ్నం లేచి కాఫీ త్రాగి ఇంట్లో చేగోడీలు చేస్తూంటే కాసేపు తనూ సాయంచేసి మామయ్య దగ్గరికి వచ్చింది.

"ఏం మంజూ! ఎక్కడికైనా షికారు కెడతావా? లేకపోతే పట్నం సినిమాకి వెడతావా?" అని అడిగాడు అచ్యుతరామయ్య.

"కాసేపలా రామాలయం దాకా వెళ్ళవస్తాను మామయ్యా! సినిమాకి మరో రోజు వెళ్ళవచ్చులే!" అంది.

"ఇంట్లో కొబ్బరికాయ లున్నాయి. ఒకటి తీసుకువెళ్ళి కొట్టిరా!" అంటూ ఎవరో వస్తే మాట్లాడటానికి వెళ్ళిపోయాడు. పళ్ళెం తీసుకుని దొడ్లో మల్లె పందిరి దగ్గరకి పోయి అందినంతవరకూ మొగ్గలు కోసుకుని దండకట్టి పళ్ళెంలో పెట్టి స్నానానికి వెళ్ళిపోయింది. తనే కొబ్బరికాయకి పీచుతీసి కాస్త కర్పూరం, అగరువత్తులు మంజీర ఇంకా కోయకుండా వదిలిన పువ్వులన్నీ తను కోసి ఓ ప్లాస్టిక్ సెబ్బెలో సర్ది పెట్టింది కమలమ్మ.

స్నానంచేసి కడిగిన ముత్యంలా తయారైన మంజీర తల్లి సర్దిపెట్టిన బాస్కెట్ చూసి "అర్చన చేయించమంటావా అమ్మా!" అని అడిగింది.

"చేయించు. ఈ రోజు ఏకాదశిగా! ఇదిగో డబ్బు" అంటూ తీసి ఇచ్చింది.

"అద్దం కూడా ఇవ్వు" అంది పూలదండ పెట్టుకుంటూ. అదీ తీసి ఇచ్చింది. అద్దంలో మరోసారి తన అందం చూసుకుని బాస్కెట్ అందుకుని బయటపడింది మంజీర.

అచ్యుతరామయ్య ఇంటికి దగ్గరగానే వుంటుంది రామాలయం. మంజీర క్షణంలో రామాలయం చేరుకుంది. అప్పుడే ఎవరో భక్తులు మ్రోగించిన మంగళవాద్యాలు అనిపించి ఆమె హృదయమంతా పులకింపచేసింది.

తను ఎన్నో ఆలయాలు చాలా చూసింది. ఈ రామాలయంలోని రాముడు గనవి అన్ని విగ్రహాలలోనూ ఏ విగ్రహానికీ ఆకర్షణలేదు. అందుకే ఈ పల్లెవస్తే విధిగా ఈ రాముని దర్శనం రెండుపూటలైనా చేసి వస్తుంది. ఎక్కువ ఇళ్ళు లేకపోయినా వున్న పుణ్యాత్ములవల్ల శ్రీరాముని ధూపదీపనైవేద్యాలు నిరాఘాటంగా సాగిపోతున్నాయి.

రాముడు కళకళలాడుతుంటే తన గ్రామం కూడా కళకళలాడుతుందన్న గొప్ప విశ్వాసం అచ్యుతరామయ్యకి వుండటంతో రాముని మహానైవేద్యానికిగాను ఓ బస్తా ధాన్యం ప్రతి ఏడూ పూజారి కిస్తూవుంటాడు.

మంజీర దేవాలయంలోకి అడుగుపెట్టి ప్రదక్షిణం చూసే మనిషి అలాగే విస్తుపోయినట్లు నిలబడిపోయింది. కారణం, శరత్కాల మేఘాల మాటున వస్తున్న వన్నెల జాబిల్లిలా తెల్లని ధగధగల వస్త్రాలలో వెదజల్లే శరచ్చంద్ర గంట మ్రోగిస్తూ శ్రీరాముని కేసి తన్మయుడై చూస్తున్నాడు ఆమె గుడిలోకి అడుగుపెట్టేవేళకి గంట మ్రోగిస్తున్నది అతనే.

తనని గమనించకుండానే గుడిలోకి అడుగుపెట్టింది. అంతే! శరచ్చంద్రుని ఘంటానాదం ఒక్కసారిగా ఆగిపోయింది. శ్రీరాముని మాట మరచిపోయి తన కళ్ళె

దుట సాక్షాత్కరించిన అప్సరాంగనని తదేకంగా చూడసాగాడు నవ్వుతూ. పూజారి లోపలనించి బయటకువచ్చి మంజీరని చూసి సంతోషంతో "ఎప్పుడు వచ్చావమ్మా!" అని అడిగాడు. "నిన్న వచ్చామండీ." అంటూ వినయంగా జవాబిచ్చి బాస్కెట్ అందించి "అర్చన చేయండి నా పేరుతో" అంది. అతనది తీసుకుని లోపలకి వెళ్ళిపోయాడు. అతను వున్నాడా వెళ్ళిపోయాడా? అను కుంటూ వెనక్కి తిరిగి చూసింది. శరత్‌చంద్ర అలాగే నిలబడివున్నాడు.

"దైవ దర్శనానికి వచ్చావా?" అంటూ పలకరించాడు.

"లేకపోతే మీ దర్శనానికి వచ్చాననుకున్నారా?"

"అలా భ్రమపడే మూర్ఖుడినికానులే." అన్నాడు నవ్వుతూ.

"మీరు రోజూ గుడికి వస్తుంటారా?"

"రోజూనా! నెలకోసారి వస్తే అక్కడికదే చాలా ఎక్కువ." అన్నాడు అదే చిరునవ్వు ముఖంతో.

"మరి మీకు వూళ్ళో కాలక్షేపం ఎలా అవుతుంది?" విస్మయంగా అడిగింది.

"రామునిలా తప్పు కాలక్షేపానికి ఎవరూ దొరకరంటావా? ... గట్టిగా చెప్పవలసివస్తే నాకే వూడవస్తే క్షణం తీరుబడి అవదు. నా విజయవాడలోనే చాలా ప్రెస్సుంది." అంటూ నవ్వాడు. అతని మాటలకి తెల్లబోయినట్టు చూసింది. తనకీ అతనికీ ఈ పల్లెటూరు ప్రయాణాల విషయంలో ఉత్తర దక్షిణ ధ్రువాలా. తనకి కాలక్షేపం కాదనుకుంటే అతనికి తీరుబడే కాదట. ఈ పల్లెటూళ్ళో అంత తీరుబడి కాని పనులేం వున్నాయి బాబూ, అనుకుంది విడ్డూరంగా.

పూజారి పూజ పూర్తిచేసి ప్రసాదం అందించాడు. అది అక్కడే పగలగొట్టి అతనికి కొంచెం ప్రసాదం అందించింది.

"రేపు మామిడి తోటకి రాకూడదూ! చూడవచ్చు." అన్నాడు శరచ్చంద్ర.

"మామిడితోట అంటే మామయ్యని తోడు తీసుకురావాలి. నిన్న వచ్చిన పొలానికి అయితే ఒక్కర్తినీ రాగలను," అంది మంజీర.

"మామిడితోటకి రావడానికి అంత భయమైతే నేను వచ్చి తీసుకువెడతాలే!"

"భయం కాదుగాని బద్ధకం. అంత దూరం రావాలంటే, పొలం అయితే దగ్గరకదూ!"

"సరే నీ ఇష్టం" అంటూ లేచి "చీకటి పడినట్లుంది. మీ యింటి దగ్గర దింపుతాను పద." అన్నాడు.

అతనితో పాటే బయలుదేరింది. గుడిమెట్లు దిగుతూంటే ఇద్దరి భుజాలు

తగిలాయి. చటుక్కున ఆమె భుజంమీద చెయ్యివేసి గట్టిగా నొక్కి "కాస్త మెల్లగా నడవండి మంజీరగారూ! లేకపోతే ముక్కూ, నోరు ఏకం అవుతాయి అన్నాడు మెల్లగా. ఆ మాటకి సిగ్గుపడిన మంజీర మెల్లగా అతని చెయ్యి విడిపించుకోబోయింది. అతనది పట్టించుకోనట్టే తన భుజానికి బలంగా అదుము తున్నాడు ఆమెని

"వదలండి! ఎవరన్నా చూస్తారు." అంది తడబడుతూ.

"ఏడిసారు. ఇంకే టైములో రాముడిని దర్శించడానికి వచ్చే భక్తాగ్రేసరు లెవరూలేరులే. మనమే లాస్టు! ఈ పాటికి గర్భగుడి తలుపు మూసేవుంటాడు పూజారి," అంటూ ఆమె ఇల్లు చేరేదాకా ఆ భుజంమీద చెయ్యివేసే వచ్చాడు. అతని చొరవకు కోపం వచ్చేసింది మంజీరకి. మామయ్యకి చుట్టం అయితే కావచ్చు, తనకేం చుట్టం! గట్టిగా నాలుగు దులిపేద్దాం అనుకుంది. కాని ఇంతలో ఇల్లు రానే వచ్చింది.

"గుడునైట్ మంజీరా!" అన్నాడు శరచ్చంద్ర.

అది విననట్టే లోపలకి వెళ్ళిపోయింది మంజీర. లోపలికి రండి అంటుందేమో వెళ్ళి కమలమ్మని పలకరించి వుండమంటే భోజనానికి ఉండిపోవచ్చని ఆశించాడు శరత్. కాని మంజీర విసురుగా లోపలకి వెళ్ళిపోవడంతో ఆమెకి కోపం వచ్చే వుంటుందని గ్రహించి మౌనంగా వీధిలోవాడు వీధిలోంచే వెళ్ళిపోయాడు శరచ్చంద్ర.

3

ఆ మర్నాడు తనే ఒంటరిగా పొలానికి బయలుదేరింది మంజీర. అక్కడే ప్రత్యక్షమయ్యాడు శరచ్చంద్ర.

"గుడ్ మార్నింగ్ మిస్ మంజీరాదేవి" అంటూ. అదే చెరగని చిరునవ్వుతో విష్‌చేశాడు.

"గుడ్ మార్నింగ్! అప్పుడే ఇక్కడ ప్రైతాయించారే!" అంది నవ్వుతూ విన్నటివన్నీ మరచిపోయి.

"మరే! ఈ పల్లెటూరులో వున్నంతకాలం నాకీ పొలాలు పుట్టలు పట్టుకు తిరగడమే పని" అంటూ "వీరన్నా" అంటూ కేకపెట్టాడు.

చిటికలో రెండు కొబ్బరిబొండాలతో ప్రత్యక్షమయ్యాడు వీరన్న.

ఇద్దరికీ చెరి ఒకటి అందించాడు

"అబ్బ! చాలా తియ్యగా వున్నాయ్" అంది పూర్తిగా తాగేసి.

"మరి ఈ వూరి కొబ్బరినీళ్ళంటే ఏమనుకున్నావు?" అంటూ గర్వంగా చూశాడు.

"ఇవి కూడా మామయ్యగారివేనా?"

"ఆ. పొలానికి అటువైపున వున్నవన్నీ కొబ్బరిచెట్లేగా! చూద్దువుగాని" అంటూ ముందుకు దారితీశాడు.

అతని వెనకే ఉత్సాహంగా నడిచింది మంజీర.

"నువ్వు బాగా డాన్సు చేస్తావట. నాకెప్పుడు చూపిస్తావు." సుతారంగావున్న ఆమె చెయ్యి అందుకుంటూ అడిగాడు శరచ్చంద్ర.

అతని చెయ్యి తగలగానే ఆమె గుండె ఝల్లుమంది. అతని చేతిలోంచి తన చెయ్యి తీసుకోకుండానే అతని సరసన నడవసాగింది. అతను ఉత్సాహంగా కబుర్లు చెబుతుంటే నవ్వుతూ వింటోంది.

"ఇంతకీ నేను అడిగినదానికి జవాబివ్వలేదు!" అన్నాడు నవ్వుతూ.

"ఏమిటి డాన్సు మాటా? చూపిస్తాను. దేనికైనా టైము రావాలిగా!" అంటూ నవ్వింది మంజీర.

"అవును. దేనికైనా టైము కావాలి" అంటూ కొంటెగా ఆమె కళ్ళల్లోకి చూసి సోగదేలిన ఆమె నీలికళ్ళల్లోని మెరుపుకు ముగ్ధుడై ఆ రెండు కళ్ళమీదా కటాలున ముద్దుపెట్టుకున్నాడు. అతని చర్యకు సిగ్గుతో ఎఱ్ఱమందారంలా అయింది మంజీర ముఖం.

ఇంతలో కొబ్బరిచెట్లు కనిపించాయి.

"ఇవిగో! ఈ చెట్లన్నీ బాబాయివే!" అంటూ చెప్పి మరో రెండు కొబ్బరి బొండాలు కొట్టమని వీరన్నకి చెప్పి అక్కడే కర్చీఫ్ పరచి "కూర్చోండి మంజీరమ్మగారూ!" అంటూ నవ్వాడు.

"నేనెవరికీ అమ్మనికాదు" బుంగమూతిపెట్టింది

"పోనీ అమ్మాయిగారు," అంటూ నవ్వుతూనే వీరన్న కొట్టిఇచ్చిన కొబ్బరి బొండాం అందించాడు.

"మీరూ తాగండి"

"చిత్తం!" అంటూ అందుకున్నాడు.

ఇంతలో అటు వచ్చాడు అచ్యుతరామయ్య.

"ఏమర్రా! ఇక్కడున్నారా?" అంటూ.

"నీ మేనకోడలికి మన కొబ్బరి నీళ్ళ రుచి చూపిస్తున్నాను బాబాయి!"

"ఆయనగారు రుచి చూపించకపోతే నేను కొబ్బరినీళ్ళ ముఖమే ఎరగనా మామయ్యా!" అంది ఓరగాచూస్తూ మంజీర.

వాళ్ళిద్దర్నీ చూసి ముసిముసి నవ్వులు నవ్వుకున్నాడు అచ్యుతరామయ్య.

"బావా అని పిలు మంజీరా! అతను నీకు బావవరసే!" అన్నాడు ముచ్చటగా ఆమెకేసి చూసి.

"ఇంక వెడదామా మామయ్యా!"

"అలాగే! వీరన్నా అనక మరో నాలుగు బొండాలు ఇంటికి పట్టుకురా!" అవి పురమాయించి "నువ్వు కూడా రా! ఈపూట మా యింట్లో భోజనానికి" అన్నాడు శరచ్చంద్రని చూసి.

"నేనెందుకు బాబాయి, మరో రోజు వస్తాలే! అక్కడ ఇంటి దగ్గర వంట చేసి పెట్టుకునే వచ్చాను." అంటూ తిరస్కరించాడు శరచ్చంద్ర.

"భోజనానికి రమ్మంటే అంత బెట్టుసరి చేస్తారేమిటి?" అంది మంజీర.

"బెట్టుసరి కాదు మరదలుపిల్లా! ఆహారధాన్యాలు వేస్టు చేయకూడదని మన నాయకులు శ్లోకధాటీగా చెప్పే పొదుపుధర్మాన్ని గురించి వినలేదూ!" అంటూ హాస్యంగా అన్నాడు

"నాయకుల ఉపన్యాసం విన్నా వినకపోయినా బావగారి ఉపన్యాసం విన్నానులే!" అంటూ కొంటె జవాబిచ్చి మామయ్యతో కలిసి ఇంటికి వెళ్ళిపోయింది.

ఆ రోజంతా ఇక బయటకి కదలలేదు. హాయిగా పుస్తకాలు చదువుతూ గడిపేసింది.

ఆ మర్నాడు తెల్లవారి లేస్తూనే 'ఈ రోజు మామిడితోట దగ్గరికి వెళ్ళిరావాలి' అనుకుంది.

రాజుగారు తలచుకుంటే దెబ్బలకి కొదవలేదని మంజీర తలంచుకొంటే దానికి కించ అప్పీలుండదు గనక చకచకా ముస్తాబవసాగింది.

రెండు జడలు ఒక జడకి వేలాడుతూ రాత్రి తీసి దాచిపెట్టిన మల్లెపూల దండ. తెల్లని ఫుల్‌వాయిల్ చీర తెల్లని టెరీకాటన్ జాకెట్, మెడలో రెండు పేటల మంచి ముత్యాలు. శ్వేతసుందరిలా మెరిసిపోతూ ఎవరికీ చెప్పకుండానే మామిడితోటకి బయలుదేరింది. అంతగా దారిలో ఎవరినన్నా అడగవచ్చులే అన్న ధైర్యంతో. అయితే మామయ్య తోటని ఆమె సులభంగానే గుర్తుపట్టింది వెనకోసారి చూసింది కనుక.

ఉప్పొంగే హృదయంతో శరచ్చంద్రని చూడాలన్న తహతహతో మామిడి తోటలోకి అడుగుపెట్టిన మంజీరకు కొత్త అవతలగా కవిపించిన దృశ్యం ఆమెని నిలువు నిశ్చేష్ఠితురాల్ని చేసింది. శరచ్చంద్ర కౌగిలిలో ఓ యువతి! ఆ దృశ్యం చూసిన మంజీర భగభగమండిపోతూ వెనుదిరిగింది. ఆమెని ముందుగా చూసింది శరచ్చంద్రే! "మంజీరా!" అని మనసులోనే అనుకున్నాడు.

మంజీరకి అహాదపుస్తకం ఉడికిపోతుంది. ఛీ! ఎంత కపటవర్తనుడు! ఎంత మోసకారి! ఓవతో ఇంత తీయగా కబుర్లు చెప్పి ఇప్పుడతను చేస్తున్న పనేమిటి! మరో భామతో సల్లాపాలు సరసాలు. ఛీ! ఇంత నీతి జాతిలేని మనిషిని గురించా తనంత తీయగా వూహించుకుంది!"

వెనుదిరిగిన మంజీర కోపంకొద్దీ నడకవేగం పెంచి త్వరగానే ఇల్లుచేరుతుంది. ఎంత ఉత్సాహం ఉరకలువేస్తుంటే తను అక్కడికి వెళ్ళిందో అంతకు పది రెట్ల నిరుత్సాహాన్ని మోసుకుని వచ్చింది ఎంతో శ్రమపడి అలంకరించుకుని అతనికోసం పరుగులు పెడితే అంతకంతా బాధని వెంటపెట్టుకుని వచ్చింది. ఛీ! ఈ మగవాళ్ళింతే! సహస్రసహస్రాబ్దకం పెట్టినా వాళ్ళ బుద్ధి మారదు. శరచ్చంద్ర మాత్రం మగవాడుకాదూ; అతనికి మాత్రం మంచిబుద్ధి ఎక్కడి నించి వస్తుంది?

తెల్లవారుచుమూసి సల్లాలపారం అని భ్రమపడిన తెలివితక్కువ తనదికాని అతని దేముకోయింది

మంచిగంధం అనుకొని బూడిద అద్దుకోబోయిన అజ్ఞానం తనది. తనని చూసి తనే తిట్టుకోవాలిగాని అతన్ని తిట్టవలసిన పనేముంది.

మంజీర మనస్సు అసూయతో రగిలిపోయింది అందమైన పూలకి ముళ్ళున్నట్టే- పరిమళభరితమైన మొగలిపూలకి- సంపెంగలకి మిన్నాగులు చుట్టుకుని వున్నట్టే అతని అందమైన రూపానికి వెనుక స్త్రీ వ్యసనం- అతని మధురమైన చిరునవ్వువెనుక మాయపుచ్చే విషహృదయం చివరికి ఆలోచించుకొని ఆలోచించుకుని అసూయతో మండిపోతూ చివరికి ఏమీచెయ్యలేని నిస్సహాయత కన్నీళ్ళరూపంలో ద్రవించిపోయింది.

"ఏమిటే ఇలా పడుకున్నావు!" అని అడిగింది కమలమ్మ కంగారుగా

"ఏంలేదులే. నీకన్నింటికీ కంగారే!" అంటూ విసుగ్గా అటు తిరిగి పడుకుంది.

"ఇప్పటిదాకా ఆడుతూ పాడుతూ ముస్తాబయి వెళ్ళిన పిల్లనికి ఇంతట్లోనే ఏమయిందో!" అనుకుంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది కమలమ్మ.

అచ్యుతరామయ్య వస్తూ శరచ్చంద్రని కూడా వెంటపెట్టుకుని వచ్చాడు భోజనానికి.

"నమస్కారం అత్తయ్యా! బాగున్నారా!" అంటూ శరచ్చంద్ర కంఠం వినిపించేసరికి దిగ్గున లేచింది మంజీర.

"ఆ! బాగానే వున్నామయ్యా! ఎక్కడా కనిపించడంలేదేం!" అని అడిగింది కమలమ్మ నవ్వుతూ.

"ఎక్కడత్తయ్యా! తీరుబడిలేదు."

'అవునవును. గోపాలకృష్ణుడయ్యే! పదహారు వేలమంది గోపకాంతలతో బైము ఎక్కడుంటుంది!' అనుకుంది కసిగా మంజీర.

"వంట అయితే వడ్డించమను." అంటూ పెరటిలోకి వెళ్ళిపోయాడు అచ్యుతరామయ్య.

"రామయ్యా! వంట పూర్తి అయిందిగా వడ్డించు" అంటూ తనే పీటలువాల్చి విస్తళ్ళు వేసింది కమలమ్మ.

"మంజూ! అన్నానికి రా!" గుమ్మం దగ్గరనించే పిలిచింది.

"వాళ్ళని తిని లేవనీయమ్మా! మనం తర్వాత తిందాం" అంది శాంతంగానే.

అంతకే సంతోషించింది నెత్తిబాగుల కమలమ్మ. కూతురు కస్సుబుస్సులు అన్నగారి చెవిన, వచ్చిన చుట్టంచెవిన పడకుండా అమ్మాయి వజావుగా సమాధానం ఇచ్చినందుకు ఆవిడ చాలా ఆనందించినా కాళ్ళు కడుక్కుని వచ్చిన అచ్యుతరామయ్య మట్టుకు పూరుకోలేదు.

"ఏదేమిటి అమ్మడూ! ఇంకా ఎంతసేపాగుతావు? బావేగా రా! ఫర్వాలేదులే!" అంటూ ఒకసారి కాదు మూడుసార్లు హెచ్చరించాడు. ఇంక తప్పదని ఆయనమీద వున్న గౌరవంకొద్దీ ముఖంకడిగి బొట్టుపెట్టుకుని వచ్చి పెళ్ళి కూతురిలా పీటమీద కూర్చుంది.

"ఏమిటమ్మడూ అలా డల్‌గా వున్నావు." అని అడిగాడు అచ్యుతరామయ్య.

"నాకిక్కడేం తోచడంలేదు మామయ్యా!" అంది మంజీర.

"తోచకపోతే నేతచీర కట్టుకుని ఓ గంప నెత్తిన పెట్టుకుని పొలంలో పని చెయ్యమను బాబాయి. కావల్సినంత కాలక్షేపం" అంటూ అందుకుని ఓ కొంటె జవాబిచ్చాడు శరత్.

అతని మాటకి చురచురా చూసింది మంజీర

"అలాంటి పన్లన్నీ మీకు బాగా అలవాటు. నాకు మాత్రం అలవాటులేదు" అంది వ్యంగ్యంగా

"నేను మగవాడిని, వద్దనుకున్నా అలవాటవుతాయి." దాన్ని అర్థంచేసుకునే జవాబిచ్చాడు.

"అదే నేను అనేది- నేను ఆడపిల్లని! చేయాలనుకున్నా చేయలేను."

"ఏమిటి బాబాయి, మంజీర సీమటపాకాయలా చిటచిటలాడిపోతోంది. ఏమన్నా కేకలు వేశావేమిటి?" అంటూ మరింత ఉడికించాడు శరచ్చంద్ర.

"ఇంకా మా మంజీర అలా కేకలు వేసేవరకు రానిస్తుందనుకున్నావేటి?" అంటూ గర్వంగా మేనకోడల్ని చూసాడు. మంజీర ఆ సంభాషణంతా పట్టనట్లు గబగబా భోజనంచేసి వెళ్ళిపోయింది అవతలకి.

శరచ్చంద్ర భోజనంచేసి వరండాలోకి వచ్చాడు. అక్కడే నిలబడివుంది మంజీర.

"ఏమిటి అమ్మాయిగారు! పేలాల్లా మాడిపోతున్నారు?" అని అడిగాడు శరచ్చంద్ర.

"ఆ అమ్మాయి ఎవరు?" తపీమని అడిగింది.

"పొద్దున తమరు చూసినమ్మాయా! పేరు కావాలా! అడ్రసు కావాలా?" కొంటెగా అడిగాడు.

"రెండూను." పెంకిగా జవాబిచ్చింది.

"అయితే విను. పేరు ప్రమీల. అడ్రసు విజయవాడలో మాయింటికి దగ్గర. పల్లెటూరు చూస్తానని వచ్చింది. వెళ్ళిపోతున్నానంటే సెండాఫ్ ఇచ్చాను."

"సెండాఫ్ ఇవ్వడం అంటే కావలించుకోవడం ఏమిటి?" ఉక్రోషంగా అడిగింది.

"నేను సెండాఫ్ ఇచ్చే పద్ధతి అదే! రేపు నువ్వు వెడుతున్నా అంతే! అలా తప్ప మరోవిధంగా నాకు సెండాఫ్ ఇవ్వడం రాదు." అతని కొంటెదనానికి ఒళ్ళుమండింది మంజీరకి. ఒట్టి మొండిమనిషి- ఇతనికి సిగ్గు, బిడియం లేదు. లేకపోతే ఎవరంటారిలా! అనుకుంటూ పొగలూసెగలూ పోయింది మనసులో.

"వెళ్ళొస్తాను." అంటూ అటూ ఇటూ చూసి ఆమె చెయ్యి అందుకుని ముద్దుపెట్టుకుని వదిలి, "బాబాయి, వెళ్ళొస్తాను. అత్తయ్యా వెడుతున్నాను," అంటూ మహా బుద్ధిమంతుడిలా చెప్పి రీవిగా వెళ్ళిపోయాడు.

## 4

"అబ్బ! ఈ ఏడు ఎండలు బాగా వున్నట్లున్నాయి. పల్లెటూరులోనే ఇంత వేడి అనిపిస్తుంటే ఇంక బస్తీల్లో ఎంత ఎండ వుందో! అమ్మాయ్! ఆ వట్టివేళ్ళ

తడికలు వేసి బాగా నీళ్ళు చల్లమ్మా!" అంటూ అపసోపాలు పడసాగాడు అచ్యుతరామయ్య.

మేనమామ చెప్పినట్లుగానే వట్టివేళ్ళ తడికలు వేసి నీళ్ళు చల్లుతోంది మంజీర.

"మే ఐ కమిన్" అంటూ వెనకనించి వినిపించేసరికి తృళ్ళిపడి చూసింది మంజీర. అందమైన చిరునవ్వుతో శరచ్చంద్ర. అతని కంఠస్వరం వింటే చాలు నాగస్వరం వింటున్న నాగరాణిలా అయిపోతుంది తను.

"ఏమిటిలా ఎండనపడి వచ్చారు?" అని అడిగింది మంజీర ఆశ్చర్యంగా.

"బాబాయి వున్నాడా?" అని అడిగాడు.

"ఆ వున్నారు. పిలవనా?"

"వూ! అర్జెంటుగా మాట్లాడాలని చెప్పు" అంటూ అక్కడే వున్న పేము కుర్చీలో కూర్చున్నాడు.

లోపలికి వెళ్ళి అచ్యుతరామయ్యని పిలుచుకు వచ్చింది.

"బాబాయి, నాన్న వెంటనే బయలుదేరి రమ్మని కబురుచేశారు. ఇదుగో డబ్బు!" అంటూ జేబులోంచి తీసి అచ్యుతరామయ్యకి అందించాడు.

"అయితే వెళ్ళి రానా?" అని అడిగాడు అచ్యుతరామయ్య దిగులుపడుతున్నట్లు.

"రాను బాబాయ్! అక్కడేం పనేమిటో మనకు తెలియదు గదా! ఆ డబ్బు లెక్క చూసుకో!" అంటూ లేచాడు.

అచ్యుతరామయ్య ముఖంలో బాధావీచికలు కదిలాడాయి. అతను వెళ్ళిపోతున్నాడని విని స్తబ్ధురాలై చూడసాగింది మంజీర.

"మరదలు దాన్ని చూపించనే లేదు," అన్నాడు శరచ్చంద్ర నవ్వుతూ

"ఏదీ! మీరు హఠాత్తుగా వెడుతున్నారుగా!" అంది కాస్త నిష్ఠూరంగానే.

"మరి ఏం చేయను! మా నాన్నగారు వెంటనే రమ్మని కబురు పంపిస్తే. మరోసారి అవకాశం కుదిరినప్పుడు కలుసుకుందాం," అంటూ వడివడిగా అడుగులు వేస్తూ ఆ ఎండలో వెళ్ళిపోయాడు.

"మొత్తానికి శరచ్చంద్ర చాలా ఉత్తముడు మంజూ! అలాంటివాడు ఈ కాలంలో నూటికి కోటికి ఒక్కరుంటారు," అంటూ తెగ మెచ్చుకుంటూంటే శరత్ ప్రియురాలు గుర్తుగా—

"మరే! అతగాడిని నువ్వు ఆకాశానికెత్తేవల్లేవుందే. అంతకుమించి ఈ



భూప్రపంచంలో అతన్ని మెచ్చుకునే నరాధము డెవరూ వుండరు,' అనుకుంది మంటగా ఆ సాయంత్రం రామాలయానికి వెళ్ళింది మంజీర రామాలయంలోకి అడుగుపెట్టగానే ఆనాటి శరచ్చంద్ర గుర్తువచ్చి మనస్సు కలుక్కుమంది

శ్రీరామునికి భక్తిగా చేతులు జోడించి దణ్ణంపెట్టుకుందామంటే అందులోనూ ఆమెకి శరచ్చంద్రే దర్శనమిచ్చి ఆమె నిశ్చలతకి భంగం కలిగించాడు

'ఛీ! ఏం మనిషి! ఆఖరికి భగవంతుడికి భక్తిగా నమస్కారం కూడా పెట్టుకోనీయడం లేదు,' అని అనుకుంది చిరాకుగా

'ఏమయితేనేం అతను తన మనస్సుని పాడుచేశాడు. ఇక్కడినించి త్వరగా వెళ్ళిపోవడం మంచిది' అని ఆ గుడిలోనే నిర్ణయించుకుని ఇంటికి వచ్చింది

"మనం మన ఊరు వెళ్ళిపోదామమ్మా" అన్న కూతురు మాటకి "కాలేజీ తెరవటానికి యింకా టైముంది కదుటే," అంది కమలమ్మ

"ఉందిలే చదువుకోవద్దా! దాన్ని పాడై పోయింది ఇక్కడ వూరికే తింటూ కాలక్షేపం చేయడం తప్ప వేరే ఏం వ్యాపకాలు లేవుగా?"

"ఆ మాట మీ మామయ్యతో చెప్పు, అలాగే వెడదాం"

"చెబుతాను. నాకేమన్నా భయం అనుకున్నావా?"

"మామయ్యా! రేపు మేము బందరు వెళ్ళిపోతాం" అంది ఆ రాత్రి భోజనాల దగ్గర

"అప్పుడేనా! ఇంకా శలవలు ఓ వారం వున్నాయిగా!" ఆశ్చర్యంగా అడిగాడు.

"వున్నాయిలే! ఈ వారమన్నా క్లాసు పుస్తకాలు బూజు దులపద్దా" అని జవాబిచ్చింది

చివరకి ఎప్పుడూ మంజీర మాటే నెగ్గుతూ వుంటుంది కనుక ప్రయాణం ఖాయమైంది

చెల్లెలికి, మంజీరకి బట్టలు తెచ్చాడు అచ్యుతరామయ్య. ఈ వూరు రావడం, శరత్‌చంద్ర పరిచయం అవడం- తన కన్నెమనస్సు తను కదిలించడం- ఆ తర్వాత అతను గోపికాలోలుడని స్వయంగాచూసి తను మండిపడడం - అన్నీ నెమరువేసుకుంటూ ఓ దీర్ఘ విశ్వాసం విడిచింది మంజీర

"నిజానికి తనెవరూ అతనిమీద పెత్తనం చలాయించబోవడానికి? తనేదో సరదాగా నాలుగురోజులు మేనమామ ఇంట వుండిపోవడానికి వచ్చింది అలాగే అతనూ చుట్టరికాన్ని పురస్కరించుకొని వచ్చాడు ఆమిద్దరికీ ఎలా పరిచయమైందో అలాగే విడిపోవలసిందే ఎవరి వూరు వారు చేరుకోవలసిందే ఈ మాత్రపు భాగ్యానికి అతని ప్రియురాలిని గురించి ఆరా లాగడం ఈష్యతో సతమతమవడం ఇవన్నీ అర్థంలేనివి అతనింకా ఫన్నీగా తీసుకున్నాడు గనుక సరిపోయిందిగాని అదే తనలా సీరియస్‌గా తీసుకుంటే మళ్ళీ చెప్పిపోవడానికి కూడ వచ్చేవాడు కాదు

'అవలు అతను నా యిష్టం నేనా అమ్మాయిని ప్రేమించాను. మధ్య నీకెందుకని' అని అడిగితే తన పని ఏమయ్యేది? అతనలా అనలేదు గనుక తన పరువింకా కాస్త నిలిచింది ఈ విధంగా మథనపడుతూనే వుంది బస్‌లో ప్రయాణం చేస్తూ

ఇంటికి వచ్చేశారు ఇల్లు వాకిళ్ళు శుభ్రంచేసుకోవడంలోనే రెండురోజులు సరిపోయాయి మళ్ళీ డాన్సు క్లాసుకు వెళ్ళడం ప్రారంభించింది ఇంటి దగ్గర చదువు, ఫ్రెండ్సు డాన్సు, పీటీల్లో కాస్త కాస్త అడుగున పడిపోయాడు శరచ్చంద్ర గుర్తు వచ్చినప్పుడు మాత్రం మనసు వికలమయ్యేది వెచ్చని అతని స్పర్శ తీయని తన తలపులు, గిలిగింతలు పెట్టేవి ఇంక మళ్ళీ కలుసుకుంటామో లేనేలేదో ఒక వేళ తారసపడినా అతనికి పెళ్ళి అయిన భార్యతో దర్శనమిస్తే తన హృదయానికి శాశ్వత సమాధి కారే కన్నీటిని తుడుచుకోవడం కూడా మరచిపోయి బాధపడేది మంజీర ఎవరి బాధలకోటి, ఎవరి కన్నీళ్ళకోటి కాలపురుషునికి నిమిత్తంలేదు అన్నింటినీ తన కబంధహస్తాల్లో నలిపి వేస్తుంటాడు

రోజులు వారాలుగా వారాలు నెలలుగా మారిపోతున్నాయి క్యాలెండర్లు చిరుగుతున్నాయి మంజీర ఇంటర్ ఫస్టుక్లాసులో ప్యాసై బి.కాం.లో చేరింది మేనకోడలు బి. కాం. చదువుతోందని ఘనంగా చెప్పుతున్నాడు అచ్యుతరామయ్య. ఆ సంవత్సరం తప్ప మళ్ళీ మామయ్యగారింటికి వెళ్ళలేదు మంజీర. కమలమ్మ బాగా జబ్బుపడటంతో సెకండియర్ పరీక్షలయ్యాక వెళ్లడంపడలేదు పల్లెలో ఏం ట్రీట్‌మెంటని బందరులోనే వుండిపోయారు మందులు వాడుతూ. బి కాం ఫస్టియర్ అయ్యాక అచ్యుతరామయ్య రమ్మని బలవంతంచేసినా సెలవల్లో కాలేజీలో ప్రోగ్రాంలు అవి అయ్యాక పిక్నిక్‌లు అవన్నీ అయ్యేసరికి మంజీరకి బాగా అస్వస్థత ఇవన్నీ వరసనే వచ్చి ఆ ఏడూ పల్లెకి పోలేదు మంజీర.

ఇంక వెళ్ళబుద్ధికాక మిన్నకుండిపోయినా శరత్‌చంద్రమటుకు ఆమె మనఃఫలకం మీదనించి చెరిగిపోలేదు. ఏదో ఒకసారి గుర్తువస్తూనే వుంటాడు. మనస్సు కలుక్కుమనిపిస్తాడు

## 5

బి.కాం. ప్యాసైన మంజీర కామర్సుడిగ్రీ తీసుకోవడంకోసం కాన్వొకేషన్‌కి వెళ్ళింది అచ్యుతరామయ్యకి సీరియస్‌గా వున్నదటూ కబురు వచ్చేసరికి కమలమ్మే లేని ఓపిక తెచ్చుకొని వెళ్ళింది. ఆమె వెళ్ళేసరికి పోనేపోయాడు అచ్యుతరామయ్య. అక్కడ శరచ్చంద్రే నడుము బిగించి అతన్ని సాగనంపి వచ్చాడు. కనకపోయినా అతను అచ్యుతరామయ్యకి సీరియస్‌గావుందని కబురు విన్న క్షణమే రెక్కలుకట్టుకు వాలాడు; అతను వచ్చిన మూడోరోజునే పోయాడు అచ్యుతరామయ్య కమలమ్మకి టెలిగ్రాం ఇవ్వమని అతనే చెప్పాడు అడ్రసు కొస్త మాట్లాడుతున్నప్పుడు

కూతురు వచ్చేసరికి తాళంవుంటే కంగారు పడుతుందని ఆ మర్నాడే ఇంటికి వచ్చేసింది కమలమ్మ

డిగ్రీతో ఫోటో దిగి సరదాగా సంతోషంగా ఇంటికి వచ్చిన మంజీర మేనమామ మరణవార్త పిడుగులా కూల్చివేసింది అయన్ని తలచుకుని ఒంటరిగా చాలాసేపు రోదించింది డిగ్రీ వచ్చిన ఉత్సాహంతో తనెంత సరదాగా సంతోషంగా గడపివచ్చిందో ఇంటికి వచ్చేసరికి అంతకు పదిరెట్లు దుఃఖం పెట్టాడు భగవంతుడు. ఒకంట సంతోషం ఒకంట విచారం అనుభవించడానికే మీకు రెండు కళ్ళు పెట్టాను అని అంటూ పక్కున నవ్వినట్లనిపించింది మంజీరకి.

ఇంక ఆ వూరితో తమకి సంబంధం తెగిపోయినట్టే. ఇంక ఎవరికోసం, ఎందుకు వెళ్ళాలి? అనుకుంటూ ఏడ్చింది చాలాసేపు. అయితే మనిషి వేసే అంచనా ఎప్పుడూ తారుమారు చేయడం భగవంతుడికి అలవాటే కనుక మంజీర అనుకున్నదానికి వ్యతిరేకంగా అచ్యుతరామయ్య చనిపోయిన పదిహేను రోజులకి మంజీర పేరుతో ఓ ఉత్తరం వచ్చింది అది ఓ లాయరు గారి దగ్గర్నించి వచ్చింది. అందులో అచ్యుతరామయ్య పోతూ మంజీరకి తను వుంటున్న ఇల్లు, పొలం, మామిడితోట, మరో రెండెకరాలు కొత్తగా కొన్న స్థలం అంతా రాసిఇచ్చిన వీలునామాతో ఆస్తిని వచ్చి స్వాధీనంచేసుకోవలసిందంటూ లాయరు స్వయంగా రాసిన వుత్తరం వుంది

అది చదువుకుని దీర్ఘాలోచనలో పడిపోయింది మంజీర. మామయ్య ఆస్తి ఏంచేస్తాడన్న ఆలోచనే తనకి రాలేదు. తల్లి అనుకుంటూనే వుంది ఏమని రాశాడోనని.

చివరకి ఆలోచించగా ఆలోచించగా వెలివేసినట్లు ఆ వూరికి వెళ్ళకుంటా కూర్చునే కంటే ఓసారి వెళ్ళిరావడమే మంచిదని తట్టింది తల్లి ప్రయాణాలు చేయలేనని ముందే చెప్పడంతో ఆమెకి సాయంగా పనిపిల్లనే వుంచి తను బయలుదేరింది. ఆ పల్లెటూరులో అడుగుపెట్టేసరికి ఆమె గుండెలు దడదడా కొట్టుకున్నాయి. ఆమె కళ్ళముందు శరచ్చంద్రరూపం కదిలి మాయమయింది. అతనెక్కడవున్నాడు! విజయవాడ వెళ్ళిపోయాడా!

ఇక్కడేవున్నాడా? వుంటేమటుకు తను అతనితో చచ్చినా మాట్లాడకూడదు. అతన్ని దూరంగానే వుంచాలి అనుకుంటూ మేనమామఉన్న ఇంట్లోకి అడుగు పెట్టింది. ఆ యింటికి బయట గదితలుపు తాళంవేసి వుంది. ఎలాగా అని సంశయంతో వీధిలోనే నిలబడిపోగా ఆ ప్రక్కనున్నవారు చూసి "ఈ యింటి తాళాలు వంటమనిషి రామయ్యదగ్గ రున్నాయమ్మా. అతనే రాత్రిపూట వచ్చి దీపంపెట్టి వెడుతున్నాడు. ఆ పక్కనే అతని కోసం పాకవేయించారు మీ మామయ్య". అంటూ టూకీగానే అన్నీ వివరించారు. "రామయ్యా" అంటూ తనే గుమ్మందగ్గరకి వెళ్ళి పిలిచింది. లోపల పత్తి ముందువేసుకుని దూదితీస్తున్న రామయ్య చటుక్కున యివతలకివచ్చాడు.

"అమ్మాయిగారా రండమ్మా!" అంటూ ఆహ్వానించి తాళాలు తీసుకునివచ్చి తలుపుతీశాడు లోపల గదులన్నీ మనుష్యులు వున్నట్టే ఎంతో నీటుగ వున్నాయి.

"స్నానంచేస్తారామ్మా నీళ్ళు పెట్టనా?" అని అడిగాడు రామయ్య. "పెట్టు!" అంటూ సూట్ కేస్ గదిలోపెట్టి చీర, రవిక తీసుకుని స్నానానికి బయలుదేరింది




Jayadev

---

వంటగదిలో మూతలు పెట్టిన గిన్నెలు చూసి "వంటచేస్తున్నావా రామయ్యా! ఇక్కడేనా నీ భోజనం," అని అడిగింది మంజీర

"అవునమ్మా" అంటూ జవాబిచ్చి కూరలబుట్ట తీసి కూర, పచ్చడి, చారు నిమిషంలో తయారుచేశాడు

మంజీర జడ అల్లుకుని యివతలకి వచ్చేసరికి భోజనంకూడా వడ్డించేశాడు రామయ్య.

భోజనంచేసి అలా మేనువాల్చేసరికి లోపల ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి. మెలకువ వచ్చినా అలాగే మంచంమీద ఒద్దికగా పడుకుంది

గుమ్మందగ్గర చప్పుడయితే చటుక్కున తల తిప్పి చూసింది శరచ్చంద్ర చేతులు తలుపుమీదవేసి గుమ్మంపొడవునా నిలబడివున్నాడు. అతని కళ్ళల్లో ఆనందం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది అతన్ని చూసి దిగ్గునలేచింది మంజీర అనుకోకుండానే అతన్ని చూసిన ఆనందం ఆమెలోనూ వెల్లువలా రాసాగింది. ఎన్నాళ్ళకో ఎన్ని రోజులకో దర్శనమిచ్చిన అతన్ని చూస్తుంటే గుండెలో ఏదో తెలియని పులకరింత, సిగ్గు అణిగివున్న మమకారమంతా ఒక్కసారే ఉబికివచ్చింది. అంతవరకూ చేసుకున్న నిర్ణయాలన్నీ గాలిలో కలిసిపోగా చిన్నగా మందహాసం చేసింది.

"మంజీరా బాగున్నావా" అని అడిగాడు అనురాగం వుట్టిపడే కంఠంతో.

బాగున్నానన్నట్లు తలవూపింది మంజీర.

"చాలా రోజులకి కనిపించావు" అంటూ నేరుగా అతను గదిలోకి వచ్చేశాడు.

ఇంక బయటకి వచ్చే మార్గంలేక మంచ మీద కూర్చుంది మంజీర. అతనక్కడే వున్న కుర్చీలో కూర్చున్నాడు

"రామయ్యా కాఫీ పట్టుకురా!" అంటూ గట్టిగా చెప్పింది శరచ్చంద్ర మాట్లాడకుండా ఆమెనే చూస్తున్నాడు ఆనాడు తను చూసినప్పుడు పదహారేళ్ళ పడుచు ఈనాడు 21 ఏళ్ళ విద్యావతి ఆనాటికంటే ఈనాడు రెట్టిం పు అందంతో మెరిసిపోతోంది ఆమె మనోహర రూపాన్ని మైమరచి చూస్తున్నాడే తప్ప అతని నోటివెంట మాటే రావడంలేదు ఇంతలో రామయ్య రెండు ప్లేట్లలో పకోడీలు, మంచినీళ్ళ గ్లాసులూ పట్టుకువచ్చి అక్కడే స్టూలుమీద ఉంచాడు

"తీసుకోండి," అంటూ మంజీరే నిశ్శబ్దాన్ని భంగం చేసింది శరచ్చంద్ర ప్లేటు అందుకుని తింటూ, "ఇంతకీ బి కాం పాసయ్యావు పైకి చదవడంలేదా? ఆపేసి ఇంటిపట్టునే వుంటున్నావా?" అని అడిగాడు

"యం కాం చదవాలని ఉందిగాని అమ్మ వద్దు అంది"

"మరి డాన్సు?"

"డాన్సు రోజూ ప్రాక్టీసు మాత్రం చేసుకుంటాను కాని ప్రోగ్రాం లెక్కడా ఇవ్వడంలేదు," జవాబిచ్చింది మంజీర

పకోడీలు తినడం పూర్తి అయింది కాఫీ తెచ్చాడు రామయ్య అది తాగి లేచి నిలబడ్డాడు శరచ్చంద్ర

"ఒకసారి మామిడితోటకి వస్తావా?" అని అడిగాడు

"ఈ రోజు రాలేను మరో రోజు వస్తా. అయినా ఇది మామిడికాయల సీజను కాదుగా! అది అయ్యేపోయింది ఇంక దేనికి రావడం"

శరచ్చంద్ర మాట్లాడలేదు

"నేను బయట పన్లు చూసుకుని చీకటిపడ్డాక వస్తాను" అంటూ బయటికి వెళ్ళిపోయాడు

"చీకటిపడ్డాక వస్తాను" అన్నమాట వినగానే గుండెలు దడదడా కొట్టుకున్నాయి మంజీరకి 'చీకటిపడ్డాక రావడం దేనికి? అసలెవడు రమ్మన్నాడు,' అనుకుంటూ చిరచిరలాడిపోయింది

ఆ సాయంత్రం రామాలయానికి వెళ్ళి తిరిగివచ్చేసరికి ఇంటికి వచ్చిన శరచ్చంద్ర తనకోసమని బయలుదేరి ఎదురొచ్చాడు

"చీకటి పడిపోయింది ఒక్కత్తివీ రావేమని బయలుదేరాను," అంటూ



అతనే ముందు పలకరించేసరికి అంతవరకూ ఆమెని చుట్టుముట్టిన పరితాపాలన్నీ పోగా అతను తనకోసం రావడం గమనించి పరమానందభరితురాలైంది

"ఏం భయమా! ఇక్కడేగా ఇల్లు!"

"ఇక్కడే అయి' కొత్తచోటుగా"

ఇంతలో ఇల్లు రానే వచ్చింది ఇద్దరూ లోపలికి రావడం చూసి కుర్చీ అందించాడు రంగయ్య ఇద్దరికీ భోజనం ఒక్కసారే వడ్డించాడు

భోజనం చేస్తున్నంతసేపూ ఆమె ఆలోచిస్తూనే వుంది ఇక్కడ

ఎన్నాళ్ళనించి ఉంటున్నాడు? ఈ ఇంట్లో ఇతనే వండించుకుని తింటున్నాడా? ఇక్కడే పడుకుంటాడా? ఇలాగే రకరకాల సందేహాలు. అరుబయట పక్క వేశాడు రామయ్య.

"అమ్మా? మీరు లోపల పడుకుంటారా? బయట పడుకుంటారా" అని అడిగాడు.

"లోపలే" అంటూ ఫ్యాను వేసుకుని తలుపు గడియవేసుకుని పడుకుంది శరచ్చంద్ర బయటే పడుకున్నాడు పడుకున్న వెంటనే అతను హాయిగా నిద్ర పోయాడు నిద్రపట్టని మంజీర ఇటూ అటూ దొర్లుతోంది

'తనిక్కడికి ఇతన్ని దూరంగా వుంచాలన్న తలంపుతోనే వచ్చింది కాని వచ్చీరాగానే ఇతనే దర్శనమిచ్చి ఈ విధంగా ఇంట్లో తిష్ఠవేసిఉన్నాడని తనే మాత్రమూ ఊహించని సంగతి. ఇప్పుడేం చేయాలి! ఇతన్ని ఎలా ఈ ఇంటి నించీ సాగనంపాలి? అతని స్త్రీలోలత్వం తెలిసివుండీ ఒంటరిగా తనున్నచోట అతన్నెందుకు అట్టేపెట్టుకోవడం?' ఈ విధంగా ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రపోయింది మంజీర.

## 6

మంజీర జడ అల్లుకుంటూ వరండాలో నిలబడింది "దండాలమ్మా!" అంటూ వచ్చిన వ్యక్తిని చూసి మనసులో ఆశ్చర్యపడినా పైకి కనిపించక చిన్నగా మందహాసం చేసింది.

"నేను మీ పొలాన్ని కవులుకు తీసుకున్నాను మీ మామయ్యగారు ఉన్నప్పుడే ఆయనకి ఒంట్లో బాగాలేదని మూడు సంవత్సరాల ఒప్పందంతో నాకు కవులు కిచ్చారు. మూడేళ్ళూ ఇంకో పదిరోజులతో పూర్తి అవుతుంది మళ్ళీ దయ తలచి మీరు మరో మూడేళ్ళు ఇస్తే " అంటూ అప్పుడే గుమ్మంలోంచి వస్తున్న శరచ్చంద్రని చూసి నోరు తక్కున మూసేశాడు

"ఏమిటి చిదంబరం ఇలా వచ్చావు?" అని అడిగాడు శరత్ అక్కడే వున్న కుర్చీలో కూర్చుంటూ.

"ఏం లేదు బాబూ! మళ్ళీ కవులకి నాకే ఇస్తారేమోనని అడుగుదామని." అంటూ నసిగాడు.

"ఇంక మీరు ఇబ్బంది పడదమనుకుంటాను ఆవిడ వచ్చారుగా! ఆవిడా నేనూ చూసుకుంటాము. ఇంక ఎవరికీ ఇచ్చే ఆలోచన లేదు" అన్నాడు తపీమని తేల్చివేస్తూ.

ఆ మాటకి నల్లబడింది చిదంబరం ముఖం అడిగింది తనవి. జవాబిచ్చింది శరచ్చంద్ర కోపంవచ్చేసింది మంజీరకి

"ఇంకా పదిరోజులుందిగా! ఈలోగా ఆలోచించి చెబుతానంటే మళ్ళీ కలిపించండి," అంది మంజీర. ఆమె మాటకి ఆశ్చర్యంగా చూశాడు శరచ్చంద్ర చిదంబరానికి కొత్త పోయిన కళ తిరిగివచ్చి అమ్మగారికి రెండుచేతులూ ఎత్తి ఓ నమస్కారం పెట్టి వెళ్ళిపోయాడు

"మంజీరా! ఈ ఊరి సంగతి - ఈ ఊరి మనుషుల సంగతీ నీకేం తెలుసు నని నా మాటకి వ్యతిరేకంగా జవాబిస్తావు చిదంబరానికి?" అని అడిగాడు తీవ్రంగా

"అతను అడిగింది నన్ను నేను ఆలోచించకుండా ఏమనకుండానే మీరు యిస్తారు దేనికి జవాబు?" ఉక్రోషంగా అడిగింది

"అతని సంగతి తెలిసినవాడిని నేను తెలియనిదానివి నువ్వు. నువ్వు తొందరపడి వదేవని మూడేళ్ళవరకూ పొలం అతని అధీనంలో వుంచితే అంత పొలానికి మనకి పగిలిస్తాడు కూడా ధాన్యం ఇవ్వడు అలాంటి రకం. అందుకే వద్దని ఖచ్చితంగా చెప్పాను."

"ఆ మాట మీరు ముందుగా నాకు చెప్పివుండవలసింది వాళ్ళు రాగానే వద్దనేదాన్ని. నాకేం తెలియనీయకుండా నా తరపున మామయ్య ఆస్తి నాకు ఇచ్చినప్పుడు పెత్తనం చలాయించడానికి మీరెవరు?" అనుకోకుండానే చాలా తీక్షణంగా అడిగింది మంజీర.

వెంటనే జేబులోంచి డైరీ తీసి అందులో దాచిన కాగితం భద్రంగా తీశాడు శరచ్చంద్ర

"నువ్వు ఏదో క్షణాన నన్నీమాట అడుగుతావని తెలుసు అందుకే ఇది సర్వకాల సర్వావస్థల్లోనూ జేబులో పెట్టుకుని తిరుగుతున్నాను" అంటూ ఆమె చేతికందించాడు.

అందులో ఆస్తి అంతా మంజీరకిచ్చినట్టు, ఆమెకి మేనేజరుగా దగ్గరుండి అన్ని బాధ్యతలూ నిర్వర్తిస్తూ చేదోడువాదోడుగావుంటూ ఏమీతెలియని మంజీరకు అన్నీ కొట్టిన పిండిలాంటి శరచ్చంద్రను సమయోచిత నిర్ణయాలకు, సలహాలకు నియమిస్తూ తన స్వహస్తాలతో అచ్యుతరామయ్య రాసి ఇచ్చిన అధారిటీ వుత్తరం. అది చదివేసరికి, తనేదో ఓడిపోతున్నట్టు ఫీలయిన మంజీరకు తల గిర్రున తిరిగినట్టయి చచ్చిన మామయ్యమీద, ఎదురుగావున్న శరచ్చంద్రమీద అందరి

మీదా ఆగ్రహం మిన్నుముట్టగా విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయింది అది చూసి తనలో తనే నవ్వుకుని అక్కడే కూర్చుని పేపరు తిరగేయసాగాడు శరచ్చంద్ర

మంజీర లోపలికి వెళ్ళిపోయి తనగదిలో కుర్చీలో చతికిలపడింది అతనిచ్చిన కాగితం ఇంకా చేతిలోనే వుంది అది మరోసారి చదువుకుంది ది గ్రేట్ శరచ్చంద్రగారు ఇక్కడ తిష్ఠవేసిన కారణం ఈజీగా అర్థంఅయిపోయింది మంజీరకి తను ఏది వద్దనుకుంటుందో అదే జరుగుతూ వుంటుంది జీవితంలో నాలుగయిదేళ్ళ క్రిందట పరిచయమయి తన హృదయ కవాటాలు తట్టి లోపలికి ప్రవేశించి తనలో వలపు తలపులు రేపిన శరచ్చంద్రని, అతని స్వభావానికి ఏవగించుకుని అతనికి దూరంగా వుండాలని ప్రయత్నిస్తున్నకొద్దీ ఏదో లంకె ఏర్పడుతోంది దగ్గరవక తప్పడంలేదు అలాగే తన మనస్సునూ ఎంత అరికట్టుకుందామని ప్రయత్నించినా అది అతనివేపే పరుగులుతీస్తుంది అతని సమక్షంలో అన్నీ ఎగిరిపోతాయి కోపం కావాలని తెచ్చుకోవడం తప్ప నిజంగా కోపం వచ్చా ? ఛీ ! అతనికా స్త్రీ వ్యామోహం లేకపోతే తను తన్నింకా ఎంతగా ఆరాధించేది అతను తన మీద చెయ్యివేస్తే అతను దగ్గరకి తీసుకున్న ఎన్నో అమ్మాయి క్రింద భావించుకోవాలో తను. ఆ మాట తట్టగానే తనకి వళ్ళంతా కారం రాచుకున్నట్టు వుండేది !

ఆమె అలా కుర్చీ కతుక్కుపోయి వుండగానే వచ్చాడు శరచ్చంద్ర

"ఆ కాగితం ఇలా ఇస్తారా మంజీరాదేవి !" గుమ్మం దగ్గర నిలబడి అడిగాడు శరచ్చంద్ర మాయని చిరునవ్వు నవ్వుతూ.

"తీసుకోండి" అంటూ లేచి అందించింది

"నేను పొలందగ్గరికి వెడుతున్నాను వస్తావా నువ్వు కూడా !"

"ఇప్పుడు రాలేను "

"సరే సాయంత్రం వెడదాం మూడయ్యే సరికి రెడీగా వుండు" అంటూ మళ్లీ ఆమె సమాధానానికి ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు

'రెడీగా వుండు! ప్రతిదానికీ ఈయనగారు నామీద పెత్తనం చలాయిస్తున్నాడు ఈయనగారు రెడీగా వుండు అనగానే పొంగి పోర్లాపడి సిద్ధంగా కాచుకు కూర్చుంటూరా ? ఏమిటా పోడి ఆజ్ఞలు ! అవన్నీ అతని ప్రియురాళ్ళదగ్గర అనుకుంటూ ఉడుక్కొంది మంజీర

మధ్యాహ్నం అతను భోజనానికి రానేలేదు అనుకోకుండానే చాలా పేపు

ఎదురుచూసింది మంజీర అతను భోజనానికి ఎందుకు రాలేదు? తనన్న మాటలకి కోపం వచ్చిందా అని చాలాసేపు మథనపడింది ఆ అందోళనతో తనూ సరిగ్గా భోజనం చేయలేకపోయింది సరిగ్గా రెండున్నరకివచ్చాడు శరచ్చంద్ర

అతను భోజనం చేయలేదన్న చింతతో పీధివరండాలోనే కూర్చొని వుంది మంజీర

"ఏం మంజీరా! ఇంకా ఇలాగే వున్నావేం! జడన్నా వేసుకోకుండా!" అని అడిగాడు

"ఎంతసేపు వేసుకోవాలి? మీరేమిటి మధ్యాహ్నం భోజనానికి రాలేదు!" అని అడిగింది ఆ మాటకి అతని అలసటంతా తీరి సంతోషంగా చూశాడు మంజీర వంక

"నా కోసం ఎదురు చూశావా మంజీరా!" అనురాగమంతా మేళవించి పలకిన అతని పలుకులకు నిలువునా చలించిపోయింది మంజీర

"అవును" అంది తలవంచుకుని తప్పదం ఆపలేక

మెల్లగా ఆమె గడ్డం పుచ్చుకొని తల పైకెత్తి తటాలున రెండు బుగ్గల మీదా ముద్దుపెట్టుకొని, "ఇంక నాకు అన్నమెందుకు మంజీరా! కడుపు నిండి పోయింది" అన్నాడు అర్ధ్రికగా

ఆమె బుగ్గలు రెండూ విరవిరిసిన ఎఱ్ఱగులాబీలయ్యాయి.

"ఇంత మాత్రానికే కడుపు నిండిపోయిందా?" చిలిపిగా అడిగింది

"ఒంత మాత్రానికే స్వార్థంగా కుండదు అంతకుమించి నీవింది ఆశించడానికి నాకు అదృష్టం వుండవద్దూ! అందుకే అంతటితో సంతుష్టిపడటం" అతని మాటలో బాధతో కూడిన చిలిపితనం వున్నది అది కనిపెట్టిన మంజీర మళ్ళీ ఏం అనడానికి తోచనట్టు మౌనం వహించింది

"మంజీరా? మూడు కావస్తోంది తయారుకా!"

"ఎంతసేపు? ముఖం కడిగి చీర మార్చడమే తల రేగలేదు బాగానేవుంది" అంటూ లోపలికి వెళ్ళిపోయింది

శరచ్చంద్ర ఎదురుగా వున్న పడక్కుర్చీలో వాలి కళ్ళు మూసుకున్నాడు అతని కళ్ళముందు మంజీర తలవంచుకుని నిలబడిన దృశ్యం. తనామెని ముద్దాడిన దృశ్యం మధురంగా కళ్ళముందు కదిలిపోతున్నాయి

"రామయ్యా, అయన భోజనం చేయలేదుగా. కాస్త ఎంగిలి పడమను" అంది లోపలికివెళ్ళి

"ఒంటిగంట దాటితే అయ్యగారు భోజనం చెయ్యరమ్మా అందుకే కాస్త వేడి వేడిగా తింటారని ఇడ్లీ వేశాను" అంటూ జవాబిచ్చాడు రామయ్య, "సరే అదే పెట్టు" అంటూ గదిలోకి వెళ్ళిపోయింది

రామయ్య నాలుగిడ్లీ కారప్పొడి – చట్నీ అన్నీ వేసి నెయ్యి బాగా దట్టించి తీసుకువెళ్ళి శరచ్చంద్ర ముందుపెట్టాడు ధ్యానవిష్ఠ సడలినట్లు చిరాగ్గానే అందుకున్నాడు శరచ్చంద్ర

అవి ఆరగించేలోగా కాఫీ తెచ్చాడు అది అందుకుంటూ "అవిడ్ని త్వరగా తయారవమను" అని చెప్పాడు శరత్

"నేను తయారయ్యాను" అంటూ తెల్లని మల్లెపువ్వులాంటి నైలక్స్ చీర, అదే రంగు ఫుల్‌వాయిల్ జాకెట్, మెడలో ఒంటిపేట గొలుసు, దానికి రాళ్ళ లాకెట్ చెవులకి ఆర్టిఫిషియల్ న్యూమోడల్ ముత్యాల దుద్దులు, కుడి చేతికి రెండు బంగారు గాజుల మధ్య అరు తెల్లని సాదా గాజులు, ఎడమ చేతికి ఒంటి రాయి ఉంగరం, వాచీ! కాఫీ త్రాగడం మాని ఆమెనే మైమరచి చూశాడు శరచ్చంద్ర అప్సరసలను కవులు వర్ణించగా చదవడం, ఓహో ఇలా వుంటారు కాబోలు అని వూహించుకోవడం తప్ప ఎవరు చూసి వచ్చారా దేవలోకంపోయి? ఆ అప్సరసాంగన ఎలా వున్నా మంజీర ముందు దిగదుడుపే అనుకున్నాడు గర్వంగా!

"మీరేమన్నా టాయ్‌లెట్ అవ్వాలా?" అని అడిగింది మంజీర

"నాకెందుకు టాయ్‌లెట్! నేనెలావున్నా మన్మధుడినేనని మా ఫ్రెండ్స్ తెగ మెచ్చుకుంటారు" అంటూ కొంటెగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ కాలరు సవరించుకున్నాడు శరచ్చంద్ర

"అబ్బ! ఏం గొప్ప!" అంటూ ఒయ్యారంగా నవ్వింది మంజీర

"మరే! ఇంకరండి" అంటూ ముందుకు నాలుగు అడుగులువేశాడు. అతన్ని అనుసరించింది మంజీర

"నువ్వు కాన్వొకేషన్‌కి వెళ్ళావా మంజీర!" అని అడిగాడు నడుస్తూ

"ఆ! వెళ్ళాను"

"నువ్వు యం కాంలో చేరివుంటే ఓ ఏడాది చదువయ్యేపోయ్యేది డిగ్రీ చేతికివచ్చేపరికి" అంటూ నవ్వాడు

"మరే! విరుడు రిబ్బన్లు ఈ ఏడు పట్టా ప్రదానం" అంటూ కిలకిల నవ్వింది మంజీర



ఆ నవ్వు మంజులనాదంలా వినిపించి అలాగే నిలబడి మళ్ళీ తెలివి తెచ్చుకుని ఆమెని కలుసుకున్నాడు శరచ్చంద్ర

పొలం దగ్గరకి వచ్చేసరికి టెరికాటన్ పాంటు, షర్టు ధరించి ఓ యువకుడు మంజీరకి ఎదురుగారానే కొత్త ముఖం మాడ్చుకున్నాడు శరచ్చంద్ర.

"మంజీరగారు మీరేనా!" అంటూ పలకరించాడు

అవునన్నట్లు తలవూపుతూ ఆశ్చర్యంగానే చూసింది మంజీర

"నేను మీపొలం చూస్తున్న చిదంబరంగారి అబ్బాయిని నా పేరు రామ ప్రసాద్" అంటూ ఆమె ఆశ్చర్యంలో మునిగినట్లు తనని తానే పూర్తిగా పరిచయం చేసుకు ఆమె సందేహం తీర్చేశాడు

అలాగేనన్నట్లు తల పంకించింది మంజీర

"రండి మా ఇంటికి ఇక్కడేమా ఇల్లు" అంటూ సాదరంగా ఆహ్వానించాడు. మంజీర సాలోచనగా శరచ్చంద్ర ముఖంకేసి చూసింది అతను అసలేం వినని వాడిలా అటెటో చూస్తుంటే వెళ్ళడమా మానడమా అని ఇరుకున పడింది మంజీర

చివరికి అతనేటు తిరగకపోవడంతో ఇంక తప్పనిసరిగా అనుసరించింది రామ్‌ప్రసాద్‌ని

నాలుగడుగులు ముందుకువేసి అతను వస్తున్నాడా, లేదా అన్నట్లు తిరిగిచూసింది అతను ఆమె అనుకున్నట్లే అక్కడే నిలబడిపోయాడు

"రండి" అంది మంజీర కాస్త చిక్కుముఖం వేసినట్లు అప్పుడు వచ్చాడు శరచ్చంద్ర కాస్త ఎదురు

మంజీరను, శరచ్చంద్రను చూసి సంతోషంగా ఆహ్వానించారు చిదంబరం, అతగాడి ధర్మపత్ని

రెల్లుగడ్డితో కప్పిన విశాలమైన మూడుగదుల ఇల్లు ముందు గదిలో రెండు మడత మంచాలు ఓ కాన్వాస్ కుర్చీ, వెనకగదిలో దణ్ణానికి వేలాడుతున్న బట్టలు నాలుగు చెక్కపెట్టెలు, ఓ గోడ అల్మారా దానిలోంచి పుస్తకాలు ఒక అర లోంచి, మడత పెట్టిన పాంట్లు, షర్టులు అన్నింటినీ చకచక పరీక్షించాయి మంజీర కళ్ళు

"అమ్మాయిగారికి స్ట్రాంగుకాఫీ పట్టుకురావే" అంటూ పురమాయించాడు చిదంబరం.

శరచ్చంద్ర దిక్కులు చూడటంతప్ప ఏమీ పట్టనట్టు కనిపించాడు అక్కడ మర్యాదల్లోకూడా మంజీరకే ప్రత్యేకించినట్లు తోచాయిగాని శరచ్చంద్ర ఆవాహనే లేదు అది కొంచెం కష్టంగానే తోచింది మంజీరకి

చిదంబరం భార్య చింతామణి రెండు గ్లాసుల్లో కాఫీ తెచ్చి రెండు ప్లేట్లల్లో కారప్పూస పెట్టింది శరచ్చంద్ర తింటాడా తినడా అని కుతూహలంగా చూసింది మంజీర

అతను కూర్చోకుండానే నిలబడే అందుకుని తినసాగాడు అది చూసి తనూ తిన్నది అతను త్రాగాకే కాఫీ తాగింది

రామప్రసాద్ అవి లోపలపెట్టి వచ్చేలోగా "మా అబ్బాయి ఈ ఏడాదే బి ఏ. ప్యాసయ్యాడు బెజవాడలో హాస్టల్లో పెట్టి చదివించాను " అంటూ దర్పంగా చెప్పుకున్నాడు చిదంబరం

"అలాగా!" అంది ఆశ్చర్యంగా రామప్రసాద్ బి ఏ చదివాడని ఏమాత్రం వూహించలేదామె అతను చదువుకున్నవాడేనని తెలిశాక మరింత కుతూహలంగా చూసింది అతనివంక

చామన ఛాయ అయినా కళగల ముఖం పొడవు పొడవుకు సరిపడిన లావు "బావుంటాడు" అనిపించేటట్లే వున్నాడు

"ఇదుగో రామంకాక ఇంకా నలుగురు పిల్లలున్నారు వాళ్ళకి తిండి పెట్టాలి ఆ బాధ్యత మీదే ఈ ఏడుకూడా నాకే కవులుకియ్యండి " అంటూ మరోసారి నమస్కారంచేశాడు చిదంబరం

మంజీర నవ్వుతూ లేచి నిలబడి "అది ఆలోచించి చెప్పాలన్నానుగా అసలు మా లాయరుగారి సలహా తీసుకుని మొత్తం పొలం అమ్మేద్దామనుకుంటున్నాను అందుకే అసలు ఈసారి ఎవరికీ సేద్యానికివ్వదలుచుకోలేదు అమ్మకం అయ్యే దాకా శరచ్చంద్రగారే చూసారు " అంది నిక్కచ్చిగా

"అమ్మ దేశకమ్మా !" అన్నాడు చిదంబరం నోరుతెరిచి

"ఎందుకంటే, నేనుండేది బందర్లో పొలం ఇక్కడ అమ్మి క్యాష్‌చేసుకుంటే బ్యాంకిలో వేసుకోవచ్చు అమ్మ అక్కడ ఒంటరిగా లేదూ " అంటూ మరో మాటకి ఆస్కారం లేనట్టు "పదండి" అంటూ శరచ్చంద్రకేసి చూసి అతనికంటే ముందే దారితీసింది బయటకి

ఒక్క అంగంలో ఆమెని కలుకున్నాడు శరచ్చంద్ర

"మెనీ థాంక్స్ మంజీరాదేవి మీరు నా గౌరవం నిలిపారు " అంటూ ఆమె కేసి ఆనందంగా చూశాడు

మంజీర నవ్వి వూరుకుంది అయితే ఆమె ఆ నిర్ణయానికి రావడానికి శరచ్చంద్ర మాటల్లో నిజం పసిగట్టే తన మామయ్యని మళ్ళీవచ్చి డబ్బు వెన కేశాడని అక్కడున్న కాపేపల్లోనే గ్రహించింది మంజీర

హాస్టల్లో వుంచి మూడేళ్ళు బి. ఏ పూర్తిచేయించడం, వంటిమీద చిదంబరం భార్యామణికి అరుకాసుల గొలుసు కొత్తగా మెరిసిపోవడం చూశాక శరచ్చంద్ర యిందుకే చిదంబరానికి మళ్ళీ సేద్యానికి ఇవ్వవద్దన్నాడని అర్థమయి అక్కడి కక్కడ చప్పున నిర్ణయించి అన్నమాటలవి

చిదంబరం ఇంటికివెళ్ళి చూడకుండా వుంటే, రామప్రసాద్ కనిపించకుండా వుంటే శరచ్చంద్ర సలహాని కొట్టిపారేస్తూ మళ్ళీ చిదంబరానికి మరో మూడేళ్ళు పొలం అప్పగించేదే స్వయంగా ఆమె చూసి విశాలినిజాలు గ్రహించాక ఇంక ఇవ్వబుద్ధి కాలేదు పొలం చేరేసరికి కూలీలంతా శరచ్చంద్ర కోసమేనన్నట్టు కనిపెట్టుకుని వున్నారు

7

"పొలం అంతా దున్నించడం అయింది. ఒక్క వానపడితే బాగుండు." అన్నాడు శరచ్చంద్ర ఆకాశంకేసి చూస్తూ

"ఇంక ఇప్పుడిరోజున కూడా వాననీళ్ళమీద ఆధారపడవలసిందేనా? మన చేలో పెద్ద నుయ్యి తవ్వించి మోటరు పెడితే కావలసినన్ని నీళ్ళురావూ." అంది మంజీర చిరాగ్గా

"వస్తాయి ఎందుకురావు కాని నుయ్యి తవ్వించడానికీ, మోటరుపంపు సెట్టు పెట్టడానికి డబ్బు ఎంతవుతుందో తెలుసా" అని అడిగాడు శరచ్చంద్ర.

"ఎంతయినా అవనీయండి. భరిద్దాము"

"ఆ పద్ధతిలో ఓ లీలను మాట్లాడి మంచిరోజు చూసి పని ప్రారంభిద్దాము"

"ప్రారంభించండి మన పొలానికి కాలవలో నీళ్ళు అందవా?"

"అందవు ఆ కాలవ విషయంలో కొన్ని చిక్కులు వచ్చాయి"

"మరి ఇన్నాళ్ళూ?" ఆశ్చర్యంగా అడిగింది

"ఇన్నాళ్ళూ కాలవనీళ్ళు మనకి పుష్కలంగా వుండేవి. ఇప్పుడది పోయింది. మీ మామయ్యగారి అతి మంచితనం అనర్థంక్రింద పరిణమించింది." అన్నాడు విచారంగా

"మరి ఎలా?" అని అడిగింది మంజీర బేలగా చూస్తూ.

"అది సరిచేసే ప్రయత్నంలోనే వున్నాను." గంభీరంగా జవాబిచ్చాడు శరచ్చంద్ర

అప్పటికే పొద్దువాటారింది. సూర్యుడు పడమటి కనుమల్లోకి పోయి పేద తీర్చుకునే ప్రయత్నంలో వున్నాడు

"రా మంజీరా! వెళ్ళిపోదాం," అంటూ ఆమె భుజంమీద చెయ్యివేశాడు శరచ్చంద్ర

అస్తగతభానుని ఎఱ్ఱదనం మంజీర సునుచెక్కిళ్ళలో ప్రతిఫలించింది.

"వెడుతున్నారా?" అంటూ ఎదురువచ్చాడు రామప్రసాద్. అతని చేతిలో




పెద్ద మల్లెపూలదండ వుంది. అది ఆమె కందిస్తూ "మా అమ్మగారు మీకిచ్చి రమ్మన్నారు," అన్నాడు.

ఏం మాట్లాడాలో తోచక అది అందుకుంది మంజీర. అది చూపేసరికి శరచ్చంద్ర ముఖం ఎఱ్ఱబడింది. 'అతగాడు పూవులు అందించడం- ఈవిడగారు అందుకోవడం, పైగా తలలో ముడుచుకోవడం కూడా!' అనుకుంటూ మనసులోనే మండిపోయాడు. శరచ్చంద్ర ముఖం ఎలా వాడిపోయిందో, దానికి పదింతలు వికసించింది రామప్రసాద్ ముఖం.

"వస్తానండీ!" అంటూ శలవు పుచ్చుకున్నాడు ప్రసాద్ ఆ చీకట్లో శరచ్చంద్ర ముఖంలోని భావాలు గమనించలేకపోయింది మంజీర.

"ఏం అలా ముభావంగా వున్నారు?" అని అడిగింది.

"ఏంలేదులే!" అంటూ మౌనం వహించాడు. ఇద్దరూ కలిసి నడుస్తుంటే మల్లెల సౌరభం అతన్ని మత్తెక్కిస్తోంది. ఆపుకోలేక "మంజీరా!" అంటూ ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి గట్టిగా తనకి అదుముకున్నాడు అతని స్పర్శ ఆమె నెక్కడికో తీసుకుపోయింది

"ఎవరైనా చూస్తారు," అంది చెయ్యి విడిపించుకుంటూ

మెల్లగా చెయ్యి వదిలాడు శరచ్చంద్ర ఇల్లు వచ్చేసింది రామయ్య వంట చేసి వారిద్దరికోసం ఎదురుచూస్తున్నాడు

మంజీర చీర మార్చివచ్చేలోగా శరచ్చంద్ర బట్టలు మార్చుకుని పీటమీద

కూర్చున్నాడు కూడా; ఇద్దరికీ వడ్డించాడు రామయ్య. భోజనంచేసి "పక్క నాకు కూడా ఆరుబయట వెయ్యి రామయ్యా!" అంది మంజీర.

అలాగే నన్నట్లు తల వూపాడు. "నాకు అటుప్రక్క వెయ్యి" అంటూ చూపించింది.

ఇటువేపు శరచ్చంద్రకి అటువేపు మంజీరకి పక్కలు వేసి తను భోజనంచేసి మంచినీళ్ళు కూజా అక్కడే పెట్టి వెళ్ళిపోయాడు రామయ్య. పైన వెన్నెల జిగజ్జేగీయమానంగా ప్రకాశిస్తోంది. ఒకటి రెండు మేఘశకలాలు చంద్రునితో దోబూచులాడుతూ తప్పుకుంటున్నాయి.

అన్ని చుక్కల మధ్య చూడముచ్చటగా వున్న ఆ పూర్ణచంద్రుడినే చూస్తూ నిద్రపోయింది మంజీర. చల్లనిగాలి ఆమెను జోకొట్టింది. శారీరక శ్రమ అధికంగా వున్న శరచ్చంద్ర కూడా వెంటనే నిద్రపోయాడు. ఒక రాత్రివేళ నిద్రో ఒక్కసారి మెలకువ వచ్చింది. ఉన్నట్టుండి తపిమని లేచి కూర్చున్నాడు శరచ్చంద్ర. నాలుగిళ్ళ అవతల వున్న పొట్లగిత్త తాడు తెంచుకుని పారిపోవడంవడింది. అది సరాసరి వచ్చి వాళ్ళ ఇంట్లోకే ప్రవేశించింది. గేటు సరిగ్గా వేయని తమ తెలివి తక్కువకు తిట్టుకుంటూ ఆ గిత్తపోయి అవమరచి నిద్రిస్తున్న మంజీర మీద పడకుండా ఒడుపుగా దాన్ని పట్టుకుని గుంజకి కట్టేశాడు శరచ్చంద్ర.

ఆ గిత్తకోసం పరుగెత్తుకు వచ్చిన బుద్ధిరాజు కృతజ్ఞతగా చూసి గిత్తని ఇంటికి తోలుకుపోయాడు ఇంత జరిగినా మంజీరాదేవి నిద్రకేం దోకాలేక పోయింది. మెల్లగా ఆమె దగ్గరకు వచ్చాడు శరచ్చంద్ర. ఆ వెన్నెలలో తెల్లని పూవ్వుల చీరలో దేవకాంతలా మెరిసిపోతోంది మంజీర. పూలదండ ఆమె మెడని చుట్టుకుని బాగా వికసించడంతో పరిమళాలను వెదజల్లుతోంది. మెల్లగా ఆమె బుగ్గని ముద్దుపెట్టుకున్నాడు. దాంతో మరింత ఉద్రేకం హెచ్చి పెదవులందుకు ముద్దు పెట్టుకున్నాడు. అంతే తపిమని లేచింది మంజీర.

"ఏమిటి ఇక్కడికి వచ్చారు?" అని అడిగింది లేచి నిలబడి.

"నిన్ను, వెన్నెల్లో మెరిసే నిన్ను చూడాలని" ఉద్రేకం ఆపుకోలేక ఆమెని కౌగిలిలో బంధించాడు శరత్.

"ప్లీజ్ వదలండి" అంది మంజీర అతని కౌగిలిలో వివశమవుతూనే. శరచ్చంద్ర వదిలేలా లేదు. అందిన చోటల్లా ముద్దుపెట్టుకుంటూ వుంటే ఉక్కిరిబిక్కిరి అయిపోయింది మంజీర.

"మంచా రాత్రిపూట తోడుగా పడుకుంటానని చెప్పి ఒంటరిగా వున్నానని ఇలా చేయడం మంచిది కాదు," అంది జారే పమిటని సర్దుకుంటూ. ఆమెని మెల్లగా వదిలాడు శరచ్చంద్ర.

"మిమ్మల్ని మామయ్య నాకు మేనేజరుగా, సలహాదారుగా, వుండమన్నాడేగాని ఇలాంటి అఘాయిత్యాలు చేయమనిగాదు–" తీక్షణంగా అన్న ఆ మాటకి మాడిపోయింది శరచ్చంద్ర ముఖం.

"ఐ యామ్ సారీ! విన్నూ, నీ అందాన్ని చూస్తుంటే ఉన్మత్తుడినై ఆపుకోలేక కాస్త తొందరపడిన మాట నిజం. ఏమనుకోకు. నువ్వు యజమానురాలివి, నేను నీకింద పనిచేసే మేనేజరుని," అంటూ తన మంచందగ్గరకి నడచి పక్కబట్టలు ఎత్తిపెట్టి "నువ్వు తలుపులు వేసుకుని లోపల పడుకో, నేను వెడుతున్నాను," అన్నాడు.

"అదేమిటి ఇంత రాత్రిపూట!" అని అడిగింది మంజీర.

"రాత్రయితేనేం! నాకీ ప్రాంతం కొత్తా! పొలానికి కాపలా కాయడం లేదూ!"

"నేను లోపల పడుకుంటాను లెండి. మీ రిక్కడే పడుకుని తెల్లవారాక వెడుదురుగాని. నేను రేపు రమ్మని మా అమ్మకి ఉత్తరం రాస్తాను," అంది మంజీర ఒక్కర్తి పడుకోవడానికి భయపడి. అది గుర్తించిన శరచ్చంద్ర మరీ మొండిగా వెళ్ళలేకపోయాడు.

మంజీర పక్క లోపలికి మార్చుకుని ఫాను వేసుకుని పడుకుంది. శరచ్చంద్ర అలాగే వీధిలో పడుకున్నాడు.

మంజీరని చూస్తుంటే తనకి మతిపోతోంది. ఆమె కాస్త ఇష్టం వున్నట్టే వుంటుంది. అంతలోనే తోక తొక్కిన త్రాచులా లేస్తుంది. ఒక విధంగా తన మీద ఇష్టంకంటే అయిష్టమే హెచ్చు. తన మేనమామ అభిమానస్తుడని గదా అని ఆస్తి వ్యవహారాలు చూస్తుండాలి గదాని కాస్త చొరవగా మాట్లాడినందుకు తను ఆమెని పూర్తిగా అపార్థం చేసుకున్నాదని ఇప్పుడామె మాటలవల్ల పూర్తిగా అర్థమయ్యింది.

"నేను యజమానురాలిని. నువ్వు మేనేజరువి. ఎంతలో వుండాలో అంతలో వుండు." అని ఒక మంజీర వంద మంజీరలై తన మంచంచుట్టూ చేరి ఎలుగెత్తి అంటున్నట్టు భరించలేక చెవులు మూసుకున్నాడు శరచ్చంద్ర. మిగిలిన రాత్రి అతనికి నిద్ర కరువైంది. ఇంక ఎట్టి పరిస్థితుల్లోనూ మంజీరమీద చెయ్యివేసి తన పరువు పోగొట్టుకోకూడదనుకున్నాడు గట్టి నిర్ణయానికి వచ్చిన శరచ్చంద్ర.

లోపల పడుకున్న మంజీరకీ నిద్రరాలేదు. అతని కౌగిలిలో తను పరవశించి

పోతుంది. అతని పిలుపుకో పులకరించిపోతుంది. దూరంగా వుందామనుకున్నా అతన్ని చూడగానే దగ్గరకు చేరుతోంది. తన మనస్సే ఇలా చలించిపోతుంటే- అసలే ఆడపిల్లంటేనే ఐస్ అయిపోయే శరచ్చంద్ర కదిలిపోవడంలో ఆశ్చర్యం ఏముంది? అతనిప్పటికి ఎందరో ఆడపిల్లల్ని అనుభవించిన శృంగార పురుషుడు అలాంటి వాడితో తనకేమిటి? అతను అలాంటి జల్సారాయుడు కాకుండా వుంటే అతని రూపానికి, అతని చిరునవ్వుకూ, అతని తెలివితేటలకి అతని సమర్థతకి తను ఏనాడో అతనికి గులాము అయ్యేది అనుకుంటూ తనలో తనే మధనపడుతూ రాగద్వేషాల మధ్య నలుగుతూ తెలతెలవారుతూండగా చిన్న కునుకు తీసింది. రామయ్య రాగానే తన పక్కా బట్టలు తీసుకుని వెళ్ళిపోయాడు. శరచ్చంద్ర అతను వెళ్ళిపోయినట్టు మంజీరకి తెలిసేసరికి ఏడు దాటింది. "బాబుగారు వెళ్ళి పోయారమ్మా!" అంటూ రామయ్యే చెప్పాడు.

'వెళ్ళడం అంటే మామూలుగా వెళ్ళిపోయాడు కాబోలు కాఫీ గీఫీ తాగకుండా' అని అనుకుంది ముందు. కాని తన బట్టలు - పక్కా దుప్పట్లతో సహా అన్నీ తీసుకుని వెళ్ళిపోయాడు, అని తెలుసుకునేసరికి మనసంతా అదోలా అయిపోయింది. రాత్రి తను చాలా కఠినంగా మాట్లాడింది ఎందుకని? అని ఒకసారి, ఏం? రాత్రి పూట నిద్రపోతుంటే వచ్చి ముద్దులు పెట్టుకోవడం, కౌగలించుకోవడం ఇవన్నీ తప్పుకాదా? తను అంటేనే వచ్చిందా? అసలు తను కాబట్టి అంతటితో సరి పెట్టింది వేరే మరొకత్తె ఉంటే ఆ లెంపా ఈ లెంపా వాయించేది! అను కుంటూ వేరొకసారి జాలి, కోపం, రోషం, ఆవేశం అన్నీ కలగాపులగంకాగా అలాగే కూర్చుండిపోయింది. ఆ తర్వాత తెలివి తెచ్చుకని తల్లికో ఉత్తరం- లాయరుగారికో ఉత్తరం రాసిపడేసింది మంజీర. అప్పటికాని మనస్సు కొస్త తెరిపిన పడింది. ఆ పూట అతను భోజనానికి రాలేదు- రాత్రి పడుకోవడానికి రాలేదు. రామయ్య భయపడుతున్నాడు తోడుగా!

'ఛీ! ఎంత కఠిన చిత్తుడు కనీసం చూడటానికైనా రాలేదు. అవునులే! ఎందుకు వస్తాడు? ఏ భామల కౌగిలిలో నలుగుతున్నాడో! అతనికేం 'కో' అంటే కోటిమంది సుందరాంగులు- క్షణంలో బాలికపోతే పట్నంనించి అయినా రప్పించు కోగల రసిక శిఖామణి శతకోటి లింగాల్లో బోడిలింగం తను అని తనెక్కడ కని పిస్తుంది! ఛీ! ఇలాంటి వాడికి మనసివ్వబోవడం తనదెంత తెలివి తక్కువ!' అనుకుంది సెగలుపొగలు పోతూ మంజీర. కాని అప్పటికి వద్దు వద్దను కుంటూనే మనస్సిచ్చిందన్న సత్యం గ్రహించని, గ్రహించినా ఒప్పుకోవడానికి ఇష్టపడని మంజీర.

# 8

కమలమ్మ కూతురు రాసిన ఉత్తరం అందుకున్న వెంటనే బయలుదేరివచ్చింది. తల్లిని చూడగానే రిలీఫ్ కలిగింది మంజీరకి.

"వారంలోగా వస్తానన్నావు మళ్ళీ నన్ను రమ్మని రాసావు దేనికి?" అని అడిగింది.

"ఇక్కడ పొలం పనులు చూసుకోవద్దమ్మా?"

"అయితే ఇక్కడే వుండమంటావా?"

"ఆస్తి కావాలనుకుంటే వుండొద్దా?" చిలిపిగా అడిగింది తల్లిని.

కమలమ్మ మాట్లాడలేదు. "అయితే మరి నేనూ ఇక్కడే వుండనా?"

"వుండు. మళ్ళీ బాదరు దేనికి? అక్కడేం వుండివచ్చిందని," విసుగ్గా అని అవతలకి వెళ్ళిపోయింది మంజీర.

'పొలంలో బావి తవ్విద్దాం. పంపుసెట్టు పెట్టిద్దాం' అంటే అన్నింటికీ తల వూపిన పెద్ద మనిషి మళ్ళీ అయిపులేదు. మేనేజరంటే ఎలాగేనా వుండేది?' కోపం బుసలుకొట్టింది మంజీరలో. ఆ మామిడితోటలోని ఆతని రాజప్రాసాదానికి తనే స్వయంగా వెళ్ళి అట్టో-ముక్కో తేల్చుకోవడం చాలా మంచిది. ఈ ముసుగులో గుద్దులాట దేనికి? తన మేనమామకు ఇష్టం కనుక తను వెళ్ళడం లేకపోతే అదే ఇంకో మేనేజరయితే ఇంత అవిధేయంగా ప్రవర్తించినందుకు డిస్మిస్ అనేది కదూ! ఆలోచించగా తను వెళ్ళడమే చాలా మంచిది అని గ్రహించి చీర మార్చుకుని సింపుల్‌గా టాయిలెట్ చేసి మామిడితోటకి బయలుదేరింది. బయలుదేరుతున్న మాటేగాని గుండె దడదడలాడుతూనే వుంది అక్కడ అతను తనని చూసి ముఖం మాడ్చుకొంటూ ఎందుకు వచ్చావని అడిగితే తనేం చెప్పాలి! ఏం! ఎందుకు చెప్పలేదు! మామయ్య ఆజ్ఞానుసారం ఆయన రాసిచ్చిన దానికి కట్టుబడి వుంటున్నావా? అని ముఖాన అంటగేయడని తనెందుకు జంకాలి? అసలు ముందు ఆ తోటలో - ఆ యింట్లో - అడుగుపెట్టగానే అతనెంతమంది ప్రియురాళ్ళతో కొలువు తీర్చి దర్శనమిస్తాడో! అప్పుడు తనేం అవ్వాలి? అతగాడా భామలలోంచి తలెత్తి తనని చూడకపోయినా, చూసి ఎరగనట్టు మొహం తిప్పేసినా తనకెంత అవమానం! ఛీ! ఇంతా చచ్చిచెడి పోయేది అవమానాల పాలవడానికా? అనుకుంటూ ఆవేశంతో వెనక్కి తిరిగిపోవాలనుకుంది. కాని, అడుగులు ముందుకే పడినాయి. ఏదయితే అదే అయిందిలెమ్మన్న మొండి ధైర్యంతో చకచకా మామిడితోట దగ్గరికి వచ్చింది. ఆమెని చూడగనే

గంభీరంగా నిలబడిన మామిడిచెట్లు అల్లనల్లనవీచే మలయమారుతానికి తలలు వూపుతూ స్వాగతం పలికాయి చల్లని ఎత్తైన ఆ చెట్లను - ఆ చెట్ల మధ్య నుంచి సన్నగా ప్రసరించే సూర్యకిరణాలను చూస్తూ అదో విధమైన అనుభూతికి లోనయింది మంజీర. ఆ తోట అంతా నిశ్శబ్దతే తాండవిస్తోంది. ఎక్కడా పండుటాకు - ఎండుటాకు అనేదే లేక అతి శుభ్రంగావున్న తోటదారివెంట ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో నడుస్తోంది మంజీర. ఆమె కాలి మంజీరాల ధ్వని తప్ప మరి శబ్దమే లేదు ఆ తోటలో మధ్యగా యాస్‌బెస్టాస్ సిమెంట్ రేకులతో వేసిన షెడ్డు లేత నీలంరంగు గోడలతో ఆ ఆకుపచ్చని చెట్ల మధ్య నెమలి పింఛంలా కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది

లోపల తలుపువేసివుంది. తట్టనా - మాననా; తీరా తలుపు తెరిచాక ఎలాంటి భయంకర దృశ్యం చూడవలసి వస్తుందోనని తటపటాయిస్తూ అక్కడే గుమ్మం ఎక్కుతూ తక్కున ఆగిపోయింది. లోపలనించి మౌత్ ఆర్గన్ కర్ణపేయంగా మొదలైంది. వాయించేపాట స్పష్టంగా వినిపిస్తోంది. "ఎవరివో- నీ వెవరివో.... దివినే వదలి భువికేతెంచిన తేనెల వెన్నెల సోనవో! కవితావేశము కలలై అలలై..." పాట వింటూ తన్మయురాలై అక్కడే నిలబడింది ఆ వాయిద్యానికి అనుగుణ్యంగా ఆమె పాదాలు అప్రయత్నంగానే అడుగులువేస్తున్నాయి పాట ఆగిపోయింది స్పృహ వచ్చింది మంజీరకి. మెల్లగా తలుపు తట్టింది రస భంగం కలిగించినందుకు ఒళ్ళు మండిన శరచ్చంద్ర విసురుగా తలుపు తీశాడు. ఎదురుగా బొమ్మలా నిలబడిన మంజీరని చూడగానే అతనిలో ఆనందం ఉప్పొంగింది చిరాకు ఎగిరిపోయింది

"రండి మంజీరాదేవిగారు! ఏమిటివాళ్ళ ఇలా దయచేశారు." అంటూ హర్షాతిరేకంతో అన్నాడు లోపలకి ఆహ్వానిస్తూ. మంజీర మంత్రముగ్ధలా లోపలికివచ్చి కుర్చీలో కూర్చుంది. గబగబా ఫ్లాస్కులోంచి కాఫీ తీసి అందించాడు.

మతిపోయినదానిలా వుంది మంజీర స్థితి. ఏమి మాట్లాడాలన్నా - ఏం చెప్పాలన్నా గొంతు పెకలిరావటంలేదు! తననుకున్నదేం జరగడంలేదు.

"పలికితే ముత్యాలు రాలుతాయా!" అంటూ నవ్వి "మేనేజరుగారు ఎక్కడ చచ్చారో - అంతూపొంతూలేదని చెకింగ్‌కి వచ్చారేమిటి?" అంటూ తనే ఎత్తుకున్నాడు శరచ్చంద్ర.

"అవును మరి మీరు వస్తారో రారో తెలిస్తే కొత్తవారిని పెట్టుకుందామని" వికర్మోహమాటంగా అన్నది మంజీర.




ఆ మాట వింటూ గంభీరంగా మారిపోయాడు శరచ్చంద్ర. తలెత్తి సూటిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. అతని చూపులో చూపు కలుపలేక తలవంచుకుంది మంజీర

"నాకు రెండు రోజులు శలవు కావలసివచ్చి రావడంలేదు రేపు వద్దామని అనుకున్నాను. ఈ రెండు రోజులనించీ వేరేపనిమీద తిరుగుతున్నాను. మీ కభ్యంతరం లేకపోతే రేపు రమ్మంటే వస్తాను. లేనిపక్షంలో మీరు మరొకరిని పెట్టుకోవచ్చు." అన్నాడు నిక్కచ్చిగా.

"మీరు వేరే పనిమీద తిరుగుతుంటే రానని చెప్పి తిరగవచ్చుగదా. అలా చెప్పా పెట్టాకుండా రోజులకి రోజులు మానేస్తే నా కెలా తెలుస్తుంది."

"నిజమే కావచ్చు. కాని చెప్పడానికి నాకు తీరుబడి అవలేదు." ఆ మాటకి కోపంవచ్చింది మంజీరకి "ఏపాటి దూరం అని చెప్పడానికి వీల్లేకపోవడానికి?" అంది కోపంగానే.

"ఎక్స్క్యూజ్ మీ మేడం! నేను విజయవాడలో వున్నాను. రాత్రే వచ్చాను." అంటూ ముభావంగా జవాబిచ్చాడు.

"ఇంక వెడతాను." అంటూ లేచింది మంజీర.

"కాసేపలా కూర్చో. భోజనంచేసి వెడుదువుగాని."

"అక్కడ మా అమ్మ ఎదురుచూస్తుంది నాకోసం" అంటూ మెల్లగా బయటికి వచ్చేసింది వెనకే వచ్చాడు శరచ్చంద్ర.

"ఇంతకీ నుయ్యిమాట ఏంచేశారు."

"సాయంత్రం అలా పొలందగ్గరికి రండి. నుయ్యి ఎక్కడ తవ్వాలో చూద్దాం."

"ఏదో వాలుచూసి తవ్వించడానికి మళ్ళీ చూసేదేమిటి? టైం వేస్టు గదూ?"

"అలా వాలుచూసి తవ్వితే నీళ్ళుపడొద్దూ. వాస్తుశాస్త్ర ప్రకారం ఈశాన్య మూల ..." శరచ్చంద్రమాటలకి మధ్యలోనే అడ్డుకుంది మంజీర.

"వాస్తు, సింగినాదం. పొలంలో వేసే అన్నింటికీ చూసి చేస్తున్నామా. నాకిలాంటి వాటిమీద నమ్మకం లేదు. నీళ్ళు ఎక్కడ పడతాయనుకుంటే అక్కడ తవ్వించండి."

శరచ్చంద్ర మాట్లాడలేదు. "మీ యిష్టం. కానీ పొలంమీద కనీసం ఓ కొబ్బరికాయన్నా కొట్టి ప్రారంభిస్తే మీకూ నాకూ నమ్మకం లేకపోయినా మీ మామయ్యగారికి- ఈ వూరివారికి వున్న నమ్మకానికి కొత్త విమర్శింప బడకుండా వుంటాము?"

"ఇది మరీ బాగుంది. వాళ్ళు విమర్శిస్తారని మనకి నమ్మకం లేని పనులు చేస్తామా? మనకు మనం మభ్యపెట్టుకునేకంటే విమర్శిస్తే విమర్శించారని ఈ మూఢనమ్మకాల మీద ఎదురుదెబ్బ తీయడమే మంచిది."

"నీకు నమ్మకంలేదని చెప్పడం కూడా మభ్యపెట్టుకోవటమే మంజీర. నువ్వు దేవాలయానికి వెళ్ళడంలేదు? అర్చనలు చేయించడంలేదు? అవన్నీ వున్నప్పుడు ఇవి మాత్రం కొట్టిపారేయడం దేనికి."

"భక్తి వేరు, సెంటిమెంట్స్ వేరు అని నా అభిప్రాయం."

"సరే నీతో నాకు వాదన దేనికిగాని, కనీసం ఆ సమయంలో దగ్గరవుండు నేనే చూస్తానవన్నీ. చనిపోయిన బాబాయి ఆత్మకి సంతుష్టికలగాలని కోరుతూ పని ప్రారంభిద్దాము"

అలాగే నన్నట్టు తలవూపింది మంజీర. ఆమెతో కబుర్లు చెబుతూనే ఇంటి దాకా వచ్చాడు అది ఆమె గుర్తించేసరికి అతను "వెడుతున్నా" అంటూ వెనక్కి తిరిగాడుకూడా. "లోపలకి రండి" అని అన్నా తను వినిపించుకోక్లే వెళ్ళిపోయాడు శరచ్చంద్ర.

"ఎక్కడికి వెళ్ళావే?" అని అడిగింది కమలమ్మ.

"మామిడితోట దగ్గరకమ్మా. ఆస్తి అంతా రాసిచ్చాడు మామయ్య. అన్నీ ఒక్కసారి చూసుకోవద్దూ."

"విజమేలే" అంటూ కమలమ్మ కూడా ఒప్పుకున్నాక లోపలికి వెళ్ళిపోయింది మంజీర.

ఆమె కళ్ళముందు శరచ్చంద్ర కనిపిస్తున్నాడు. అబ్బ అత నెంతబాగా వాయించాడు మౌత్ ఆర్గన్. ఇంతకి అతగాడి ప్రియురాలు ఎక్కడా మళ్ళీ కనిపించలేదేం? చటుక్కున గుర్తువచ్చింది. "విజయవాడలో వున్నాను" అన్న శరచ్చంద్రమాట ప్రతిధ్వనించగానే తల తిరిగిపోయింది ఆవిడగారి నిక్కడికితెస్తే అల్లరి అవుతుందని తనే అక్కడికి పోయివస్తున్నాడు అమ్మో! ఎంత మోసకారి! తన కౌక్షణంతో గుర్తేరాలేదు. ఔరా అతనెంత తేనెపూసిన కత్తి ఎంత చక్కగా కబుర్లు చెప్పాడు. ఎప్పటికప్పుడు తీయనిమాటలతో అతను తనకి మత్తుజల్లుతూనే వున్నాడు. లేకపోతే కుక్కతోక వంకరలా ఎంత సాపుచేసినా ఎంతైనా అతగాడి వక్రబుద్ధి మారుతుందేమిటి? అనవసరంగా బావి తవ్వించడంలో జాప్యం జరుగుతోంది. ఇలాంటి శృంగార పురుషుణ్ణి మేనేజరుగా పెట్టిపోయిన మేనమామ తెలివితేటల్ని మెచ్చుకోవాలి మరి. ఆడపిల్ల అందమైంది కనిపిస్తే తినే అన్నం మాని ఆ పిల్ల వెనక పడిపోయే రకాన్ని పెట్టుకుని తను సేద్యంచేయాలని చేయించాలని అనుకోవడం ఎంత బుద్ధితక్కువ పనో బాగా అర్థం అవుతోంది. లాయరుగార్ని రమ్మని ఇక్కడ ఈ పొలం వగైరాల అమ్మకం విషయం చర్చించి మొత్తం అమ్మిపారేసి బందరుపోతే నయం అనుకుంటూ మంటగా.

మంజీరని దింపి ఇంటికి వచ్చిన శరచ్చంద్ర భోజనం చేయకు డానే మంచం మీద వాలిపోయాడు. అతని మనస్సంతా అల్లకల్లోలంగా తయారైంది. అతని కళ్ళముందు అన్నీ పోగొట్టుకుని శ్రీనాధుడిలా మారిపోయిన తండ్రి దీనవదనం కనిపిస్తోంది.

ఎంతవారికైనా కాలం, ఖర్మం కలిసిరాకపోతే అంతేనేమో! శ్రీరాముడు అడవికి పోయాడంటే- పాండవులంతటివీరులు విరాటుడి దగ్గర వూడిగం చేశారంటే మరి కాలమహిమే! వాళ్ళు పురాణపురుషులు కనుక వాళ్ళకి ధీరోదాత్తత ఎక్కువేమో. మరి తామంతా సామాన్యమానవులు- తట్టుకోవడం కష్టం. రేపు మంజీర దగ్గర డబ్బు తీసుకోవాలి. బాబాయి అయితే కవిపెట్టి జేబులో అన్నా పెట్టి పంపేవాడు డబ్బు. మరి పెత్తనం ఈవిడది అందులో తనంటేనే చిటపటలాడుతుంది. అలాంటి ఆమెదగ్గర డబ్బు అడిగి తీసుకోవాలంటే ఏమవుతుందో.

తను అగ్రికల్చర్ బి. యస్‌సి. ప్యాసయ్యాడు. ఎక్కడన్నా ఉద్యోగం

చేసుకోలేదా. ఎందుకి వూరిమీద చచ్చిపోయిన అచ్యుతరామయ్య మీద ఇంకా అభిమానం! బతికివున్నవాళ్ళనే గడ్డిపోచలకింద చూసే ఈ లోకంలో చచ్చిన ఆయనకోసం ఆడదాని చేతిక్రింద దేహీ అని యాచిస్తూ బ్రతకడమా! ఛీ ఇంతకంటే తలవంపులేంవుంది?

అతనిలో పురుషాభిజాత్యం తలెత్తింది ఒక్కసారిగా. 'ఏం తను వూరికే తీసుకుంటాడా? ఇక్కడ మామిడి తోటని పొలాల్ని అన్నింటినీ సంరక్షించడం లేదా. తాను లేకపోతే మంజీరవల్ల ఏమవుతుంది? ఆమెని చిదంబరంలాంటి చెదపురుగులన్నీ తినేయవూ! మంజీర తనకంటే చిన్నది ఆపిల్లకేం తెలుసని భరత నాట్యం తప్ప. ఏదో చిన్నతనంకొద్దీ ఆమె మాటలు పట్టించుకుని తన దారి తను వెళ్ళిపోతే ఆమెగతి ఏమవుతుంది? అలా అని ఆమె ఏ అధికారం చెలాయించినా ఎలా భరించడం?' ఈ విధమైన సంఘర్షణలోనే కొట్టుమిట్టాడుతూ విద్రలోకి జారిపోయాడు శరచ్చంద్ర.

## 9

నాలుగు గేదల్ని, రెండావుల్ని వెంటపెట్టుకు పొద్దున్నే వచ్చిన చిదంబరాన్ని చూసి విస్తుపోయింది మంజీర.

"ఇవి మీవేనమ్మా! ఇన్నాళ్ళూ మాదగ్గర మాగొడ్లతోపాటు సాకాను, మీ పొలం చేస్తున్నాగనక. ఇప్పుడు మాకు మీ కమతం లేదయ్యె. వీటికి చిట్టు, తవుడు, గడ్డీ అన్నీవేసి ఎవరుచూస్తారు? ఎలా చూస్తారు. మీరు చూసుకోండి" అంటూ అక్కడేవున్న చెట్లకి తాడుతో కట్టేసి నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోయాడు చిదంబరం

ఆ గేదల్ని, ఆవుల్ని చూడగానే కంగారెత్తుకువచ్చింది మంజీరకి- వీటిని సాకడం ఎవరికి తెలుసు? ఎవరివల్ల అవుతుంది. తన కసలేరాదు- తల్లికీ రాదు- ఇంకెలాగా! వెంటనే ఆపద్బాంధవుడిలా శరచ్చంద్ర గుర్తుకు వచ్చాడు.

ఇంక చేసేదేముంది. మామిడితోటకి పరుగెత్తడమే! ఆ హడావుడిలో ఆమెకి అతను వచ్చేదాకా ఆగాలి అనిపించలేదు. చాలా రోజులయిందని డాన్సు ప్రాక్టీసు చేసుకుంటున్నది కాస్తా ఆ కాలిగజ్జెలన్నా విప్పకుండా అలాగే మామిడితోటకి బయలుదేరింది.

'అల వైకుంఠ పురంబులో-నగరిలో-ఆమూల సౌధంబు దాపల' అన్నట్టు ఆ మహానుభావుడే రమావినోదంలో గడుపుతున్నాడో" అనుకుంటూ ఆదరాబాదరా బయలుదేరింది. ఆ మామిడితోటకి వెనక పిల్లకాలువ వుంది. ఆ కాలువలో నీళ్ళే



మామిడితోటకి ఉపయోగిస్తుంటారు. అక్కడ శరచ్చంద్ర స్నానంచేస్తుంటాడు. లేదా నీటిమీదకు వంగిన చిటికేసరపు చెట్టుకొమ్మమీద వాలి ఉదయాస్తమయ శోభను తిలకిస్తూ, మౌత్ ఆర్గన్ వాయించుకుంటూ తన్మయుడవుతూ వుంటాడు. లేదా అక్కడేవున్న పెద్ద బండరాయిమీద కూర్చుని కాలువలోకి చూస్తూ అలో చనల్లో మునిగిపోతూ వుంటాడు అవన్నీ అతనికి మనశ్శాంతినిచ్చే సుందర తీరాలు

మామిడితోటలోకి అడుగుపెట్టిన మంజీరకి బయట గొళ్ళెంవేసిన షెడ్డు కని పించేసరికి ఎక్కడికిపోయాడాని విస్తాంతపోతూ వెనుకవైపుకు వచ్చింది వెతుక్కుంటూ. అక్కడ— కనిపించిన దృశ్యం ఆమెని విశ్చేష్టితురాల్ని చేసింది.

పెద్ద బండరాయిమీద కూర్చుని నీళ్ళల్లోకి కాళ్ళాడిస్తూన్న ప్రమీల— ఆ పక్కనే కొమ్మమీద వాలి ఏమిటో చెబుతున్న శరచ్చంద్ర. మంజీర తల గిర్రున తిరిగింది. వెనక్కి వెళ్ళలేక— ముందుకు పోలేక అక్కడే నిలబడి పోయింది. ప్రమీల లేచింది. వెనక శరత్— "ఏదో సామెత చెబుతారు చూడు. తన పొలం పేద్యానికిచ్చి తను కూలికి బయలుదేరాడని— అలావుంది ఇప్పుడు

నా పని." అంటూ ఆమె వెనకే వస్తున్నవాడల్లా మంజీరను చూసి ఠక్కున ఆగిపోయాడు. ఆమెని ఆపాదమస్తకం పరిశీలించి "ఇదేమిటి మంజీరా! ఇలా ఉదయమే బయలుదేరావు?" అంటూంటే పట్టుపడినదానిలా అయిపోయింది మంజీర. ప్రమీలని పరీక్షగా చూసింది. అన్నివిధాలా మగవాణ్ణి రెచ్చగొట్టేట్టు వుంది ఆమె శరీరం, అలంకరణకూడా. ఇలాంటి ఆమె కనిపిస్తే పడుతుకునే మూర్ఖుడా శరత్.

"ఏమీలేదు. చిదంబరం తనకిచ్చిన పొలం అప్పగించలేదని అవుల్ని, గేదెల్ని గుమ్మంలో దింపిపోయాడు. అవి ఎక్కడన్నా అప్పగిస్తారేమోనని చెప్పడానికి వచ్చాను," అంది మంజీర తీవ్రపోయిన కంఠంతో.

ఆ మాట వినగానే శరచ్చంద్ర ముఖం ఎఱ్ఱబడింది.

"ప్రమీలా నువ్వు లోపల కూర్చో! నేను అరగంటలో వస్తాను." అని "రా మంజీరా!" అంటూ గబగబా నడవటం ప్రారంభించాడు. అతనితో సమానంగా పరుగులాంటి నడక సాగించేసరికి గజ్జెలు ఘల్లుఘల్లు మంటున్నాయి.

"డాన్సు ప్రాక్టీసుచేస్తూ వచ్చావేమిటి?" అన్నాడు నవ్వుతూ. అప్పుడా గజ్జెల్ని గమనించి సిగ్గుపడి, "అవును రాజేశ్వరి వచ్చేదామనుకుంటే అత నెక్కడికో వెళుతున్నాడని విన్నానే చెప్పాడు. ఈపూట వంట అమ్మే చేసుకుంటోంది నా పని చూసేసరికి తోచక అలాగే బయలుదేరాను."

"ఆ చిదంబరంగాడంతే. తనే పెద్ద గొప్పవాడనుకుని ఇంటికి తోలుకుపోయాడు, బాబాయికి తీయగా కబురు చెప్పి. వాటి రక్షణకోసం బాబాయి పంపే పన్నీ తన పశువులకి వుపయోగించుకుంటూ. ఓ శేరు పాలు మీ యింటికి పంపి మిగతావన్నీ పొరుగూళ్ళకు పంపి అమ్ముకుంటూ డబ్బు కూడబెట్టుకుంటూ వచ్చాడు. ఇప్పుడు గడ్డే కరువయ్యే వీటిన్ని మేపేదెలా. చేసేదేంలేక ఇక్కడే దింపినా అందులోని అంతరార్థం మళ్ళీ ఖర్చులు భరిస్తాం, ఆ పశువుల్ని నువ్వే చూడు అని మనం తిరిగి అతనిచేతిలో పెట్టాలనే ఆ అటలింక సాగనీయవద్దు."

"మరెలా! మా కివి చూడటం రాదుగా." బేలగా చూసింది.

"నేనున్నానుగా: అన్నింటికీ కాలభైరవుడిని" అంటూ మందహాసంచేశాడు శరచ్చంద్ర.

పల్లీయులు చాలా అమాయకులని తను అనుకున్నందుకు వీళ్ళ తెలివితేటల్లో బస్తీవాళ్ళని మించిపోతున్నారు అనుకుంది ఆశ్చర్యంగా మంజీర.

ఇంటికి వచ్చేసరికి 'అంబా' అంటున్నాయి ఆవులు. నీటికోసం చూస్తున్నాయి గేదెలు.

"ఇవిక్కడుంటే ఆ మొక్కలన్నీ పాడయిపోతాయండీ!" అంది దిగులుగా తను వేసిన చామంతి మడులను చూపిస్తూ.

అతనంతా పర్యవేక్షించి చివరికి రామయ్య పాకకి కాస్త దగ్గరగావున్న స్థలం ఎన్నుకుని అక్కడో నాలుగు గుంజలు పాతించి తడికలమీద గడ్డి- ఓ కొట్టిలో తవుడు కలిపిన నీళ్ళు పెట్టించాడు. ఇవన్నీ కళ్ళింత చేసుకొని చూస్తోంది మంజీర. అప్పటికప్పుడే ఓ మెరికలాంటి కుర్రాడిని కుదిర్చాడు.

"రెండుపూటలా మీకు ఎన్ని పాలు సరిపోతాయి. ఓ శేరు చాలవా? కాఫీలకి- పెరుగుకి?" అని అడిగాడు శరచ్చంద్ర.

"చాలకేం? ఇద్దరమేగా!" అంది మంజీర.

చివరికి ఓ శేరున్నర పాలు ఇంట్లోకి అట్టిపెట్టి మిగిలినవి గ్రామీణ పాల సేకరణ కేంద్రానికి పోసే నిర్ణయం జరిగిపోయింది.

"అక్కడ బెజవాడ లాంటిచోట పాలకి ఇబ్బంది వుంటూనే వుంది మంజీరా. మన పల్లెల్లోని వారంతా కేంద్రానికి పంపిస్తే తమకి కాగా మిగిలినవి అక్కడ అన్నిచోట్లకి సరఫరా చేస్తారు. ఆ కేంద్రానికి ఉడతాభక్తిగా మనమూ సాయం చేద్దాం" అన్నాడు నవ్వుతూ

మంజీర సంతోషంగా ఒప్పుకుంది.

అక్కడ పనులన్నీ పూర్తి అయ్యాక, "వస్తాను మంజీరా!" అంటూ ఎంత వేగంగానూ వెళ్ళిపోతుంటె అదంతా ప్రమీలకోసమేనని తట్టగానే ఒంటికి కారం రాసుకున్నట్లయింది మంజీరకి ఏదో తెలియని ఉక్రోషం- ఈర్ష్య, కోపం అన్నీ కలిసి కన్నీళ్ళరూపంలో బయటికి ప్రవహించాయి.

తను ఎంత భయపడుతూ అడుగుపెట్టిందో దానికి తగినట్టే అతనామెతో కబుర్లుచెబుతూ కనిపించాడు. ఇంతకీ ఆమెగా రెప్పుడు వచ్చిందో. పొలంలో ముఖ్య తవ్విస్తున్నారు, అక్కడే వుంటున్నానన్నాడు మరి. అది కూలీలకి అప్పగించి తను ప్రమీలతో కులుకుతున్నాడు కాబోలు. తను అతన్ని దూరంగా వుంచింది కనుక బ్రతికిపోయింది. లేకపోతే ఆమెని ముద్దాడిన నోటితోనే తననికూడా.... ఛీ! సిగ్గులేని మనిషి కోపంతో కుతకుతా వుడికిపోయింది. పైగా ఆవిడగారంటే ఎంత ప్రేమ లేకపోతే తన కుటుంబాన్ని గురించి తన కష్టసుఖాల్ని గురించి చెప్పుకుంటాడు. 'సొంత పొలం సేద్యానికిచ్చి తను కూలీకి

వెళ్ళినట్లుంది.' అని తనతో ఏనాడన్నా మాటమాత్రం చెప్పాడా? తన పరిస్థితిని గురించి అసూయతో మండింది మంజీరకి.

"యితనా నుయ్యి త్వరగా తవ్వించేవా, పెట్టేనా. సాయంత్రం తనే వెళ్ళి చూసుకుంటే సరి," అనుకుంది ఉక్రోషంగా,

అలాగే వెళ్ళింది కూడా! అయితే ఆమె ఆలోచనలని, అంచనాలని తారుమారుచేస్తూ శరచ్చంద్ర అక్కడ నూతిదగ్గరే వున్నాడు. అంతేకాదు, అతని ముఖంలో ఆనందం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. మంజీరని చూడగానే "మంజీరా! మన పొలంలో ఎంత మంచినీళ్ళు పడినాయో చూడు," అంటూ ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతుంటే అన్నీ మర్చిపోయిన మంజీర వంగి చూసింది. స్వచ్ఛమైన నీరు కన్నులపండువుగా దర్శనమిచ్చింది.

"ఇంక మనం బంగారం పండించవచ్చు మంజీరా," అంటూ సంతోషంతో తలమునకలవుతూనే ఆకాశంకేసి చూశాడు. నల్లని మబ్బుతునక కాస్తకాస్తే పెద్దదవుతోంది, ఏ రాత్రికో వర్షంపడుతుంది అనిపించేట్టు.

"రేపు ఉదయం డబ్బు తీసుకువెళ్ళండి కావాలన్నారుగా," అంది మంజీర.

"మెనీ థాంక్సు మంజీరా!" కూలీలకి డబ్బు అందిస్తూ అన్నాడు శరచ్చంద్ర.

"ఇంటికి వెళ్ళిపో! చీకటి పడుతోంది. పైగా మబ్బు కూడా పట్టింది," అన్నాడు శరచ్చంద్ర.

మంజీర అలాగేనన్నట్టు తలవూపి బయలుదేరింది. నాలుగడుగులు వేసేసరికి ఎదురయ్యాడు రామప్రసాద్.

"మీరు మళ్ళీ మా యింటికి రానేలేదేమండీ?" అని అడిగాడు.

"తీరుబడిలేదు," అంది నవ్వుతూ.

"పోనీ ఇప్పుడు రండి. ఎలాగో ఇంత దూరం రానే వచ్చారుగా!" అన్నాడు ఆమెతోపాటే అడుగులు వేస్తూ. అది శరచ్చంద్ర ఎక్స్‌రే కళ్ళని తప్పించుకోలేదు. ఇద్దరూ కబుర్లాడుకుంటూ నడుస్తుంటే శరచ్చంద్రలో అసూయ రగిలినా 'ఆమెకి అతనంటే మోజులా వుంది. మధ్య తనెందుకు కల్పించుకోవడం.' అని విరక్తంగా వూరుకున్నాడు, తన మనస్సుని తనే మందలించుకుంటూ.

"రండి, రండి!" అంటూ చిదంబరం సంతోషంగా చూశాడు ఆ ఇద్దర్నీ తన కొడుకు, ఆమె పక్కన పక్కన నడుస్తూ వస్తుంటే మహా సంబరంగా ఉంది. ఆ క్షణంలోనే అతనిలో మెదిలింది ఓ గొప్ప అయిడియా. ఎలాగయినా అమ్మాయిగారిని తన కొడుక్కి చేసే పరిస్థితి వస్తే కోటలో పాగా వేసినట్టే! బంగారం

లాంటి పిల్ల- అంతకు పదిరెట్లు బంగారంలాంటి ఆస్తి! ఆ ఆలోచనకే మురిసి మూర్ఛపోయాడు చిదంబరం.

చింతామణి మొగుడికంటే రెండాకులు ఎక్కువే చదివింది కనుక ఓ ప్లేటులో సున్నివుండలు, పకోడీలు తెచ్చి ముందుపెట్టి "తినమ్మా! అసుర సంధ్యవేళ మా ఇంటికి స్వయంగా మహాలక్ష్మిలా వచ్చావు." అంటూ అతి ఆప్యాయంగా పక్కనే కూర్చుంది. మంజీర కా క్షణంలో ఏమీ తినాలని లేదు. అందులో అక్కడ అసలు తినాలని లేదు. అయితే అలా వదిలే రకం కాదు చింతామణి.

"ఈ పూట భోజనానికి వుండమ్మా!" అంది పక్కనే వున్న విసనకర్రతో విసురుతూ.

"అబ్బే వద్దండీ. మా అమ్మ...." మంజీర మాట పూర్తి కానేలేదు తక్కున అందుకున్నాడు చిదంబరం.

"బలేదానివమ్మా! ఏదో ఈనాడు కాస్త లేదగా కనిపిస్తున్నామేగాని మేమూ ఒకప్పుడు దర్జాగా బతికినవాళ్ళమే. అసలు మీ కులం మా కులం ఒకటే!" అంటూ ప్రారంభించి హిస్టరీ అంత తిరగేయసాగాడు. ఆ సోది వినలేక ఈ ఫలహారం చేసి తొందరగా పోతే చాలు అనిపించిన మంజీర ఆ మినపసున్ని ఆ పకోడీలు కష్టంమీద పట్టించింది కడుపులోకి. అంత మాత్రానికే అపితే ఇంకేముంది? ఆవిడ చింతామణి కాదు—ఆయన చిదంబరమూ కాదు గనక స్టీలు గ్లాసునిండా పొగలు గక్కే కాఫీ తెచ్చి ముందుపెట్టారు అది తాగేసరికి విశ్రాంతి పెట్టింది మంజీరకి "ఇంక వెడతాను" అంటూ బయలుదేరింది.

"వెళ్ళి అమ్మాయిగారిని ఇంటిదగ్గర దింపి రారా, ప్రసాద్," అంటూ ఇద్దరూ ఊదరగొట్టారు ప్రసాద్ని.

"పదండి, బాగా చీకటిపడిపోయింది. వర్షంకూడా వచ్చేటట్టు వుంది" అంటూ ఆమెతో బయలుదేరాడు రామప్రసాద్.

"మీరిక్కడే స్థిరపడుతున్నారా?" అని అడిగాడు ప్రసాద్.

"ప్రస్తుతానికి అంతే!" ముభావంగా జవాబిచ్చింది మంజీర దారిలోనే చినుకులు ప్రారంభమైనాయి. అది చూసి భయపడింది తిన్నగా ఇల్లు చేరగలనా లేదా అనుకుంటూ.

"ఇక్కడే వుండండి. ఇంటికి వెళ్ళి గొడుగు తెస్తాను," అంటూ మర్రిచెట్టు చూపించాడు.

"వద్దులెండి. గబగబా నడిస్తే ఏపాటి దూరమని," అంది ఆగకుండానే

"ఏపాటి దూరమైనా తడిసిపోతారు," అంటూనే ఆగకుండా పరుగుతీశాడు

ఆతను తిరిగి వచ్చేదాకా ఇంక ఆగక తప్పదురా భగవంతుడావి విసుగ్గా
ులబడింది

చినుకులు పడుతుంటే మంజీర వెళ్ళిందో లేదోనన్న కంగారుతో అడ్డంపడి
వస్తున్న శరచ్చంద్రకి రామప్రసాద్ గొడుగుతో పరుగెత్తడం-ఇద్దరూ కలిసి
గొడుగులో వెళ్ళడం గమనించి కోపంగా పెదవి కొరుకుతూ అసూయతో
రగిలిపోతూ గజావిలో ఆంగ చొప్పున ఎదురుగా వెళ్ళిపోయాడు మామిడితోటకి

వాన కొంచెం పెద్దది అయ్యేసరికి ఇంటికి రానే వచ్చేసింది మంజీర

"వెళ్ళివస్తానండి" అంటూ శలవు తీసుకున్నాడు ప్రసాద్

ఇంటికి వస్తూనే భళ్ళున వాంతి చేసుకుంది మంజీర అది చూసి కమలమ్మ
హడలిపోయింది విక్షేపంగా వెళ్ళిన పిల్ల ఇలా అయిందేం అనుకుంటూ
దిష్టి తగిలిందేమోనని గబగబా చారెడు ఉప్పు దిష్టితీసిపోసింది అలాగే మంచం
మీద వాలిన మంజీర తెలివిలేనట్టు కళ్ళుమూసుకోవడం, వెంటనే వానగాలికి
నిద్రపోవడం రెండూ జరిగిపోయాయి ఒకటి రెండుసార్లు కమలమ్మ వచ్చి
లేప టాఖంలేక తనేదో కొంచెం కాఫీ త్రాగి పడుకుంది భోజనంచేయకుండా

శరచ్చంద్ర ఇంటికి వెళ్ళేసరికి పూర్తిగా తడిసి ముద్దయిపోయాడు ఆ
బట్టలు మార్చుకొని మంచంమీద పడ్డాడు అతనికి ఆ క్షణంలో వేడి వేడి కాఫీ
తాగాలని వుంది ప్లాసు-లో చూస్తే లేదు మళ్ళీ కావాలి అందుకు ఓపిక
లేదు పాలూ లేవు ఛీ! ఎందుకు ఏచ్చిన బతుకు తనది! వీళ్ళకి సేవచేస్తూ
వు టం-టింపకి కు డా ముఖం చాచడం తనకేం ఖర్మ! ఇలా ఈ పూట కాఫీకి
[illegible] ఈ పల్లెలో ఇలా పడివుండటానికి? ఎక్కడున్నా బస్తీలో
చే పుహోటల్ంచైనా తెప్పించుకు తాగేవాడు గదా

ఈ మంజీరమీద మమకారం తనవింతగా బంధించిందేమిటి• ఆమే లేకపోతే
తనెందు కిక్కడ? అతని కళ్ళము దు అచ్యుతరామయ్య పితృవాత్సల్యం గిర
గిరా తిరిగింది మంజీరని తనెంత ప్రేమించినా ది ఒన్-ట్రాఫిక్
లాంటిది ఆమెకి తనంటే ఏపాటి గౌరవమూ లేదు ప్రేమ లేదు ఆమె పైగా
రామప్రసాద్ అంటే పడిచస్తున్నట్టు కనిపిస్తోంది అదే నిజం అయితే తనకు
అంతకుమించిన రంపపుకోత మరొకటి లేదు తనంటే ప్రేమలేని మంజీరకోసం
ఏడ్చేకంటే తనంటే అభిమానించే ప్రమీలని పెళ్ళాడితే మంచిదేమో! ఇద్దరూ
ఏ పట్నంలోనో ఉద్యోగాలు చేసుకుంటూ తమకున్న అప్పులన్నీ తీర్చుకుంటూ తెమ
బ్రతుకులు తాము బ్రతకవచ్చు ఈ విధంగా ఆలోచిస్తూ అతనూ అభోజనం
గానే నిద్రపోయాడు




## 10

తెల్లగా తెల్లవారాక మెళకువ వచ్చింది మంజీరకి. తనకి పెద్ద వాంతి అవడం, తనలా మంచంమీద పడటంవరకే తనకి గుర్తు. ఆ తర్వాత మళ్ళీ ఇప్పుడే లేవడం. అన్నం తిననందువల్లో, ఏమో ముఖం అంతా బాగా పీక్కు-పోయివుంది.

ఈ పూట శరచ్చంద్రకి డబ్బు ఇవ్వాలి. మెల్లగా లేచి స్నానాదికాలు ముగించుకుని కాఫీ మాత్రం తాగి శరచ్చంద్రకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

సరిగ్గా పదిన్నరకి వచ్చాడు. తన ముఖం ఎలా వుందో, అతని ముఖమూ అలాగే వుండటం చూసి కొత్త తెల్లబోయింది.

"ఇదుగో మీకు చెక్కు రాయనా : క్యాష్ ఇవ్వనా ?" అని అడిగింది.

"వుంటే క్యాషే ఇవ్వండి." ముభావంగా జవాబిచ్చాడు. వెంటనే లోపలకి వెళ్ళి బీరువా తెరచి అయిదు వందరూపాయలనోట్లు తెచ్చి అతని చేతిలో పెట్టింది.

"మెనీ థాంక్స్" అన్నాడు శరచ్చంద్ర.

"రాత్రి బాగానే వర్షం పడింది" అంది మంజీర

"అవును "

"ఇప్పుడు మన పనులెంతవరకూ వచ్చాయి ?"

"అందరికంటే బాగానే అయ్యాయి."

మంజీర మాట్లాడలేదు

"వస్తాను," అంటూ లేచాడు.

"ఎరువులవీ " అంటూ ఆగిపోయింది.

"అన్నీ పూర్తి అయ్యాయి. ఓ ప్రక్క నుయ్యి తవ్వకం మరో ప్రక్క ఇటు పొలం పనులు అన్నీ పూర్తి అయ్యాయి " అంటూ బయటకి నడుస్తూ ఒకసారి వెనక్కి తిరిగి చూశాడు. ముఖం అంతా పీక్కుపోయి తనవంకే ఆశ్చర్యంగా చూస్తున్న మంజీర కనిపించేసరికి

"అలా వున్నావేం?" అని అడిగాడు వూరుకోలేక.

ఆ కాస్తకే సంతోషించింది మంజీర.

"నిన్న అక్కడినించి వస్తూనే కడుపులో తెమిలి పెద్ద వాంతి అయింది. ఆ వెంటనే పడుకున్నదాన్ని తెల్లవారితేగాని లేవలేదు."

శరచ్చంద్ర సానుభూతిగా చూసి ఇప్పుడు "తేలిగ్గావుందా? లేకపోతే ఆస్పత్రికి తీసుకువెడతానురా!" అన్నాడు.

"ఇప్పుడు ఫర్వాలేదులెండి. అయామ్ ఆల్‌రైట్" అంది నవ్వుతూ.

శరచ్చంద్ర తలపంకించి వూరుకున్నాడు.

"మరి మీరేమిటి అలా వున్నారు?" అని అడిగింది.

"నేనా? నాకున్నన్ని సమస్యలు, బాధలు ఎవరికీ వుండవు. అవి ఎలాగూ సాల్వ్‌కావు మనస్సుకు స్వాస్థ్యమూ చిక్కదు." అంటూ విషాదంగా నవ్వి చరచరా వెళ్ళిపోయాడు.

ఆ దబ్బు చేతపట్టుకుని బెజవాడ బస్ ఎక్కాడు శరచ్చంద్ర. అతను అన్న ఆఖరు మాటలనే పునశ్చరణ చేసుకుంటూ అట్టే కూర్చుండిపోయింది మంజీర.

## 11

రామప్రసాద్ ఇంట్లో కూర్చుని పుస్తకం చదువుకుంటూవుంటే విసురుగా వచ్చాడు చిదంబరం.

"ఓరి నీ చదువు తగలెయ్య. ఆడదానిలా కొంపలో చస్తావేరా! అట్టా బోయి అమ్మాయితో కబుర్లు చెప్పుకోరాదా?" అన్నాడు కోపంతో వూగిపోతూ.

"ఇప్పుడా అమ్మాయి గొడవెందుకు నాన్నా." చిరాగ్గా అడిగాడు ప్రసాద్

"ఎందుకా నిన్ను తీసుకుపోయి అందలం ఎక్కించాలని."

"ఆ అమ్మాయితో మాట్లాడినంత మాత్రాన అందలం ఎక్కేస్తానా?"

"ఆ! ఎక్కడానికి దారి ఏర్పడుతుంది. నువ్వలా ప్రేమగా అభిమానంగా కబుర్లు చెబుతూంటే ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తుంది. పెళ్ళి చేసుకుంటుంది." కొడుకు మట్టి బుర్రకి ఎలాగూ అర్థంకాదని గ్రహించినట్టున్నాడు. చివరకి తనే విప్పిగ్గా చెప్పాడు చిదంబరం.

"పెళ్ళా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును."

"ఆవిడ నన్ను పెళ్ళాడుతుందా?"

"ఏం! నీకేం! విక్షేపంలా వున్నావు. అందం తక్కువా, డబ్బు తక్కువా. ఏం తక్కువవి?"

"మనం ఆవిడ అంతస్థుకెలా తూగగలం నాన్నా."

"ఓరి చవట వెధవా! ఇన్ని సినిమాలు చూస్తున్నావు. ఇన్నిన్ని పుస్తకాలు చదువుతావు. ఎందుకు? ఆ మాత్రం తెలియకపోయాక. గొప్పింటి అమ్మాయి పేదింటి పిల్లాడిని ప్రేమించి పెళ్ళాడటం చూడలేదా! చదవలేదా? కాస్త తెలివి తేటలుగా ప్రవర్తించి ఆ పిల్లని నీవైపు లాగేశామంటే మనకంతా లాభమే? ఇల్లంతా కనకవర్షమే!" మహదానందపడిపోతూ కొడుక్కి జ్ఞానోపదేశంచేశాడు చిదంబరం.

తండ్రి అంత అరటిపండు వలిచి చేతపెట్టినట్టు చెప్పినా ఇంకా సందేహిస్తూనే వున్నాడు రామప్రసాద్.

"ఇంకా అలాగే దీపంపెమ్మలా కూర్చుంటావు దేనికి? వెళ్ళు వెళ్ళి చెప్పిన పని చెయ్యి." అంటూ తనే కొడుకుని పట్టి లేవదీశాడు, స్వార్థం మూనబోసుకున్న చిదంబరం.

రామప్రసాద్ లేచి మంచి పాంటూ షర్టు వేసుకుని, ఇవతలకి వస్తుంటే "ఇదిగో ఈ కూరలు పట్టుకు వెళ్ళి ఇవ్వు" అంటూ అందించింది చింతామణి

బీరకాయలు, వంకాయలు, బెండకాయలు, నాలుగు ములక్కాడలు వేసి ఇచ్చిన ఆ సంచీని పట్టుకుని పితృవాక్యాపాలకుడైన అపర శ్రీరాముడిలా బయలుదేరాడు రామప్రసాద్.

మంజీర అప్పుడే రామాలయానికి వెళ్ళింది ఇంట్లో కమలమ్మ వుంది ఆ కూరలు ఆవిడకి అందించి అక్కడే కూర్చున్నాడు. మంజీరకోసం ఎదురుచూస్తూ పావుగంటలో వచ్చింది. మంజీర

"ఏమిటిలా వచ్చారు?" అని అడిగింది.

"ఏమిలేదు. అమ్మ కూరలిచ్చి రమ్మంటేను" అంటూ నవ్వాడు.

"కాఫీ తీసుకురామ్మా!" అంది కమలమ్మతో తల్లితో మాట్లాడుతున్న ఆమెనే పరీక్షగా చూశాడు రామప్రసాద్! ఆ క్షణంలో అతనికి మంజీర సాక్షాత్తూ రంభలానే కనిపించింది దానికి సాయం తండ్రి మాటలు చెవిలో ప్రతిధ్వనించచ

సాగాయి నిజంగానే తనకంటే తన తండ్రి తెలివిలో బెటరు. తను అమెను చూసి ఏ క్షణమూ పెళ్ళాడాలని ఆశించలేదు. కాని ఇప్పుడు నిజంగానే ఈ కుందనపు ముద్దని తన స్వంతం చేసుకోవాలనిపిస్తోంది.

కమలమ్మ ఫ్లాస్కులోంచి కాఫీ తీసుకువచ్చి అందించింది. ఇంతలో సడన్‌గా వచ్చిన శరచ్చంద్ర ఆ దృశ్యం చూసి అక్కడే ఆగిపోయాడు. అతన్ని ముందుగా చూసింది మంజీరే.

"రండి ! అక్కడే నిలబడ్డారేం ?" అని అడిగింది ఆశ్చర్యంగా.

అప్పుడు లోపలకి వచ్చాడు శరచ్చంద్ర. కూర్చోకుండానే "ఈ గేదెలకి, అవులకి ఓ పాక వేయించండి వానకి తడుస్తూ, రేపు చలికాలంవస్తే వణుకుతూ అలా వుండటం మంచిదికాదు. పశువులకైనా వెచ్చదనం కావాలి. మీరు యస్ అంటే పనివాళ్ళు రెడీగా వున్నారు. రేపే పని ప్రారంభిస్తారు. అది చెప్పాలనే వచ్చాను"

"అలాగే, కూర్చోండి. నిలబడే వున్నారు" అంది మంజీర.

"లేదు నేనింకా అక్కడ మాట్లాడవలసిన పని వుంది. ఇటు వెడుతూ ఈ మాట చెప్పిపోదామని వచ్చాను," అంటూ మరోమాటకి ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు. ఆతని మనస్సంతా మరీ వికలమయిపోయింది. ఆ క్షణంలో అచ్యుతరామయ్య, తన తండ్రి, తల్లి అంతా కళ్ళముందు గిరగిరా తిరిగారు.

నిజానికి తనేమన్నా పేదవాడా? విధి వక్రించి తనీనాడు పేదవాడయిపోయాడు గాని గట్టిగా చెప్పవలసి వస్తే తనూ ఒకప్పుడు లక్షాధికారుల్లోకి చేరినవాడే గదూ! తన తండ్రి తెలివితక్కువవల్ల అన్నీ పోయాయి. అందుకే అంటారు లక్ష్మీదేవి చంచలి. ఈరోజు ఇక్కడ వుంటే రేపు మరోచోట వుంటుందని అని అక్షరాలా నిజం.

విజయవాడలో హార్డువేర్ కంపెనీ పెట్టాడు తన తండ్రి జనమేజయరావు తనొక్కడే బిడ్డ కావడంచేత అల్లారుముద్దుగా పెంచారు. కాలేజీలో చేరిన ఏడాదికి తన తల్లి గ్యాస్‌స్టవ్ అంటిస్తూ లీక్ అయింది గమనించకుండానే ప్రాణం పోగొట్టుకుంది.

ఆమె మరణం నాన్నని కృంగదీసింది ఎప్పుడూ విచారంగా గదిలో పడుకునేవాడు కొట్లో పనిచేసే గుమాస్తాలని నమ్మి. అదే తమ జాతకాలు మారడానికి కారణం.

అమ్మకాలు బయటపెట్టలేదు. ఇన్‌కం టాక్సు పెరిగింది. జరిమానాలు,

జైలుశిక్షల దగ్గరికి వచ్చింది తండ్రి జీవితం. తమ తల్లి పోవడమే తన ఇంట్లో ఇనపగజ్జల తల్లి కాలుపెట్టడానికి అంకురార్పణ జరిగింది. అక్కడ మనశ్శాంతి కరువైపోయినతనికి అచ్యుతరామయ్యే స్వాంతనపరుడయ్యాడు తన తిమిరావృతమైన హృదయాంబరంలో తటిల్లతలా మెరిసింది మంజీర.

తనతో చదివిన ప్రమీల తమ పరిస్థితులకు జాలిపడటమేగాక తనంటే మోజు పడింది తను మంజీర కనిపించకపోతే ఆమెతో ప్రేమలో పడేవాడో పెళ్ళాడేవాడో కూడా. ఆమె అంటే తనకి అభిమానం వుంది. కష్టాల్లో ఉన్నప్పుడు ఎవరన్నా అభిమానంగా, సానుభూతిగా మాట్లాడుతుంటే వాళ్లంటే వీరికి సదభిప్రాయం, గౌరవం, అభిమానం అన్నీ ఏర్పడతాయి. అలాంటి ఫీలింగే తనకీ ప్రమీలంటే వుంది. అయితే ఆరోజు మంజీర చూసిన రోజు, ప్రమీలని తను దగ్గరికి తీసుకున్నాడు. కౌగిలించుకున్నాడు. అ- తను కాదనలేదు ఆమె తనని పెళ్ళిచేసుకోమని గుండెలమీద వాలి ఏడ్చింది. ఆ ఏడుపుకు తను కరిగి పోయి ఆమెని అక్కున చేర్చుకుని ఓదార్చాడు

మంజీరని చూస్తుంటేనే కలిగే హృదయస్పందన, ప్రమీలని చూస్తుంటే కలగదు. మంజీరని చూడగానే ఆ రెండు బుగ్గలూ ముద్దుపెట్టుకోవాలని, కౌగిలిలో నలిపివేయాలని ఏవేవో రగిలే కాంక్షలు- ఆవేశాలు- ప్రమీలని చూస్తే కలగవు.

ఆమెని దగ్గరికి తీసుకుంటే కలిగే ఉద్రేకం, ప్రమీలని దగ్గరకు తీసుకున్నా కలగవు అందుకే తన హృదయం ఇంత ఛిన్నాభిన్నం అయిపోతోంది. రామప్రసాద్‌ని–మంజీరని దగ్గరగా చూస్తుంటే తనకి ఒళ్ళు భగ్గుమంటోంది. ఇవన్నీ వదిలేసి దూరంగా ఎవరి పిలుపుకీ అందనంత దూరంగా వెళ్ళిపోవాలని అనిపిస్తోంది. కాని అచ్యుతరామయ్యకు ఇచ్చిన వాగ్దానం, ఇక్కడన్నీ పరిచూస్తానని అది ఎలా కాదనగలడు? మంజీరకి అన్నీ స్వయంగా చూసుకో గలిగే సామర్థ్యం వచ్చిందని తనకి తోచిననాడు తను తప్పుకోవడమే మంచిది.

ఆమెని రామప్రసాద్ పెళ్ళిచేసుకోనీ - ఆ ఆస్తి ఎలాగైనా తగలడనీ- మధ్య తన కెందుకు? తనింక బెజవాడ పోయి అక్కడ ఏదో ఉద్యోగం చేసుకోవడమే చాలా చాలా మంచిది

ఇదంతా పీడకలగా భావించి బ్రతకడం తప్ప గత్యంతరం లేదు భగవంతుని దయవల్ల ఈ ఏడు పంట బాగానే వుండవచ్చు. అంతవరకూ వుండి - ధాన్యం ఫుడ్ కార్పొరేషన్‌కి అమ్మి ఆవిడ డబ్బు ఆవిడ కప్పగించితే తను నిశ్చింతగా

తప్పుకోవచ్చు. ఈ విధంగా ఆలోచిస్తూ, ఎప్పటికో లేచి కాస్త అన్నం తిని పక్క సరిచేసుకుని నిద్రకు ఉపక్రమించాడు. ఆ మామిడితోటలో భయంకర మైన నిశ్శబ్దతే తాండవమాడుతోంది. గాలి వీచినప్పుడల్లా చిరునవ్వడి చేసే మామిడికొమ్మల మర్మరధ్వనులు తప్ప అక్కడా నీరవ నిశీథినిలో- అతన్ని పలకరించేవారుగాని ఆదరించేవారుగాని లేరు. ఒక విధమైన ఒంటరితనానికి అలవాటుపడి బండబారుతున్న సున్నితుడు శరచ్చంద్ర. ప్రకృతే అతని స్నేహ సంపద. సూర్యచంద్రులే అతనికి ధైర్యాన్ని కలిగించే ప్రాణస్నేహితులు.

తెల్లగా తెల్లవారి సూర్యుని బంగారు కిరణాలు కిటికీలోంచి దూసుకువచ్చి నప్పుడే అతనికి మెలుకువ వచ్చింది. లేచి కాలకృత్యాలు తీర్చుకుని కాఫీ కలుపుకుని త్రాగి తిన్నగా మంజీర ఇంటికి వచ్చాడు. అప్పటికే ఆమె లేచింది. అతను గుమ్మంలోకి అడుగుపెట్టేసరికి గజ్జెలు ఘల్లుమంటున్నాయి. అది వినే సరికి అతని ఒళ్ళు ఝల్లుమంది. ఓరగా తలుపులు వేసుకుని డాన్స్ ప్రాక్టీస్ చేసుకుంటోంది మంజీర.

'రారా! యదువంశ సుధాంబుధి చంద్ర రారా' పాటకి అనుగుణ్యంగా మంజీరాలు మ్రోగుతున్నాయి. మువ్వ గోపాలుని పదం మృదుమధురంగా వినిపిస్తోంది. ఆ సందులోంచి అలాగే చూస్తున్నాడు శరచ్చంద్ర. ఆమె నృత్యం అతన్ని రసమయ లోకాల్లోకి తీసుకుపోతోంది.

ఆ పాట అయిపోగానే జయదేవుని అష్టపది 'ప్రళయ పయోధిజలే!' దశ అవతారాలతో శ్రీమన్నారాయణుడే కళ్ళముందు కనిపించసాగాడు శరచ్చంద్రకి. ఇంతలో కనులమ్మ లోపల్నించి వచ్చి, "రానయ్యా! ఆగిపోయావేం!" అంటూ పలకరించేసరికి మువ్వలు టక్కున ఆగిపోయాయి. చిరు చెమటలు ముత్యాల్లా మెరుస్తుండగా మంజీరాదేవి తలుపు తీసుకుని ఇవతలకి వచ్చింది. దేవతని చూసి నట్టు చూశాడామెకేసి శరచ్చంద్ర. అతని కళ్ళల్లో ఆనందోత్సాహాలు వెలిగిపోతున్నాయి

"అనుకోకుండా ఈరోజు నాట్యమయూరి నృత్యం చూసే అదృష్టం కలిగింది" అన్నాడు, ఆరాధనగా ఆమెకేసి చూస్తూ.

ఆ మాట వినేసరికి మంజీర బుగ్గలు ఎఱ్ఱగులాబీలయ్యాయి. అది చూసి మరింత ముగ్ధుడయ్యాడు.

"నిజంగా నువ్వు ప్రతిభా సంపన్నవు. నటరాజు పరిపూర్ణ కటాక్షం పొందిన ధన్యజీవివి" అన్నాడు ప్రశంసగా!




"మీరు అతిగా పొగడుతున్నారేగాని, మీ మౌత్ ఆర్గన్ పాట కంటే బాగుందా నా నృత్యం" ఓరగా చూస్తూ అడిగింది

"నా ముఖం. నా వాయిద్యం సరే, నా బ్రతుకూ సరే ఏదో ఏకలవ్యుడిలా నేర్చుకున్నది అది. అయినా అది నువ్వు విన్నావా మంజీరా" ఉత్కంఠంగా అడిగాడు.

"విన్నాను కనుకే చెబుతున్నాను. మరోసారి వినే అదృష్టం కలిగించితే సంతోషిస్తాను."

"అలాగే. ఓసారి మామిడితోటకి రా!"

"వస్తానుగాని ఓ పాట పాడకూడదా?"

"పాటా? నేనిప్పుడు గానకచ్చేరికి రాలేదు. మీ గొడ్లకి పాక వేయించడానికి వచ్చాను"

"దేనికోసం వచ్చినా ముందు పాట పాడాల్సిందే!"

"పాడితే ఏం ఇస్తావు?"

"కమ్మటి కాఫీ."

"అయితే నా పాట ఖరీదు కాఫీరేటన మాట."

"అదేం మాట? అభిమానంగా అడిగినప్పుడు పాడాలిగాని, అణాపైసలతో లెక్క వేస్తారా?"

"అభిమానానికైనా మనసు ప్రాతిపదిక కావాలి మరి."

"మీతో నేను మాట్లాడలేను. మీరు గాయకులేకాదు, కవులుకూడా. అందుకే అంత పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నారు."

"పెద్ద మాట అయినా చిన్న మాట అయినా అర్థంచేసుకోలేని పాపవి కాదు. కామన్స్వ గ్రాడ్యుయేట్ వి"

"నే... చెప్పలా! మాటలతో బోల్తాకొట్టిస్తారని." మూతి విరిచింది మంజీర. అదిచూసి నవ్వాడు శరచ్చంద్ర.

"నీకు కోపం ముక్కుమీదే వుంటుంది."

"వుండదేమిటి? పాట పాడకపోతే!"

"సరే. పాడుతాలే. నీ కమ్మని కాఫీ ఎందుకు పోగొట్టుకోవాలి." అంటూ ప్రారంభించాడు "నా జీవన సంధ్యా సమయంలో ఒక దేవత ఉదయించింది, ఆ రూపమే అపురూపమై అమరదీపమై వెలిగింది_" చిన్నగా ప్రారంభించిన ఆ పాట తారస్థాయికి చేరి మంజీరని అమరలోకానికే తీసుకుపోయింది. ఇక నెంత శ్రావ్యంగా పాడగలడు అనుకుంటూ తన్మయత్వంతో వినసాగింది.

పాట పూర్తిచేసి "ఇవ్వండి కాఫీ" అన్నాడు నవ్వుతూ.

"కూర్చోండి మరి తెస్తాను" అంటూ టిఫిన్, కాఫీ రెండూ తెచ్చింది.

"కాఫీయేగా ఆఫర్ చేశావు," కొంటెగా అడిగాడు

"ఫర్వాలేదులే తినండి." అంది నవ్వుతూ.

ఇంతలో పనివాళ్ళు రానేవచ్చారు వెనకప్రక్క తవ్వకం, స్తంభాలు పాతడం, అన్నీ జరగడమేగాదు ఆ సాయంత్రానికే దట్టంగా తాటాకులు కప్పడం కూడా అయిపోయింది.

"ఏది తలచినా నిర్విఘ్నంగా చేస్తారు. మొత్తానికి కార్యసాధకులు" అంది నవ్వుతూ.

"అది నా స్వవిషయాలకి వర్తించదు. అది మినహా మిగిలిన వాటిల్లో కార్య సాధకుడినే." అంటూ ఓ చూపు విసిరి వెళ్ళిపోయాడు ఇంటికి.

# 12

అచ్యుతరామయ్య జీవించినన్నాళ్ళూ బ్రహ్మచర్యమే వెలిగించాడు. తను ఒక్కడే అయినా ధనార్జన విషయంలో మటుకు బహుకుటుంబీకుడిలానే శ్రమించాడు. ఎక్కడ లాభసాటి అనిపిస్తే అక్కడల్లా స్థలమో, పొలమో కొని పడేశాడు. అలా కొన్నదే మామిడితోటకి వెనక కాలవవొడ్డుకి అటుపక్క వున్న ఒక ఎకరం స్థలం. అందులో నారింజ, బత్తాయి తోటపెంచాలని అతను కన్న కలలకు రూపకల్పన చేసినవాడు శరచ్చంద్ర

అపలాస్థలం అమ్మకానికి వచ్చినపుడు కొనమని ప్రోత్సహించింది శరచ్చంద్రే.

"ఎలాగో నారింజతోట వెయ్యాలనుకుంటున్నావుగా బాబాయి మన మామిడి తోటకి వెనకవున్న ఖాళీజాగా కొనేయి" అన్నాడు.

"కొనచ్చుగాని ఎకరం దేనికిరా!" అని అడిగాడు అచ్యుతరామయ్య

"బాగుంది బాబాయ్. ఎకరం అన్నా లేదే తోట ఏమిటి? పైగా మన పక్కన మరొకరు చేరితే కంచె పెట్టాలి అడ్డం. అప్పుడు చిక్కులువస్తాయి ఆ కంచె రేటుకు మనో కొంత వేస్తే ఆ అరఎకరమూ మనకిందే వుంటుందికదూ!"

ఆ సలహా నచ్చిన అచ్యుతరామయ్య ఆ అరఎకరమూ కొనిపడేశాడు అస్థలం బాగుచేయించడం గుళ్లబారించి ఎరువులువేసి స్వయంగా అచ్యుతరామయ్య, శరచ్చంద్ర ఇద్దరూ వడ్లపూడి వెళ్ళి తియ్యని పళ్ళిచ్చే నారింజ మొక్కలు పట్టుకునచ్చారు

అవి అన్నీ నాటిన నాలుగయిదు నెలలకే మంచం ఎక్కాడు అచ్యుతరామయ్య. దాంతో ఆయన్నీ- ఆయన పొలాన్నీ, ఆయన తోటలని అన్నింటినీ సంరక్షిస్తున్నది శరచ్చంద్రే. ఆ శరచ్చంద్రని అంత బాధ్యతాయుతంగా ప్రవర్తించేట్టు చేస్తున్న అదృశ్యహస్తం మంజీరాదేవే.

పొలం బాగా ఎదిగి కళకళలాడిపోతోంది. ఇంకో నెలలోనే కోతలు ప్రారంభించవచ్చు. మంజీర ఇంటిదగ్గర తలపెట్టిన పాలపథకంకూడా నిర్విఘ్నంగా సాగిపోతోంది దానిమీద వచ్చే ఆదాయం అణాపైసలతో సహా లెక్కచెప్పి వెడతాడు శరచ్చంద్ర.

"మీరు కాఫీ బాగానే తాగుతారు గదా, పాలు ఎక్కడివి!" కుతూహలంగా అడిగింది మంజీర.

"కొనుక్కుంటాను." నవ్వుతూ జవాబిచ్చాడు శరచ్చంద్ర.

"కొనుక్కోవడమా? ఇక్కడినించి పట్టుకువెళ్ళవచ్చుగదా!" కొస్త కష్టంగానే అడిగింది మంజీర.

"ఎందుకు? రోజూ తెల్లారేసరికి నాకు పాలు గిన్నెలో రెడీగా కనిపించాలి. ఇక్కడినించి తోటకి రోజూ ఎవరు తెస్తారు? ఇలా సాగనీయి" అన్నాడు గంభీరంగా.

"పాలు తియ్యగానే సోమన్నకిచ్చి తోటకి పంపిస్తాను. అనవసరంగా కొనకండి." అంది మంజీర

శరచ్చంద్ర దానికేం జవాబివ్వలేదు.

మంజీర అతను వెళ్ళిపోయాక చాలాసేపు అతనిగురించే ఆలోచించసాగింది
అతను వండుకుంటాడు. కాఫీలవీ కలుపుకుంటాడు తనిక్కడికి వచ్చాక
అతను కావాలని అయిదువందలు అడిగి తీసుకోవడంతప్ప అతనికి తను ఇచ్చిం
దేమీలేదు మరి అలాంటప్పుడతనికి ఎలా గడుస్తోంది? సంసారాలెలా కొన
కుక్కుంటున్నాడు," ఈ ఆలోచన రాగానే చాలా బాధపడింది మంజీర

మామయ్య కత్యంత ప్రీతిపాత్రుడు తమకింత చాకిరీ చేస్తున్నవాడు అతని
యోగక్షేమాలు తనేమన్నా విచారిస్తోందా? అతనికి ఎలా జరుగుబాటవుతోంది
ఎక్కడినించి వస్తోంది? అన్నీ అణాపైసలతో లెక్కవేసి చెబుతాడే? ఎందులో
నన్నా మిగుల్చుకుని గడుపుకుంటున్నాడా? లేక అతని తాలూకు వారెవరన్నా
పంపిస్తారా? అతనికి ఎవరున్నారు? ఒకవేళ నెలనెలా ప్రమీల వచ్చేది అతని
డబ్బివ్వడానికేనేమో! అతను విజయవాడ పరిగెత్తుతుండేది ఆ డబ్బుకోసమేనా
రకరకాల ఆలోచనలూ ఆమెని వూపివేశాయి.

"ఏమైనా సరే వెళ్ళి అడగాలి ఎందుకీ సస్పెన్సు!" అనుకుంటూ లేచింది
ఆమె అడుగు ముందుకేసేసరికి ఎదురుపడ్డారు చిదంబరం, చింతామణి, రామ
ప్రసాద్ ముగ్గురూను ముందుకు అడుగువేసిందల్లా ఆగిపోయి వెనక్కివచ్చి
"రండి" అంటూ కుర్చీలు చూపించింది

చిన్న కాన్‌లో పాలకోవాపెట్టి "తినమ్మా మంజీరా!" అంటూ అతి ఆప్యా
యంగా ఏకవచనంలోనే సంబోధించింది చింతామణి ఇటీవల వస్తున్న మార్పులు
చాలా సులభంగానే పసిగట్టింది మంజీర మీరు మీరా అని పిలిచే రామప్రసాద్
అది కాస్తా మార్చేసి "నువ్వు" "మంజీర" అనడంలోకి దిగిపోయాడు

"అమ్మాయిగారు, అమ్మాయిగారు," అంటూ తిరిగే చిదంబరం, చింతామణి
"మంజీరమ్మా, మంజీరా" అంటూ పేరుపెట్టి పిలుస్తున్నారు వీలు దొరికినప్పు
డల్లా చింతామణి వచ్చి "వదినగారూ, వదినగారూ" అంటూ వరసకలుపుతూ
కబుర్లు చెబుతుంది వస్తూ వూరికే వస్తుందా? ఓ కూరో, ఓ తినుబండారమో
ఏదో మూటకట్టుకుని వస్తుంది

"పాపం చిన్నపిల్ల మంజీరకి పెట్టండి మీరు కాస్త నోట్లోవేసుకుని రుచి
చూడండి" అంటుంది దాంతో పాపం కమలమ్మ హృదయం కృష్ణానది అయి
అవుతుంది సంతోషంతో ఇంత ఆపేక్షగల మనుషులు అపురూపం అంటుంది
పైగా

అలాగే చిదంబరం కూడా అడిగినా అడగకపోయినా వచ్చి కూర్చుని ఏవేవో
వుచిత సలహాలు పారేసిపోతుంటాడు

"ఏమైనా నువ్వు కాస్త తెలివితక్కువగా ప్రవర్తించావే మంజీరా! ఈ ఏడు కూడా పొలం వీళ్ళకే అప్పగించవలసింది," అంటూ కూతుర్ని మందలించేవరకూ పెరిగిపోయింది కమలమ్మకి వాళ్ళమీద అభిమానం

"శరచ్చంద్రగారు చూస్తున్నారుగామ్మా! ఆయనుండగా మళ్ళీ వీళ్ళెందుకు" అంది చిరాగ్గా

"వున్నారులే! అతగాడేమో ఒంటికాయ శొంఠికొమ్ము వీళ్ళేమో పాపం పిల్లాజెల్లా కలవాళ్ళు వీళ్ళని ఓ కంట కనిపెట్టివుండొద్దుటే!" అంది వాళ్ళమీద సానుభూతిగా

మంజీర మాట్లాడలేదు

"రేపు నరకచతుర్దశి, దీపావళి ఆ రెండు రోజులూ మా యింటికి భోజనాలకి రండి వదినగారూ!" అంటూ ప్రారంభించింది చింతామణి.

"అవునండీ! ఇక్కడేం చెయ్యి కాల్చుకుంటారు! అలా రండి అంతా సరదాగా గడుపుదాము," అంటూ అందుకున్నాడు చిదంబరం

"పండుగకి బట్టలు కొనటానికి రమ్మంటే సాయం వస్తాను" అంటూ తివి తూర్పోవడంతప్ప వేరే పనీపాటాలేని రామప్రసాద్ అన్నాడు

ఇదంతా చూస్తూ మనసులో ఆశ్చర్యాన్ని మనసులోనే అణచుకొంది మంజీర

"ఏమంటావమ్మా! సరే నను" అంటూ అందుకున్నాడు చిదంబరం

"ఏమిటో నాకి పండుగల పేరుతో అక్కడికీ ఇక్కడికీ తిరగడం అలవాటు లేదండీ, అయినా చిన్నపిల్లనా ఏమిటి!" అంది మంజీర

"బాగుందమ్మా! చిన్నదానివికాక పెద్ద ఆరిందావయిపోయావా ఏమైనా సరే మీరు తప్పక రావలసిందే," అంది ఆజ్ఞాపిస్తున్నట్టు చింతామణి

"నేను తీసుకువచ్చే చీర మీకు నచ్చుతుందంటే నే నే తెస్తాను" అన్నాడు రామప్రసాద్

'తొలిసారిగా ఓ యువకుడు తనకి చీరతెస్తాను పండుగకి అంటే ఏ కన్నెపిల్ల గుండె జల్లుమనదు!' ఆ విధమైన కంపనతోనే తలవంచుకుంది మంజీర అయినా ఈ అతిచనువు వీళ్ళకెందుకో మటుకు బొత్తిగా అర్థంకాక తల బద్దలుకొట్టుకుంది మంజీర

కమలమ్మ అందరికీ కాఫీ లిచ్చింది అవి త్రాగి మరోసారి రమ్మని హెచ్చరించి శలవు పుచ్చుకున్నారు అంతా.

"ఏమే వెళదామంటావా!" అని అడిగింది కమలమ్మ

"చూద్దాంలే అమ్మా! మనింట్లో మనం వుంటే బాగుంటుంది!" అని అంటూ లేచింది మంజీర

ఆమె కాళ్ళు వేగంగా మామిడితోటకి చేర్చాయి ఆమెని అతనప్పుడే గదికి తాళంవేస్తున్నాడు

"ఎక్కడికో బయలుదేరారే!" అంటూ నవ్వుతూ ప్రత్యక్షమైన మంజీరని చూసేసరికి అతని గుండె లయతప్పింది అసలామెని చూస్తూవుంటేనే శరచ్చంద్రకి మతిపోతుంది ఇలా ఒంటరిగా తన గదిదగ్గరకు వచ్చినప్పుడు అసలు స్పృహలేనట్టు అయిపోతుంది

"ఏమిటిలా వేంచేశారు రాణీగారు?" అన్నాడు తలుపు తీస్తూ

"మిమ్మల్ని చూసిపోదామని "

"నేను రోజూ కనిపిస్తున్న వాడినేగా నువ్వు చూడవలసింది చూడక తాత్సర్యం చేస్తున్నది మరొకటి వున్నది అది కూడ డి "

"ఎమిటది?" ఉత్కంఠగా అడిగింది

"మీ నారింజతోట అది కూడా చూస్తే మీ ఆస్తిపాస్తులన్నీ ఎక్కడ ఎలా వున్నాయో తెలుస్తుంది రేపు నేను వున్నా లేకపోయినా మీవని మీకు తెలిసివుంటాయి

ఆ మాటకి ముఖం మాడింది మంజీరకి

"ఎక్కడికన్నా వెళ్ళిపోదామనుకుంటున్నారేమిటి" అదోవిధంగా చూస్తూ అడిగింది

"వెళ్ళక ఎన్నాళ్ళుంటాను మంజీరా! నా కిక్కడ ఎవరున్నారని అక్కడ బెజవాడ పోతే నన్ను కన్నతండ్రి వున్నాడు ఆయనకోసం అక్కడే వుండవచ్చు "

ఆ మాటకి సమాధానం చెప్పలేకపోయింది మంజీర

ఆమె నలాగే వదిలి ప్లేటులో రెండు పూరీలు, కాస్త బంగాళదుంపలకూర వేసి ఆమె ముందు పెట్టాడు

"ఇప్పుడివేమిటి!" అని అడిగింది ఆశ్చర్యంగా

"ఏదోలే లైట్‌గా తీసుకో. రాత్రికి భోజనం చేయాలనిపించక ఇవి చేశాను"

"మొత్తానికి మీకు అన్ని రకాల వంటలూ వచ్చు"

"రాకపోతే ఎలా ? రేపొద్దున మా ఆవిడకి చేసిపెట్టొద్దూ అలిగి కూర్చుంటే " నవ్వులాటగా అన్నాడు



"అయితే సత్యభామాదేవి ఎవరో రెడీగా వుందన్నమాట."

శరచ్చంద్ర నవ్వి "సత్యభామ మాత్రం పూరికే పెళ్ళాడిందా కృష్ణుడిని, శమంతమణిని కష్టపడి తెచ్చిఇస్తేగాని సత్రాజితు పెళ్ళిచేశాడా?"

"అయితే శమంతకమణి కోసం రిసెర్చి చేస్తున్నారన్నమాట?"

"సత్యభామ కావాలంటే తప్పదుగా?" అంటూ టీ పోసి కప్పు అందించాడు.

"మరి మీరు తినరేం?"

"నైట్ కి."

"పోనీ టీఅన్నా తీసుకోండి."

బాగుందదన్నట్టు త్రాగి "పద, నారింజ తోట చూద్దావుగాని" అంటూ బయలుదేరదీశాడు.

"ఎలా వెడదాము?"

"రా!" అంటూ తోట వెనకవైపున కాలవదగ్గరికి తీసుకువెళ్ళాడు. ఆ కాలువకి వంతెన లేదు. కాని దాటడానికి కర్రలతో వంతెనలా ఏర్పాటు చేశారు.

"దీని మీదనించి అవతలకి దాటాలా?" అని అడిగింది మంజీర, భయం భయంగా చూస్తూ

"దాటాలి ఏం భయమా?" నవ్వాడు శరచ్చంద్ర

"బాబోయ్! ఆ కాలవలో జారిపడితే?" గుండెలమీద చెయ్యి పెట్టుకుని భీతహరిణిలా చూసింది మంజీర.

"నీకింత భయమని తెలిస్తే ఓ బోటు తెచ్చేవాడిని. సరే. వేరే మార్గం ఆలోచించాలిగా!" అంటూ రెండు చేతులతోనూ ఆమెను ఎత్తిపట్టుకుని చిటికలో అవతలివైపుకు వెళ్ళిపోతుంటే మంజీర సిగ్గుతో కందిపోయి దిగిపోవాలని కాళ్ళు గిజగిజాకొట్టుకున్నా శరచ్చంద్ర బలమైన హస్తాలు ఆమెని గట్టిగా గుండెలకి అదిమిపట్టాయి. అవతలపక్కకి రాగానే క్రిందకి దింపి "ఎందుకండీ మంజీరమ్మగారూ మీకంత సిగ్గు?" అన్నాడు కొంటెగా.

"ఏదో భయమన్నంత మాత్రన ఎత్తుకు తీసుకువచ్చేయడమే నేమిటి?" మెల్లగా నేనే వచ్చేదాన్ని!" అంది చిరుకోపంగా.

"నువ్వలా భయంగా అడుగు వేశావంటే నిజంగానే కాలవలో పడిపోగలవు" అంటూ నవ్వి "రా" అన్నాడు ముందుకు దారితీస్తూ

మంజీర అనుసరించింది. నారింజ చెట్లన్నీ ఎదుగుతూ చక్కని సువాసన విస్తున్నాయి. ఆ నాటిన తీరులోని అందము, విశిష్టత గమనిస్తూ ఆ చెట్ల మధ్యనించీ నడుస్తోంది.

"మనవేపు ఎక్కువగా నారింజచెట్లు వేయరుగదూ?" అంది కుతూహలంగా.

"మామిడి, అరటి పెంచినట్టు నారింజ పెంచడానికి శ్రద్ధ తక్కువ నిమ్మకాయలకి నిమ్మతోటలకి, జామతోటలకి బాగా అలవాటు పడిపోయి నారింజ పట్ల కొత్త అశ్రద్ధే కనబరుస్తున్నారంటే వాటికున్న అమ్మకాల్లో లేదా. పెంచటంలో లేదా. అన్నింటిలోనూ వున్నాయి. అయినా మనకి నారింజచెట్లకి కొరతలేదు. ఇప్పుడు అవికూడా బాగానే పండిస్తున్నారు. ఈ చెట్లని ప్రత్యేకించి వర్లపూడినించి తెచ్చాము. కొన్ని అక్కడక్కడా సేకరించాము?" అంటూ ఆగాడు ఒక్కొక్కటీ చూపిస్తూ.

"ఇప్పుడివి ఎన్నాళ్ళలో కాపుకువస్తాయి?"

"సుమారు ఆరేళ్ళకి. నారింజచెట్లు పది సంవత్సరాలునించి పాతిక సంవత్సరాల వయసులో విపరీతంగా కాస్తుంది. నలభై ఏళ్ళవరకూ పళ్ళు ఇస్తూనే వుంటుంది."

"ఎన్నయినా చెప్పండి ఈ నారింజపంట మనకి తక్కువే!" అంది మంజీర.

"ఆ మాటా నిజమే. ఈ నారింజ పరిశ్రమాభివృద్ధికి మన దేశంలోని ప్రధాన నగరాలన్నింటా పరిశోధనా కేంద్రాలున్నాయి. ఏదైనా పరిశోధనలు ఎక్కువవుతున్నకొద్దీ పంట పెరుగుతూ వుంటుంది" అన్నాడు అగ్రికల్చరల్ బి యస్.సి పాసైన పాస్యాసైన శరచ్చంద్ర.

"మొత్తానికి మీరీ వ్యవసాయరంగంలో అన్నింటివి గురించీ క్షుణ్ణంగా తెలుసుకున్నారే!" అంది ఆశ్చర్యంగా.

"ఎకరం స్థలం అంతా నారింజకే కేటాయించారు. దీనివల్ల మనకి గిట్టుబాటు ఉందా. పంటతెగుళ్ళు వగైరాలు రావా ?"

"ఎందుకురావు? పండును పాడుచేసేవి చాలా వున్నాయి. పండు పండే సమయానికి చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. లేకపోతే పండును పాడుచేస్తాయి. మందులు స్ప్రే చెయ్యాలి ఇవన్నీ చూసుకుంటూ ఎగుమతి చేసే ముందు అన్నీ కడిగి శుభ్రంచేసి ప్యాకింగ్ చేయిస్తాను."

ఆ సరికి చాలావరకూ తోట చూడటం అయిపోయింది.

"ఇంక ఇంటికి వెళ్ళిపోదాం. అంది మంజీర.

"ఏం కాళ్ళు నెప్పులు పుడుతున్నాయా?"

"అవును ఎంతసేపు చూసినా ఇవేగా! పళ్ళు తయారైతే చెట్లు చూడటానికి ఇంపుగా వుంటాయి?"

"సరే పదు ఇంటిదగ్గర దింపుతాను." అంటూ అలానే వచ్చిన దారినే తీసుకువచ్చాడు

"మళ్ళీ ఆ కాలవ దాటాలా?"

"దాటొద్దు, నా వళ్ళో కూర్చో చిటికెలో దింపేస్తాను ?"

"అక్కర్లేదు నడవగలను." అంటూ బింకంగా నాలుగడుగులు వేసింది. క్రింద నీళ్ళ విళ్ళబ్ద సంగీతం వినిపిస్తున్నాయి. జారి పడిపోతానేమో నన్న భయం అంతకంతకూ ఎక్కువవుతోంది. ఆ భయంకొద్దీ కాలు వేయబోయి విజంగానే పక్కకి వేసింది. కాలవలో పడిపోయాననుకుంటూనే కెవ్వుమంది. కాని శరచ్చంద్ర ఉక్కుహస్తం క్షణంలో ఆమెని అతని గుండెలదగ్గరకు చేర్చింది.

"పిచ్చిపిల్లా! అందుకే వద్దన్నాను!" అంటూ అక్కున చేర్చుకుని ముద్దు పెట్టుకుంటూ చిటికెలో అవతలకి ఎత్తుకు వెళ్ళిపోయాడు. అతన్ని చూడలేక సిగ్గుతో తలవంచుకుంది మంజీర.

"చీకటి పడిపోతోంది మంజీరా. రా మీ యింటి దగ్గర దింపుతాను."

"రేపు నరకచతుర్దశి. ఎల్లుండి దీపావళి మీరు బట్టలుకుట్టించుకున్నారా ?"

"అవేంలేవు మంజీరా. చిన్న పిల్లవాడినా బట్టలు, టపాకాయలు అనుకుంటానికి."

"ఎవరయితేనేం పెద్ద పండుగ కదూ!"

"పేదవాడికి పండుగలేమిటి? ఏదో ఇలా రోజులు దొర్లిపోనీ" విరాళగా అన్నాడు శరచ్చంద్ర.

"అదేం మాట? మీరు పేదవారని ఎందుకనుకోవాలి." కోపంగా అడిగింది

"డబ్బులేనివాడు పేదవాడుకాక భాగ్యవంతు డవుతాడా ?"

"ఎంత పేదవాళ్ళయినా దీపావళి అంటే అప్పుచేసి అయినా కొనుక్కుంటారు మీకు వేనిస్తాను బెజవాడ వెళ్ళి కొనుక్కోండి రెడీమెడ్ వి".

"నీ అభిమానానికి కృతజ్ఞుడిని. నువ్వు చీర కొనుక్కున్నావా?"

"నాకేమంత శ్రద్ధలేదు. నేను విడిగా కూడా ఎప్పుడుపడితే అప్పుడు చీరలు కొంటూ కట్టుకుంటూ వుంటాను గనుక ప్రత్యేకించి పండుగ దృష్టిలేదు."

శరచ్చంద్ర ఆ సమాధానం విని వూరుకున్నాడు.

ఆమె ఇంటిదగ్గర దింపి వెళ్ళబోతుంటే లోపలకి వెళ్ళి రెండు వంద రూపాయలనోట్లు తెచ్చి అతనికి అందించి, "బట్టలు కొనుక్కోండి" అంది మంజీర.

ఆ డబ్బు తీసుకుని జేబులో పెట్టుకుని ''వస్తాను'' అంటూ బయటకి నడిచాడు. వెనకాలే వచ్చి, "రేపు కొనుక్కుని నాకు చూపిస్తారుగా," అంది మంజీర.

"నీకు నామీద మొదట్నుంచీ అంతంతమాత్రపు నమ్మకమే రేపు సాయంత్రం అయిదు గంటలకి వచ్చి ఆపాకెట్ చూపించి వెడతాను సరేనా!"

"అలా రండి దారికి" అంటూ చిలిపిగా నవ్వి టాటా చెప్పింది. శరచ్చంద్ర చెయ్యివూపి వెనక్కి చూస్తూనే మలుపు దాటాడు.

## 12

తెల్లవార్తూనే లేచి తలంటుకుని ఫస్టుబస్‌లో బయలుదేరి విజయవాడ వచ్చాడు శరచ్చంద్ర.

తండ్రి విచారంగా వీధిలోనే కూర్చుని వున్నాడు. కొడుకుని చూడగానే ఆయన కళ్ళు మెరిశాయి.

"రా నాయనా, నీకోసం చూస్తున్నాను." అన్నాడు అపేక్షగా.

"అదేమిటి నాన్న అలా కూర్చున్నావు? ఇక్కడేంవుందని. నాతోపాటు రా రాదా! అక్కడే వుండవచ్చు అంటే వినవు. తలంటుకున్నారా!" అంటూ తనే లేవదీసి ఆయనకి షాంపుతో తల అంటాడు.

"బట్టలు తెస్తాను." అంటూ తండ్రిమాట వినిపించుకోకుండానే బయటకి నడిచాడు

జనమేజయరావు ఇష్టమైతే ఇంట్లో చారెడు బియ్యం వండుకుంటాడు. లేక పోతే హోటల్లో ముగిస్తాడు. మిగిలిన టైమంతా భగవద్గీత చదువుకుంటూ శూన్యంలోకి చూస్తూ గతస్మృతులతోనూ గంటలకి గంటలు గడిపేస్తాడు. ఆయనకు మిగిలిందల్లా ఓ చిన్న ఇల్లు. ఆ యింట్లో ఒక్క గది తప్ప మిగిలిన నాలుగు గదులూ అద్దెకిచ్చాడు రెండు వందలకి. ఆ అద్దే అతనికి జీవనాధారం. ఆ యిల్లు అయినా జనమేజయరావు తండ్రి పద్మనాభయ్య మనవడైన శరచ్చంద్రకి, అతని పిల్లలకి వ్రాయబట్టి అమ్మడానికి వీల్లేకుండా పోయింది కాని లేకపోతే అతని అప్పులకి ఆ యిల్లు అమ్ముకునేవాడే. దానిమీద వచ్చేదే తినడంతో శరచ్చంద్ర తనకి వచ్చేదంతా అప్పులు తీర్చడానికే సరిపెడ్తున్నాడు. అచ్యుతరామయ్య వున్నంతకాలం నెలకి అయిదు వందలు, సంవత్సరానికి సరిపడిన బియ్యం. ఆ మామిడితోటలో సిమెంటురేకులతో వేసిన పెద్ద షెడ్డు- అన్నీ ఇచ్చి ఓ కంట చూసేవాడు. ఆ మామిడితోటలో సీజన్‌లో శరచ్చంద్రకి వూపిరిసలపని పని. ఆ మామిడితోటలో చిన్నరసాలు. పెద్దరసాలు, బంగిన పల్లి- నాటుకాయ అన్నిరకాలూ వున్నాయి.

వూరగాయలకి పచ్చిమామిడికాయలు పండోతే మామిడిపళ్ళ నేపులకు, గంపలకు ప్యాకింగ్ చేయించి అన్ని వూళ్ళకి పంపిస్తుంటాడు. అందుకనే అతని దగ్గర మాటతీసుకుని వెళ్ళే వ్యాపారస్తులు బోలెడుమంది. జనమంతా అతనిచుట్టూ తిరుగుతుంటారు. చెప్లే పాడుకుంటారు ఒక్కోసారి. ఏదో లాభ సాటి అనిపిస్తే అలా చేస్తుంటాడు శరచ్చంద్ర. దానిమీద వచ్చే ఆదాయంలో సగం శరచ్చంద్రకే ఇచ్చేవాడు అచ్యుతరామయ్య.

అప్పుడే తనకి సంవత్సరానికి సరిపడ బట్టలు వగైరాలకి వాడుకుని మిగిలిన వాటిల్లో తండ్రికి బట్టలు కొనిచ్చి కొంత బ్యాంక్‌లోన్ చెల్లించి, తన ఇంట్లో తనకు కావలసిన పప్పు, ఉప్పులాంటివి నిలవేసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు.

బట్టలకొట్లో తండ్రికి పంచె, ఓ రెడీమేడ్ షర్టు తీసుకున్నాడు. ఓ యాభైలో తనూ పంచ, చొక్కాయే తీసుకున్నాడు. మిగిలిన వందలో ఆకుపచ్చమీద ఎరుపు, పసుపు, నీలం కలిసిన డిజైనుగల చీర, జాకెట్ గుడ్డ తీసుకున్నాడు మంజీరకోసం. ఆ చీర చూడగానే అతనికి కొనాలనిపించింది.

ఆ చీరలో మంజీర అందాలు వూహించుకుంటూ ఇంటికి వచ్చాడు. అతను

వచ్చేసరికి తండ్రి వంటచేస్తున్నాడు. వంటలో తండ్రికి సాయంచేసి తను తెచ్చిన దీపావళి స్వీట్సు, బట్టలు ఆయనచేతిలో పెట్టాడు "ప్రమిదలు వస్తే కొని వాకిట్లో దీప దీపాలు పెట్టు నాన్నా." అంటూ తండ్రిచేతిలో పదిరూపాయ లుంచాడు

"అదేమిటిరా! ఈ రెండు రోజులూ వుండవా ఇక్కడ?" అని అడిగాడు దిగులుగా తండ్రి

"వెళ్ళాలి నాన్నా, పనివుంది." అంటూ తప్పించుకుని బయటకి వెళ్ళిపోయాడు అతన్ని మంజీర 'త్వరగారండి' అంటున్నట్టు అయి ఎక్కడా నిలబడలేకుండా వున్నాడు. వెళ్ళి ఆ చీర మంజీరకివ్వాలి. ఆమె కట్టుకుంటే చూసి తను ఆనందించాలి అన్న తపనతో మధ్యాహ్నం భోజనాలుకాగానే ఆమెకోసం కొన్న చీర, ఓ స్వీట్ ప్యాకెట్, కాసిని టపాకాయలు అన్నీ తీసుకుని బయలుదేరాడు అతను చెప్పినట్టుగానే నాలుగున్నరకల్లా వచ్చి వురకలు పరుగులతో మంజీర ఇంటికి వచ్చాడు.

అతనెంత వూగిపోతూ వచ్చాడో అక్కడికి వచ్చేసరికి మంజీర ఇంటికి తాళం చూసేసరికి అంతను పదిరెట్లు కుంగిపోయాడు

వెనువెంటనే రామయ్య పాకదగ్గరికి వెళ్ళి "రామయ్యా! వీళ్ళెక్కడికి వెళ్ళారు?" అడిగాడు ఆదుర్దాగా.

"అమ్మగారు కుటుంబం ఇంటికి భోజనాలకి వెళ్ళారు" ఆ మాటవిని దెబ్బ తిన్నట్టు [illegible].

"భోజనాలకా?" అన్నాడు కంఠం పెగల్చుకుని.

"అవునండి పండుగ రెండురోజులూ అక్కడే వుండమని ఇంటిల్లిపాదీ వచ్చి పిలిచారండి. అందుకే వెళ్ళారు." ఆ సమయంలో శరచ్చంద్ర ముఖం శరత్కాల చంద్రుడిలా చల్లని వెన్నెలను వెదజల్లడం లేదు. మండు వేసవిలో చండప్రచండుడిలా తీక్షణత దాల్చింది

'ఎంతకైనా తగును మంజీర! ఛీ! తనే అనవసరంగా ఎప్పటికప్పుడు ఫూల్ అవుతున్నాడు. తనకేం ఖర్మ ఇలా అవమానాలు పడటానికి. ఆమెకి అక్షరాలా రామ్ప్రసాద్ అంటే వల్లమాలిన అభిమానం. ఏడవనీ! నాకేం! అతన్నే కట్టుకుని ఏడవమను' అనుకుంటూ క్రోధావేశాలతో కుతకుతా వుడికిపోతూ అవి రామయ్యకందించి "ఆవిడగారు వస్తే ఇవ్వు రామయ్యా! నేను వెడుతున్నాను." అంటూ విసురుగా బయటికి వెళ్ళిపోయాడు.

"ఈ రెండు రోజులూ వుందరా!" అంటూ జాలిగాచూసిన తండ్రిచూపు కళ్ళ



ముందు కదిలి ఈమె మీద గల వెర్రి వ్యామోహంతో ఆయన్నికూడా ఖాతరుచేయకుండా వచ్చాను. చివరికిలాంటి మోసంచేసింది మంజీర అనుకున్నాడు

'నేను వాళ్ళింటికి భోజనాలకి వెడుతున్నానంటే తనేమన్నా వద్దని నిర్బంధిస్తాడా! పెద్ద గొప్పగా బట్టలు కొనుక్కోండి! అంటూ డబ్బు చేతపెట్టడం దేనికి? తనకి బట్టలు తీసుకుని రమ్మని చెప్పడందేనికి? అంతే! ఈ ఆడవాళ్ళు చెప్పేదొకటి, చేసేదొకటి. తనమీద ఏదో జాలి లేదా పనివాడుగదా యజమానురాలు చూడకపోతే బాగుండదేమో అన్న ధోరణితప్ప మర్మంలేని హృదయమేది? అభిమానమేది? ఆమెనించి అని ఆశించేనా గొడ్డులా పనిచేస్తున్నది! అనుకుంటూ రోషావేశాగ్నిలో దహించుకుపోతూ తన మామిడితోటలోని గదికి వెళ్ళిపోయాడు. అక్కడికి వెళ్ళిపోయి గది తలుపులు తీసి మంచంమీద వాలిపోయాక అతని ఆగ్రహం కాస్తకాస్తే తగ్గిపోసాగింది.

తనెవరు ఆమె మీద అసూయపడటానికి? తను వెళ్ళేసరికి ఇంట్లో లేదని గింజుకోవడానికి? తనకీ ఆమెకీ ఏమిటి సంబంధం? గట్టిగా చెప్పవలసి వస్తే తనసలామెకి పదిమైళ్ళ దూరంలో నిలబడవలసిన పగటు జీవి. ఆమె ఇష్టమైన వ్యక్తితో ఆమె తిరుగుతుంది ఇష్టమైతే ఏమన్నా చేస్తుంది. తనెవరూ అభ్యంతరపెట్టడానికి? ఇలా తర్కించుకుంటూ పోయేసరికి అతనికి మంజీర మీదవున్న ఆగ్రహం పూర్తిగా తొలగిపోయింది

తనంటే ఆమెకి ఏపాటి ప్రేమా లేదు సరి తనో ఆమెని గుండెలో దాచుకుని ఆరాధిస్తున్నాడు తను డబ్బు లేనివాడే కావచ్చు కాని తనకి

హృదయం వుంది. ఆ హృదయంలో స్వచ్ఛమైన స్ఫటికంలాంటి మమకారమూ వుంది. అది వున్నంతకాలం ఆమె ఎవరితో స్నేహంకట్టినా ఓర్చుకోలేడు. అందుకే తనిక్కడినుంచి వెళ్ళిపోవడం మంచిది. ఈ నిర్ణయానికి వచ్చాక తపీమని లేచి కూర్చున్నాడు ఇంటికి తాళం పెట్టి వెళ్ళి కూలీలందరితో మాట్లాడాడు

"నేను వెళ్ళిపోతున్నాను. మీరంతా మీ అమ్మాయిగారెలా చెబితే అలా చేయండి" అంటూ పొలం విషయం అంతా క్షుణ్ణంగా చెప్పి తిన్నగా రామయ్య దగ్గరకువచ్చి "కోతలు నూర్పిళ్ళు అన్నీ దగ్గరుండి మంజీరమ్మగారితో వివరంగా చెబుతూ వుండు రామయ్యా నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు శరచ్చంద్ర.

"అదేమిటి బాబూ. ఇన్నాళ్ళనించీ ఈ భూమిని కనిపెట్టుకుని వున్నవారు!" అన్నాడు బాధగా రామయ్య.

"ఎన్నాళ్ళు కనిపెట్టుకున్నా పరాయివారిది మనదవుతుందా రామయ్యా. అక్కడ మా నాన్నగారు దిగులుపడుతున్నారు నేను లేనని. వృద్ధాప్యంలో ఆయన్ని ఒంటరిగా వదిలి ఇక్కడ నేను చేసే ఘనకార్యాలేమున్నాయి రామయ్యా!" అంటూ విషాదంగా నవ్వాడు. రామయ్యకి నోట మాటరాలేదు. అలాగే చూస్తుండిపోయాడు.

"వస్తాను" అంటూ ఆ మునిమాపువేళలో మళ్ళీ బస్‌స్టాప్‌కు బయలుదేరాడు విజయవాడకి వెళ్ళిపోవాలని. పది నిముషాల్లో వచ్చేసింది బస్సు. వెంటనే ఆ పల్లెకీ మంజీరకి నమస్కారం పెట్టి ఎక్కికూర్చున్నాడు. అతని మనసులో గాయం మరింత పెద్దదిచేస్తూ బస్ స్పీడందుకుని ఆ వూరి పొలిమేరలను దాటిపోయింది. మంజీరకు శరచ్చంద్రకు మధ్య మరింతగా దూరం పెరిగిపోయింది.

ఆనాడు ఉదయమే రామప్రసాద్, చిదంబరం వచ్చి మళ్ళీ పిల్చుకపోతే మంజీర వెళ్ళకుండానే వుండేది. తెల్లవారేసరికి గుమ్మంలోకి వచ్చి కూర్చున్నాక ఇంక బాగుండదని త్వరత్వరగా స్నానాలు కానిచ్చుకుని బయలుదేరారు

కమలమ్మ ఏదన్నా సాయంచేద్దామనుకున్నా చింతామణి వప్పుకోక కూతుళ్ళ సాయంతో వంటంతా పూర్తిచేసింది. అంతవరకూ రామప్రసాద్ మంజీరతో కబుర్లుచెబుతూ కూర్చున్నాడు. సాయంత్రం వరకూ బాగానే కబుర్లుచెప్పినా శరచ్చంద్ర వస్తానన్నటైము దగ్గరకి వచ్చేసరికి ఎక్కడలేని కంగారూ పట్టుకుంది. "ఇంక వెడదాం పదమ్మా!" అంది తల్లితో.

"అదేమిటమ్మా, రెండు రోజులూ మా యింట్లో వుండవలసిందే!" అంది చింతామణి.

"ఈరోజు మీ ఇంట్లో వున్నాంగదా; రేపు మా ఇంట్లో మేం పండుగ చేసుకో కుండా ఇంటికి తాళంపెట్టి ఇక్కడ ఎలావుంటాము!" అంది మంజీర అచ్చితంగా

"అదేమిటి మంజీరా! ముందు ఇంటిదగ్గర 'యస్' అని ఇక్కడికి వచ్చా ప్లేటు పిరాయించావు. కాస్త చపలచిత్తం వున్నట్టుంది" అంటూ ఎగతా చేశాడు రామప్రసాద్.

ఇంక ఇక్కడ వదుల్చుకుని కొంప చేరడానికి మార్గం ఆలోచించి చివర "ఈరోజు మేము మీ యింటికి వచ్చాం, రేపు మీరంతా మా యింటికి రండి" అంది మంజీర. కూతురికి వత్తాసు వచ్చింది కమలమ్మ.

ఆ ఆహ్వానం వినగానే ఇంత అయ్యాయి ముఖాలు ఇద్దరికీ. వెంటనే ఒప్పుకున్నారు. అప్పుడు తేలిగ్గా వూపిరి పీల్చుకున్న మంజీర "ఇంక పదమ్మా," అంటూ తల్లిని వూదరగొట్టింది.

"ఉండమ్మాయి ఎక్కడా వినబడవేమిటి!" అంటూ గదమాయించి, కూతురు చామంతి పూలదండ కట్టి ఇచ్చేవరకూ నిలబెట్టింది. ఇవన్నీ అయ్యేవరికి "ఇంతకీ చీర కొనుక్కున్నావా ?" అంటూ ప్రారంభించింది. ఆవిడగారి యక్షప్రశ్నలకి విసుగుదల నణచుకుంటూ జవాబిచ్చి ఇల్లు చేరేవరికి చీకటి పడిపోయింది

శరచ్చంద్ర వచ్చి వెళ్ళిపోయాడేమోనని అనుకుంటూనే అదుర్దాగా అడుగుపెట్టింది. ఆమె అనుకున్నట్టుగానే వార్తతో పాటు ప్యాకెట్టూ అందించాడు రామయ్య ఆ తర్వాత అతనన్న మాటలు కూడా చిలకలా పలికాడు. మంజీరకు పైన ఆకాశం, క్రింద భూమి తల్లక్రిందులయినట్లయి స్థంభించిపోయింది. ఆమె కళ్ళంబడి గిర్రున నీళ్ళు తిరిగాయి.

'ఎంతపని చేసాడు శరచ్చంద్ర? అతని ఆవేశమూ తొందరపాటూ తెలిసివుండి కూడా తనెందుకు మధ్యాహ్నమే వచ్చింది కాదు'! ప్యాకెట్ విప్పి చూసింది. చీర, బ్లౌజ్‌పీస్. అవి చూడగానే మరింత దుఃఖం వచ్చేసింది మంజీరకి.

తను అతన్ని బట్టలు కొనుక్కోమంటే అతను తనకి తెచ్చాడు.

'ఏం! ఆ మాత్రాం జన డబ్బు వాడుకోకూడదనుకున్నాడా ?' అనుకుంటూ రోషంతో బుసలుకొట్టింది మంజీర.

అతను వెళ్ళిపోయాడన్న బాధ, దిగులు తన డబ్బు పుచ్చుకోలేదన్న ఉక్రోషం అన్నీ కలగాపులగమయి ఏంచేయడానికి, ఏమనడానికి కవిపించక కన్నీళ్ళతో మంచంమీద వాలిపోయింది.

"అదేమిటే అలా పడుకున్నావు? రేపు వాళ్ళంతా వస్తారాయె. మనకి పని తెమలొద్దూ. కాస్త మైసూరుపాకం ఈ పూటే చేస్తే బాగుంటుందిగా?"

"చేసుకోవమ్మా! నా ప్రాణం తీయక." అంటూ విసుక్కుంది తల్లిమీద.

"అదేమిటే అలా కసురుకుంటావు. ఇప్పటిదాకా బాగానే వున్నావుగా!" అంది ఆశ్చర్యంగా.

"ఎలాగో చచ్చాలే. నన్ను విసిగించక చేసుకుంటే. చేసుకో లేకపోతే మానేయి. నాకు తలపోటుగా వుంది." అంటూ అమృతాంజనం ఇంత తీసి తలకు పట్టించి అటు తిరిగి పడుకుంది. నిజంగానే కూతురికి వళ్ళు బాగాలేదు కాబోలను కుంది కమలమ్మ. తనే వంటగదిలోకి చొరబడి రామయ్యని పిలిచి తనపనులు చూసుకోసాగింది.

మంజీర కళ్ళ నుండి ధారాపాతంగా కన్నీరు కారసాగాయి. ఛీ! ఇతనంత తొందరపాటు మనిషి ఈ భూప్రపంచంలో ఎక్కడా వుండడు. ఒక్క గంట తనకోసం వెయిట్ చేయలేకపోయాడు. రామయ్య మాటల్నిబట్టి చూస్తే తిరిగి రాని పద్ధతిలో వెళ్ళినట్టే కనిపిస్తోంది. అదే నిజమయితే తన ప్రేమ మనలో ఇగిరిపోవలసిందే. నిజంగా అతన్ని తను ప్రేమిస్తోందా? అసలు స్త్రీలోలత్వం తెలిసివుండీ ఎలా ప్రేమిస్తుంది? ఏదో మామయ్యకి ప్రీతిపాత్రుడు గనుక అతన్ని అభిమానించి అంతే. అంతేగాని తనెందుకతన్ని వరిస్తుంది? అంత తెలివితక్కువదా తను అనుకుంది రోషం కోపం బుసబుసకొట్టగా.

కాసేపయ్యేసరికి ఆ కోపం చప్పగా చల్లారిపోయింది. తనని తను ఆత్మ వంచన చేసుకోవడమేగాని అతనంటే తనకి ఇష్టంలేదూ! ఇష్టం లేకపోతేనే అతను వెళ్ళిపోయాడని ఏడుస్తోందా ఇంత కకావికలైపోయి! ఏమైనా తనని తను మభ్య పెట్టుకోవాలని చూడటమేగాని అతనెలాంటి వాడైనా తన మనస్సు అతనే పరుగులుతీస్తోంది. అతను లేకపోతే ఈ పొలంపనులు, తోటల సంరక్షణ ఎవరు చూస్తారు? అందరికీ ఆనందాన్నిచ్చే దీపావళి తనకిమాత్రం విషాదాన్నే ఇచ్చింది అనుకుంటూ ఆ విధంగా ఏడుస్తూనే నిద్రపోయింది కాని భోజనం మటుకు చేయలేదు.

## 12

కొడుకుని చూడగానే జానకమ్మ సంతోషం కళ్ళల్లో దీపావళి వచ్చేసింది. మనసులో బాధని పైకి కనిపించనీయకుండా నవ్వుతూ పలకరిస్తూ తిరుగుతున్నాడు శరచ్చంద్ర. తనా మోసుద ... బాధకాద్నో ... సమంజసమేనా అను

కుంటూ మధనపడసాగాడు. ఆమె అవన్నీ చూసుకోగలదా అన్న అనుమానం అంతకంతకూ ఎక్కువకాసాగింది. మళ్ళీ రామప్రసాద్ గుర్తుకురాగానే 'ఆవిడకి తెలియకపోతే చెప్పడానికి ఆయన వున్నాడుగా!' అనుకుంటూ కసిగా పళ్ళు నూరుకున్నాడు.

తెల్లవారేసరికి ఇంటిల్లిపాదీ హాజరయ్యారు మంజీర ఇంటికి. వాళ్ళందర్నీ చూసేసరికి అరికాలిమంట నెత్తికెక్కిందేగాని ఏమీ సంతోషం కలిగించలేదు మంజీరకి. విన్న వాళ్ళని వదుల్చుకోవడంకోసం ఈ రోజు రమ్మని పిలవడం బుద్ధితక్కువ అయిపోయింది. తన సంతోషాన్ని ఉత్సాహాన్ని అన్నింటినీ లాక్కుని శరచ్చంద్ర వెళ్ళిపోయాక తన మనస్సే చీకటి అయింది. చంద్రుడు లేని ఆకాశం వెలవెలబోతే అమావాస్య చీకటులేగా ఆవహించేది?

"అమ్మాయి ఏమిటలా వున్నావు! ఇదా అదీ వేసుకో. కొత్తచీర కట్టుకో."

అంటూ వెనకే తిరుగుతున్న చింతామణిని చూస్తే మంజీరకి రెండు చెంపలూ వాయించాలన్న వుద్రేకం వస్తోంది.

"పండుగపూట అలా డల్‌గా వున్నావేం?" అని అడిగాడు రామప్రసాద్. ఎవరికి ఏమీ జవాబు చెప్పలేదు. తన స్నానాదికాలు పూర్తిచేసుకుని శరచ్చంద్ర తెచ్చిన చీర కట్టుకుంది. అతని ఇంటి అడ్రసు తెలిస్తే బాగుండు. ఒక్కసారి విజయవాడ వెళ్ళి అతనికి తను తెచ్చిన చీర కట్టుకున్నానని చూపించి రావచ్చు, అనుకుంటూ తపనపడసాగింది.

మొత్తానికి ఇంట్లో పేంచేసినా ఎందరున్నా ఒంటరితనంతోనే పీడించింది మంజీర.

సాయంత్రం అవుతున్నకొద్దీ శరచ్చంద్ర ఇంట్లో కూర్చోలేకపోయాడు. మంజీరని చూడకపోతే పిచ్చెత్తినట్లుగా వుంది. మెల్లిగా ప్రమీలని చూద్దామని ఆమె ఇంటికి మాచవరం బయలుదేరాడు.

"ఎప్పుడు వచ్చావు శరత్?" అని అడిగింది ప్రమీల చిరునవ్వు ముఖంతో.

"నిన్ననే వచ్చాను."

"మళ్ళీ ఎప్పుడు వెడతావు?"

"ఇంక ఇప్పట్లో వెళ్ళను."

ప్రమీల ఆశ్చర్యంగా అతనివంక చూసింది.

టిఫిన్ పెట్టింది. కాఫీ ఇచ్చింది. ఆ రాత్రికి అక్కడే భోజనం పెట్టింది. వాళ్ళందరితో పాటు తనూ నాలుగు బొబ్బట్లు, రెండు తారాజువ్వలు, పేల్చు

తూటాలు కాల్చి భోజనంచేసి ఆమె తల్లితండ్రులకి చెప్పి ఇంటికి వచ్చేశాడు. ప్రమీలతో కబుర్లుచెప్పినా, సరదాగా టపాసులు పేల్చినా అతని మనస్సుకేమీ స్వాస్థ్యం చిక్కలేదు. మంజీర కళ్ళముందు కదలాడుతూంటే 'ఈమెని మరిచి పోవడం ఎలాగా?' అన్న దీర్ఘాలోచనలో పడిపోయాడు

పండుగ వెళ్ళిన తర్వాత రెండు రోజులు వరసనే మామిడితోట దగ్గరకు వచ్చింది మంజీర ఆకులన్నీ వూడ్చేవాళ్ళు లేక, తోట అంతా ఎండి దుమ్ము ధూళితో నిస్తేజంగా వుంది ఆలా నిలబడి చూడటంతప్ప ఏ మామిడికొమ్మా ఆమెకి స్వాగతం పలకలేదు.

విశృంఖలంగా కాలువదగ్గరకి వచ్చింది. అదీ ఏదో నిర్లిప్తంగా సాగిపోతున్నట్టే కనిపించింది. ఛీ! ఆఖరికి శరచ్చంద్ర ప్రకృతినికూడా తనచేత బెట్టుకెళ్ళిన్నట్టు న్నాడు లేకపోతే అతనున్నప్పుడు కళకళలాడేవన్నీ ఎందుకిలా వెలవెల పోతున్నాయి. అతనున్నప్పుడు గలగల సంగీతం వినిపించే ఈ కాలువ ఇప్పుడిలా విధిలేనట్టు పారుతోందేం? మెల్లగా వెనక్కితిరిగి వచ్చింది అతనున్న ఇంటి దగ్గరకు ఆ యింటికి తాళంలేదు. దడదడలాడే గుండెలతో లోపలికి తొంగి చూసింది. అతనిదీ అంటూ ఒక్క వస్తువు కనిపించలేదు. అంతా ఖాళీగానే వుంది. దేవుడిపటం మాత్రం కనిపించింది. దానిక్రింద శరచ్చంద్ర రాసింది- 'భగవాన్! ఈ పొలాలన్నీ తుఫాను బారినుంచి రక్షించు.' అంటూ రాసిన ఒకే ఒక వాక్యం అదికూడా బాగా పాతబడి నలిగివుంది. అంటే ఈ మామిడితోటని- ఆ నారింజ తోటని ఈ భగవంతుడే కాపాడాలని కాపలాపెట్టి వెళ్ళాడా శరచ్చంద్ర!

ఇంటికి తిరిగివచ్చేసింది. ఆమె వచ్చేసరికి కూలీలు వచ్చి వున్నారు. "రండమ్మా పొలానికి" అంటూ తీసుకువెళ్ళి శరచ్చంద్ర చెప్పినట్టే ఆమెకి అన్నీ తెలియజేస్తూ పని ప్రారంభించారు.

శరచ్చంద్ర ఏవిధంగా వాళ్ళందరికీ శిక్షణ ఇచ్చి వెళ్ళాడో, అతనంటే వారికి ఎంత అభిమానమో గ్రహించిన మంజీర దీర్ఘనిశ్వాసం వదిలింది. మొదట్లో కొత్త అనిపించినా రానురానూ అలవాటుపడసాగింది. స్వతహాగా ఆమె తెలివైందే కనుక అన్నీ క్షుణ్ణంగా అర్థంచేసుకుంటూ అన్ని పనులూ దగ్గరవుండి చేయించుకోసాగింది.

శరచ్చంద్ర వెళ్ళిపోయాడన్న విషయం బయట ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడింది.

"ఏమిటి, అన్న పొలం పనులన్నీ నువ్వే చూస్తున్నావు?" అని అడగనే ఆదీ లేదు నిరంబరం

"ఆయన వాళ్ళ నాన్నగారికి ఒంట్లో బాగా లేదని వెళ్ళారు " అంది ముభావంగా.

"అందుకే తల్లీ! అలాంటివాళ్ళని నమ్ముకుంటే అడవిలో వదలిపోతారన్నది. మాకావ్యవసాయం అప్పగిస్తే విన్ను గుమ్మం కదలనిచ్చేవాడినా !" అన్నాడు దొరికిందే ఛాన్సుగదాని

"ఫర్వాలేదు చిదంబరంగారూ! అన్నీ ఆయన విపులంగానే చెప్పివెళ్ళారు. నేను ఆ మాత్రం సరిచూసుకోలేనా ?" అంది చిరునవ్వు నవ్వుతూ

ఆ మాటకి వొగలు- సెగలు పోయాడు చిదంబరం 'చిదంబరంగారూ! అంటూ దీర్ఘం తియ్యకపోతే మామయ్యగారూ! అని పిలవకూడదా!' అను కున్నాడు మంటగా . అయినా అంత మాత్రానికే బయటపడే రకం కాదు కనుక "పోనీ అబ్బాయిని పంపమంటావా ?" అని అడిగాడు

"అక్కర్లేదండీ! నేను చూసుకోగలను " అంది ఉచితంగా.

మామిడితోటకి కావలాగా రామయ్యే వుంటున్నాడు నారింజతోటకి ఇద్దర్ని శరచ్చంద్రే నియమించాడు. నియమించి వెళ్ళాడు.

రోజులు గడుస్తున్నాయి. ఏ రోజైనా అతను తిరిగివస్తాడన్న ఆశతో ఎదురుచూస్తోంది మంజీర ఆరోజు-

ఇంట్లో మేనమామ ట్రంకుపెట్టె తీసి అందులో ఏమున్నాయో నన్నట్టు చూద్దా మని కూర్చుంది మంజీర పైన అన్నీ మేనమామ కట్టుకునే బట్టలు- ఇంకా గడివిప్పని బట్టలు అవన్నీ ఎవరికైనా ఇచ్చేద్దామని తీసి ఒక్కొక్కటే విప్పదీసి గూసి మళ్ళీ మడతలు పెట్టి ఓ పక్కన పెడుతోంది అట్టడుగున ఓ చిన్న మూట కనిపించింది ఆ మూటలో ఓ చిన్న గంధపుపెట్టె. ఆ పెట్టె మీద రకరకాల పువ్వులు, ఆకులు నగిషీచెక్కి చూడటానికి ఎంతో అందంగా వుంది మెల్లగా దాన్ని తెరిచింది అందులో ఓ పావుతావుపైజు కాగితానికి ఓ అందాల సుందరి సంవత్సరం బాబుని ఎత్తుకుని నవ్వుతూ నిలబడిన ఫోటో వుంది ఆశ్చర్యంగా ఆ ఫోటో నే చూసింది రెండు నిముషాలు- ఆ తర్వాత దానికి చుట్టి వుంచిన కాగితం తీసింది పైన "చిరంజీవి మంజీరకు" అన్న సంబోధన చూసి అదిరిపడి ఫోటో మళ్ళీ పెట్టెలో పడవేసి ఆ వుత్తరం చదవసాగింది

"మంజీరా! మామయ్య రాసే ఈ వాక్యాలు చదివి గుండెలో పెట్టుకుంటావు గదూ! నన్ను జీవితంలో ఎందరో పెళ్ళిచేసుకోను కోరారు- వేడారు- ఎన్నో నిందలు- ఛీత్కారాలూ కూడా వెదజల్లారు అయినా నేను తొణకలేదు బెణక లేదు ఎందుకో తెలుసా ? నా ప్రేమ అకలంకమైనదని, నా మనస్సు అంత

విగ్రహవంతమని చెప్పడానికి– ఎవరికి? మీ అందరికీ కాదు– నా ఆరాధనామూర్తి అరవిందకి. ఈ ఫోటోలో వున్నది అరవింద. ఆమె చేతిలోవున్నది ఆమె దాంపత్యఫలం చిరంజీవి శరచ్చంద్ర. అర్థమయిందా? శరచ్చంద్రని నేను ఎందుకంత ఆదరిస్తానో, ప్రేమిస్తానో! ఒకప్పుడు అతని తల్లి నన్ను ప్రేమించింది. అయితే పట్నం సంబంధం– పెద్ద వ్యాపారస్తుడన్న మురిపెంతో ఆమెని జనమేజయరావుకిచ్చి పెళ్ళిచేశారు. మా ఇద్దరి గుండెలు వెయ్యి చెక్కలయినా ఇద్దరమూ విస్మరించాము. ఆమె పుట్టిల్లు ఇక్కడే కనక వచ్చినప్పుడల్లా చూస్తుండేవాడిని. ఆమె గర్భవతి అయి బిడ్డను కనడం ఆ పిల్లాడు తాతగారింటికి వచ్చినప్పుడల్లా నాదగ్గరికి రావడం మా ఇద్దరి అనుబంధం మరింత పెంచింది. విధి క్రూరమైంది. పండులాంటి ఆమె జీవితం నేలపాలయింది. ఆమె మరణంతో వాళ్ళింటి పరిస్థితులెలా తారుమారయ్యాయో నాకు తెలుసు. అందుకే బాబు శరత్‌ని ఓ కంట కనిపెట్టి వున్నాను. నాకూ పిలుపు దగ్గరికి వస్తోంది. అరవిందని ఆ లోకంలో ఎప్పుడు కలుసుకోనా అని తహతహ లాడుతోంది నా మనస్సు. మంజీరా! మా ప్రేమ పదికాలాలపాటు మధురంగా మిగలాలంటే శరత్‌ని నువ్వు వివాహం చేసుకో! వాడు నాకే పుట్టి వుంటే తప్పకుండా మీ అమ్మ మేనరకం కలిపేది కదూ! నాకు పుట్టకపోయినా, నా ప్రేమమూర్తికి పుట్టిన ఆ బిడ్డ నా బిడ్డగానే నేను ప్రేమించాను. అలాగే నువ్వు అతన్ని పెళ్ళాడితే సంతోషిస్తుంది నా ఆత్మ. నీ కిష్టమైతేనే లేకపోతే నిర్బంధం ఏమీలేదు. ఇది నా కోరిక మాత్రమే. నీకభ్యంతరం లేకపోతే ఆ కోరిక నెరవేర్చు. లేనిపక్షంలో– ఆ నారింజతోట పూర్తిగా అతని కిచ్చివేయి. నీకు ఏపనిచేసిపెట్టినా అతనికి నువ్వు ఋణపడే వుంటావని గుర్తించి అతని కష్టానికి తగిన ప్రతిఫలం ముట్టచెబుతూండు. ఇట్లు అచ్యుతరామయ్య."

ఆ వుత్తరం చదివేసరికి ముచ్చెమటలు పోసుకువచ్చాయి మంజీరకి. ఇదా ఆ బాబాయి, బిడ్డల అంతర్యం! ఎంత నిండు గుండె మామయ్యా నీది. నీ ప్రేమకు చ్యుతిలేదు. నువ్వు నిజంగా రాముడివి! అచ్యుతరాముడివి అనుకుంటూ మేనమామని తలచుకుని కన్నీరు పెట్టుకుంది మంజీర. ఆమె మనస్సు మరీ పాడైపోయింది. ఈ వూరు వచ్చి లేనివన్నీ తలకెత్తుకుని సుఖానవుండే ప్రాణాన్ని దుఃఖపెట్టుకున్నానా అనుకుంటూ చాలాసేపలాగే మూగవేదనని అనుభవించింది. ఆమె కళ్ళల్లో– కాదు ఆ యింట్లో ప్రతివస్తువులోనూ శరచ్చంద్రే కనిపిస్తున్నాడు. పకపకా నవ్వుతున్నాడు. చిలిపిగా చూస్తున్నాడు.



కొంటెగా చేతులు చాపుతున్నాడు. భరించలేక కళ్ళు మూసుకుంది. ఆ మూసిన కనురెప్పలలోనూ పెంకి శరచ్చంద్రే ప్రత్యక్షమయ్యాడు.

"శ్రీరామచంద్రా! నన్ను మానసిక సంక్షోభవించి కాపాడు నన్ను ఓ గట్టున పడవెయ్యి ఆ శరచ్చంద్ర ఈపాటికి ప్రమీలని పెళ్ళిచేసుకునేవుంటాడు. అందుకే తనని విస్మరించాడు లేకపోతే వెళ్ళి పదహారు రోజులయింది. కనీసం ఉత్తరమన్నా రాశాడా! రాసిస్తే ఎంతసేపు రావాలి." అనుకుంటూ దిండులో తలదూర్చి వెక్కివెక్కి రోదించింది మంజీర

# 13

పండుగ వెళ్ళిన రెండవరోజు శరచ్చంద్ర ఇంకా మంచంమీదనించి లేవనే లేదు. కంగారుగా లేపాడు ఓ అబ్బాయి

"ప్రమీలమ్మ నాన్నగారికి హార్ట్ఎటాక్ వచ్చి ఆస్పత్రిలో చేర్చారు రండి నాతో" అనేసరికి నిద్రమత్తు ఎగిరిపోయిన శరచ్చంద్ర వెంటనే ముఖం అన్నా కడుక్కోండా వెళ్ళిపోయాడతనితో. అతను వెళ్ళేసరికే అంతా అయిపోయింది. అతన్ని పెనవేసుకుని గొల్లుమంది ప్రమీల సున్నిత మనస్కుడైన శరచ్చంద్ర కళ్ళు వెంటనే వర్షించాయి. తనూ వారిలో చేరిపోయి అతని అంత్యక్రియలన్నీ దగ్గరేవుండి చేయించాడు. ఆ సాయంత్రంవరకూ అక్కడేవుండి అప్పుడు ఇంటికి వచ్చాడు. పదకొండు రోజులూ వాళ్ళింటికి రోజూవెళ్ళి ఏదో ఒక సహాయంచేసి వస్తూనేవున్నాడు.

అవన్నీ పూర్తిఅయ్యాక "శరత్! నీ పెళ్ళిమాట ఏం ఆలోచించావు?" అని అడిగింది ప్రమీల.

"నేనింకా రెండు మూడేళ్ళదాకా పెళ్ళిమాట తలపెట్టను ప్రమీలా! ప్రస్తుతం నేనా పల్లెని వదలి వచ్చాను- ఇక్కడే ఏదో ఉద్యోగ ప్రయత్నమో, వ్యాపారమో చేయందే కాదూ, బొంగరంలేక ఏడుస్తూ పెళ్ళేమిటి?" అన్నాడు ఖరాడుగా

ఆ మాటల్లోని స్థిరత్వాన్ని గ్రహించిన ప్రమీల నిర్లిప్తంగా చూసింది అతనివంక.

శరచ్చంద్ర ఇంటికి వచ్చాడు అతని మనస్సంతా ఎందుకో- ఏమిటో తెలియకుండానే అవ్యక్తమైన ఆవేదనతో నిండిపోయింది. ఈ ప్రమీల తండ్రి చావు గొడవలతో రేడియో వినడం మానేశాడు మెల్లగా ఇంటికి వచ్చి రేడియో ఆన్‌చేశాడు

వాతావరణ సూచన చెబుతున్నారు. రాగల 24 గంటలలో తీవ్రమైన తుఫాను రాగల సూచనలున్నాయని, పెనుగాలుల తాకిడిని వివరిస్తూ జెస్తవారికి సురక్షిత ప్రాంతాలకి తరలిపోవలసిందిగాను సముద్రంమీదకి రావద్దన్న హెచ్చరికలు- కోస్తా ఆంధ్ర ప్రాంతాలవారికి తీవ్రమైన హెచ్చరికలు వింటూ అదిరిపడి లేచాడు శరచ్చంద్ర.

అతని కళ్ళముందు అచ్చుతరామయ్య. అతని దీనవదనం ఆయన పొలం, మంజీర అన్నీ గిరగిరా తిరిగిపోయాయి తుఫాను హెచ్చరికలు అతని

ప్రాణాల్ని నిలువునా కూల్చివేశాయి. ఏమయినాసరే తనక్కడికి వెళ్ళాలి ఆ పొలం పనులెలావున్నాయో చూడాలి అనుకుంటూ గబగబా బ్రీఫ్‌కేస్‌లో నాలుగు బట్టలు సర్దుకుని బస్‌స్టాండ్‌కి చేరుకున్నాడు అతను బస్‌లో ఆ పల్లె చేరేసరికి రాత్రి తొమ్మిది అయింది తిన్నగా మామిడితోట చేరాడు తనగది గదిలానే వుంది. రామయ్య ఇంకా రాలేదులా వుంది పడుకోవడానికి ఆకలి వేస్తున్నా తెచ్చుకున్న అరటిపళ్ళతో సంతృప్తిపడ్డాడే గాని ఆ రాత్రిపూటమటుకు మంజీర ఇంటికి వెళ్ళడానికి ఇష్టపడలేదు

ఆకాశంలో మబ్బులు తొంగి చూస్తున్నాయి. ఈదురుగాలులు బాగా వేస్తున్నాయి. మనస్థిమితంలేక పిచ్చివాడిలా కూర్చున్నాడు తెల్లవారే సరికి పట్టుకుంది వర్షం. అది కొస్తకొస్తే ఎక్కువయిపోతుంటే శరచ్చంద్ర పూర్తిగా వెత్తెత్తినట్లయి ఆ వర్షంలో తడుస్తూనే పొలంకేసి బయలుదేరాడు. అతను ఎలావుంటుందని వూహించాడో సరిగ్గా అలాగే వుంది. ఒకసారి ఆకాశంకేసి చూశాడు కనికరం లేని కటిక కసాయివాడిలా కనిపించింది అంతకంతకూ ఉధృతం అవుతోంది వాన దేన్ని కబళించడానికో వస్తున్నట్లు భయంకరంగా వీస్తోంది ప్రభంజనం కరెంటులేదు ఈ ఏడు ఈ పంట దక్కదేమోననుకుంటూ కలతచెందుతూ ఒక్కసారి మంజీర ఇంటికి వచ్చాడు

ట్రాన్సిస్టర్ దగ్గర పెట్టుకుని ఖిన్నవదనంతో కూర్చునివుంది మంజీర. గుమ్మంలో ప్రత్యక్షమైన శరచ్చంద్రని చూడగానే ఆమె దిగ్గున లేచింది ఒళ్ళంతా పులకరింత బయలుదేరింది కలో, నిజమోనన్న అయోమయావస్థతోనే అతనికి ఎదురువెళ్ళింది.

"రండి" అంటూ ఆమే తేరుకుని ఆహ్వానించేసరికి శరచ్చంద్ర మనస్సు కొస్త శాంతించింది. ఎన్ని రోజులకో దర్శనమిచ్చిన ఆమెని చూస్తుంటే అతనిలో ఆవేశం పెల్లుబికి వస్తోంది.

"రేడియో వింటున్నావా మంజీరా" అని అడిగాడు కూర్చుంటూ. "వింటున్నాను. వినడం మినహా ఏమీ చేయలేకపోతున్నాను." అంది దిగులుగా.

"ఏవరమన్నా అంతే మంజీరా అది వినే ఆగలేక పరుగెత్తుకుంటూ వచ్చాను"

"గొప్ప పని చేశారు. యింకా మీ కాపాటి అభిమానం వున్నందుకు కృతజ్ఞురాలినే." అంది మెల్లగా.

"వర్షం పెద్దదయింది గాలి ముమ్మరంగా వుంది. ఇది ఇంకా ఇంకా వేగం పెంచుకుంటుంది" అన్నాడు శరచ్చంద్ర ఆమెనే చూస్తూ.

"మీరు ఇక్కడే వుండండి" అంది మంజీర భయంగా చూస్తూ.

"ఇక్కడ నేను వుంటే అక్కడ మామిడితోట నారింజతోట ఏమవుతాయి!"

"అందుకని మీ రక్కడ వుండిపోతారా. ఈ పెనుగాలికి మామిడికొమ్మలు విరిగిపడితే ఆ షెడ్డేం నిలబడుతుంది?"

"నిలబడకపోతే పోనీ. దాంతోపాటు నేను కాలగర్భంలో కలసిపోతాను. అంతే కాని బాబాయి చూడమన్నవి చూడకుండా వుండలేను," అంటూ లేచాడు.

ఇంతలో చిదంబరం కుటుంబం అంతా వచ్చేసింది ముఖ్యమైన సామాను తీసుకుని.

"అక్కడ మాయిల్లు కారుతోంది మంజీరా. ఈ గాలికి అప్పుడే మా వేప చెట్టు విరిగిపడింది. అక్కడ వుండిటానికి భయంవేసి ఇలా వచ్చాము" అంటూ అంతా తలో మాట చెబుతూ కథాసారం వివరించాడు.

శరచ్చంద్ర దొడ్లో ఆవుల్ని, గేదెల్ని తీసుకుని "మంజీరా ఈ గదిలో కట్టేద్దాం వీటిని. లేకపోతే పాక కూలిందంటే విషాకరణంగా చస్తాయి ఈ మూగజీవాలు" అంటూ వచ్చాడు

మంజీర అలాగేనన్నట్టు తల వూపింది.

"వాటికేం భర్వాలేదమ్మాయి ఈ పాక ఆ మధ్య కొత్తగా వేసిందేకదా" అన్నాడు చిదంబరం.

చిదంబరానికి శరచ్చంద్ర అంటే బొత్తిగా గిట్టదు. అది స్పష్టంగా గ్రహించింది మంజీర.

ఇంక శలవు తీసుకున్నాడు శరచ్చంద్ర, 'వాళ్ళంతా ఆమెకి తోడుగా వుంటార్లే' అనుకుంటూ.

కరెంటు లేదు. చీకటి పగలే చీకటిగా వుంది. శరచ్చంద్ర తిన్నగా పొలం దగ్గరకి నడిచాడు. కూలీలంతా గజగజ వణకుతూ గుడిసెలు వదిలి బయటకి వచ్చి నిలబడి వున్నారు తాటాకు గొడుగులు వేసుకొని. అవి ఎక్కడ ఆగుతాయి.

"బాబుగారూ ఈ గుడిసెలన్నీ కారిపోతున్నాయి"

"కొందరు మామిడితోటలో నా షెడ్డుకు రండిరా" శరచ్చంద్ర అనడమే తడవు బయలుదేరారంతా. అందర్నీ షెడ్డుచేర్చాడు. మరికొందర్ని రామాలయంలోకి చేర్చాడు. కాఫీ తాగలేదు, అన్నం తినలేదు. శరచ్చంద్రకి ఆకలి మండిపోతోంది.

మంజీర ఇంటికి వచ్చాడు. అంతా భోజనాలుచేసి దుప్పట్లు ముసుగుబి ంచి పడుకున్నారు మంజీర ఒక్కర్తే మెలకువగావుంది

శరచ్చంద్ర తడిసి ముద్దయి గజగజా వణికిపోతున్నాడు.

"అదేమిటి ఇలా తడిసిపోయారు". అంటూ మంజీర గబగబా టవలు తెచ్చింది. మేనమామ బట్టలు గడివిప్పనిని తెచ్చి అందించి "ఇవికట్టుకోండి" అంది.

"మంజీరా. కాస్త కాఫీవుంటే ఇద్దూ. తలపగిపోతోంది" ఆ మాట వింటూ బాధగా చూసింది. "భోజనం చేశారా," అని అడిగింది మంజీర "భోజనమా సామానులేవి? పైగా అక్కడంతా మన కూలీలని దింపాను కొందర్ని రామాలయంలో వుండమన్నాను"

"లోకోపకారంలో పడి అన్నీ మర్చిపోయారన్నమాట" అంటూ లోపలకి వెళ్ళి కాఫీ ఇచ్చింది. దాని మీదే ఓ చారెడు బియ్యంవండి అతనికి భోజనం పెట్టింది

"థాంక్స్ మంజీరా రాత్రినించీ ఆకలికి మలమలమాడిపోతున్నాను" అన్నాడు భోజనం పూర్తిచేసి మంజీర మనస్సు చివుక్కుమంది. "ఈ రోజు నిజంగా బాబాయివుంటే నకెం చకచక ఏర్పాట్లు చేసేవాడో నువ్వూ అలాగే చేశావు నుకు చాలా కృతజ్ఞుడిని" అన్నాడు లేస్తూ.

అతని మాట అంగానే మేనమామ, మేనమామ ఉత్తరం వచ్చి కళ్ళను దు తిరిగిపోయారు. ఆమె ఏదో సేలోగా "మంజీరా జాగ్రత్త. ఎందుకి పరిస్థితి ఎలా తీవ్ర రూపం దాలుస్తుందో."

"మళ్ళీ మీరెక్కడికి బయలుదేరారు?"

"అక్కడి ఆ షెడ్డులోకి"

"కూలీలున్నారుగా అక్కడెందుకు?"

"వున్నారులే వాళ్ళతోపాటు నేను"

"రాత్రికి భోజనానికి రండి"

"వీలుగా వుంటే వస్తాను. రాకపోతే నాకోసం ఎదురుచూడకు పెందలాడే భోజనాలుచేసి తలుపులువేసుకుని జాగ్రత్తగా పడుకో బతికి బాగుంటే తెల్లవారి కనిపిస్తాను"

"ఛ అవేం మాటలు?" అంది మంజీర కోపంగా.

"పరిస్థితులు అలా మారుతున్నాయి మంజీరా" అంటూ అటూ ఇటూ చూసి మంజీర చెయ్యి అందుకుని ముద్దుపెట్టుకుని చరచరా వెళ్ళిపోయాడు.

మంజీర అలాగే పిచ్చిదానిలా అయి చూస్తూండిపోయింది. ఆ రాత్రికి ప్రళయం రానేవచ్చింది ఆ తుఫాను దాటికి ఆగలేక చెట్లు విరిగిపోతున్నాయి. ఇళ్లు కూలిపోతున్నాయి పెనుగాలులు. ఎక్కడ చూసినా అంధకారం-అందర్నీ కబళించడానికి వచ్చిన రాక్షసి కపాలహస్తంలా ప్రచండ వేగంతో వూళ్ళని-పూళ్ళని ముంచివేస్తున్నాయి శరచ్చంద్ర ఏమయ్యాడో అంతూపంతూ లేదు. గొడ్లకువేసిన పాక, దొడ్లోని కొబ్బరిచెట్లు అన్నీ పడిపోవడం వింటూనేవుంది. ఒళ్ళంతా భయంతో కంపించిపోతోంది. ఆ మామిడిచెట్లకోసం శరచ్చంద్ర బలిఅయిపోతాడా! ఎక్కడున్నాడు? ఎలా వున్నాడు ఆ కూలీజనం మధ్య. అంతా సరిగ్గావున్నారా! ఆ షెడ్డు కూలి అంతా సర్వనాశనం అయ్యారా. అందరూ ముడుచుకుని కూర్చున్నారేగాని ఎవరి నోటవెంటా మాటరావడంలేదు ఆ కారు చీకట్లో ఆ చీకటిలానే హృదయాన్నీ ఆవరించుకున్న తిమిరచ్ఛాయలతో-బయట ప్రకృతి ఎలా విలయతాండవ మాడుతోందో ఆమె హృదయంలోనూ ఆవేదన అలాగే తాండవ నృత్యం చేస్తోంది.

"నటరాజా! నువ్వు కోపగించి ప్రళయతాండవం ఆడుతున్నావా? నన్ను, నా జీవితాన్ని ఉద్ధరించాలనుకుంటే ఈ ఉగ్రతాండవం ఆపు. మమ్మల్ని కాపాడు" అంటుంటూ కన్నీళ్ళు ప్రక్షిస్తుంటే చేతులు జోడించింది మంజీర.

"శ్రీరామచంద్రా! ఎక్కడున్నా? నీకు నమ్మినబంటు అంజనేయునివంటి స్వామిభక్తి పరాయణుడు మామయ్యకి శరచ్చంద్ర. అతన్ని ఏ ప్రమాదమూ ముట్టుకుండకుండా కాపాడు త్వరగా తెల్లవారి అతను నా కంటికి కనిపించేలా చెయ్యి" అనుకుంది, ఆవేదనా జ్వాలలమధ్య రగిలిపోతూ.

ఇంతలో ధన్‌మన్న చప్పుడు, కెవ్వుమన్న ఆర్తనాదాలు. మంజీర ప్రాణాలు ఎగిరిపోయాయి తమపక్క పెంకుటిల్లు పడిపోయినట్లుంది. అందులో పాపం పిల్లాజెల్లా అంతా వున్నారాయనకి! తలుపుతీసి ఒక్కసారి బయటకి చూద్దామని విశ్వప్రయత్నంచేసి మెల్లగా ఒక తలుపు తీసింది. లాంతర్లు పుచ్చుకుని పరుగులు తీస్తున్నారు. ఆ గాలికి ఆ లాంతర్లు నిలవకపోవడంతో కేవలం ఆకారాలే తప్ప ఎవరయిందీ తెలియడంలేదు. మెల్లగా ధైర్యంచేసి బయట తలుపుతీసి వరండాలోకి వచ్చింది మనిషిని పడేస్తోంది గాలి వర్షం ఎడాపెడా ముఖానకొట్టి క్షణంలో తడిపేసింది ఆమెని.

"తలుపు తెరుస్తావేమ్మాయి! గడియవెయ్యి," అంటూ లోపల్నించి చిదంబరం బిలబిలు "సూర్యభగవానుడా! ఇంక ఈ రాత్రి గడిచి నీ దర్శనం కలుగు




తుందా లేదా?" అనుకుంటూ వెనకడుగు వేసిందో లేదో దిక్కుతోచక తాడు తెంపుకున్న పోట్లగిత్త, పడిపోయిన కాంపౌండుగేటు లేకపోవడంతో, సరాసరి వరండాలోకి వచ్చేయడము, ఎదురుగా వున్న మంజీరని నెట్టివేయడం. కెవ్వున అరుస్తూ మంజీర వరండాలోకి దొర్లి క్రిందపడిపోవడమూ క్షణంలో జరిగి పోయాయి మంజీర కథంవిని ఆదరాబాదరా గుమ్మం దగ్గరకి పరుగెత్తుకుంటూ కమలమ్మ, ఆ వెనక చిదంబరం అంతా వచ్చేశారు.

ఆ పోట్లగిత్త దారితెన్నూ కానక ఎటుపోయిందీ ఎవరూ గుర్తించలేదు. మంజీర తెలివితప్పి పడిపోయింది. ఆమెకి స్పృహవచ్చేసరికి తెల్లగా తెల్లవారింది. ప్రకృతి ప్రళయనాట్యం ఆపి ప్రశాంతంగా వుంది. ఆమె ఎదురుగా ఆదుర్దానిండిన చూపులతో ఆమెకేసి చూస్తున్న శరచ్చంద్ర కనిపించేసరికి ఆమె కళ్ళల్లో కోటి వెన్నెలకాంతి ప్రతిఫలించింది.

"ఎలా వున్నావు?" అని అడిగాడు ఆప్యాయంగా చూస్తూ

"బాగానే వున్నాను" అంది చెయ్యికి కట్టిన కట్టు చూసుకుంటూ.

ఆమెకి లోకం ఏమయిందో, ఎలా వున్నదో అన్న విషయం పట్టలేదు, ఎదురుగా శరచ్చంద్ర కనిపించేసరికి.

## 15

మామిడితోటలో చెట్లు సగంపైగా విరిగి నేలవాలినాయి. శరచ్చంద్ర పెద్దు

ఓ భాగం అంతా పడిపోయింది. మామిడితోటకి మధ్యవున్న కాలువ కనిపించకుండా ఆ రెంటినీ కలిపేస్తూ పెద్ద నదిలా తయారైంది వర్షపునీరు.

ఊరు పూర్తిగా మట్టికొట్టుకుపోయింది కూలీల ఇళ్ళన్నీ పూర్తిగా కొట్టుకుపోయాయి. పెంకుటిళ్ళ క్రింద తప్పుకోలేక పడిపోయిన పిల్లలు- పెద్దలు- పశువులు- అన్నింటినీ చూడలేక కళ్ళుమూసుకున్నాడు శరచ్చంద్ర స్వచ్ఛంద సేవాసంస్థలు, గవర్నమెంటు వాన్‌లు తుఫాను దెబ్బతిన్న ప్రాంతాలకి తరలి వెడుతున్నాయి.

పచ్చని చేలతో- సన్నని పిల్లకాలువలతో- ప్రకృతి రమణీయకతను వెలార్చుతున్న ఆ గ్రామం- పీనుగల కుప్పగా తయారైంది. చూద్దామన్నా ఎవరి పొలాలా లేవు. ఎవరి పంటలూ లేవు తల్లి తండ్రుల్ని కోల్పోయిన పిల్లలు- పిల్లల్ని కోల్పోయిన తల్లులు అంగవైకల్యంతో కుమిలే కొందరు- ఇళ్ళుపోయి ఆస్తిపోయి- వుండటానికి కిల్లులేక- తినటానికి గింజలులేక అల్లాడుతున్న ఆ గ్రామవాసుల్ని- పోయినవారు పోగా, జీవచ్ఛవాల్లా మిగిలిన ఆ కొందర్ని నిశ్చలంగా చూస్తున్నాడు ఆ వూరి భగవంతుడైన శ్రీరామచంద్రుడు.

మెల్లగా లేచిన మంజీరకి బయటనించి ఖిన్నవదనంతో లోపలకి వస్తున్న శరచ్చంద్ర కనిపించాడు.

"ఏమండీ! ఇలావున్నారేం?" అని అడిగింది.

"ఏముంది మంజీరా! ఆస్తులు పోయి- ప్రాణాలు పోయి వూరంతా ఎంత భీభత్సంగా వుందో చూస్తుంటే నాకు దుఃఖం ఆగడంలేదు. అక్కడ నాన్నగారెలావున్నారో! వెళ్ళాలన్నా బస్‌లు లేవు. దారి బాగుచేయాలి. కృష్ణా గోదావరి జిల్లాలకి పట్టిన ఈ దుర్భరశోకం చల్లారేదెప్పటికి?" అంటూ దిగులుగా తల పట్టుకున్నాడు శరచ్చంద్ర.

"ఇంతకీ మీరు ఎప్పుడు వచ్చారు? నాకు దెబ్బతగిలిందని తెలిసిందా" తనలో వేధిస్తున్న సందేహాన్ని బయటపెట్టింది మంజీర.

"నీకు దెబ్బతగిలిన అయిదునిమిషాలకి నేను వచ్చాను రాత్రే! అప్పటికి వాన ఉధృతం తగ్గింది. అక్కడ మామిడి చెట్లు పడిపోయాయి. షెడ్డు సగం పడిపోయింది నీళ్ళు తోటంతా నిలిచిపోయాయి. ఇక్కడ ఎలావున్నారో నన్న బెంగతో వర్షం కాస్త తగ్గగానే ఆ నీళ్ళల్లో పడివచ్చాను. రావడంలో వడ్డాను. ఇదుగో దెబ్బ" అంటూ పాంటు పైకితీసి చూపించాడు. ఇక్కడికి వచ్చేసరికి మీ వాళ్ళంతా కంగారుపడిపోతున్నారు. నిన్ను నేనే ఎత్తుకుని

మంచంమీద పడుకోబెట్టి ఆ కట్టు కట్టాను ఇంట్లో టించరు వేసి" అంటూ అగి ఆమె ముఖంలోకి చూశాడు.

"నేను కూడా ఈ వూరంతా చూస్తాను ఒక్కసారి"

"ఏముంది మంజీరా చూడటానికి? మీ ఇల్లు తప్ప బాగున్నవేంలేవు! మీ యిల్లు కూడా అటుప్రక్క పడిపోయింది. చాలాలేవీ గుర్తులేకుండా పోయాయి." అంటూంటే పైకే ఏడ్చింది మంజీర,

"నేను ఎలాగైనా విజయవాడ వెళ్ళాలి మంజీరా! మా యిల్లు, మా నాన్న ఎలావున్నారో చూసిరావాలి."

మంజీర ముఖం మాడిపోయింది. "నాన్నగారిని చూస్తారా! ప్రమీలని చూస్తారా"

ఆ మాటకి సూటిగా ఆమెకేసి చూసి ఆ తర్వాత ఎందుకో నవ్వాడు.

"దేనికి నవ్వుతారు!" ఉక్రోషంగా అడిగింది మంజీర.

"నీ మాటలకి నవ్వక ఏం చేయను! ప్రమీలంటే నీకు దేనికి కోపం!"

ఆ మాటకి చురుగ్గా చూసింది మంజీర.

"ఆమె నా హృదయాన్ని వెయ్యి వక్కలు చేసింది కనక!"

"ఆమె నీతో ఏనాడన్నా మాట్లాడిందా? నీ యింటికి వచ్చిందా? నీ హృదయం ఆమెందుకు వక్కలు చేసిందో చెప్పు".

"ఆవిడగారు మా యింటికి రావక్కర్లేదు. నాతో మాట్లాడక్కర్లేదు. దూరందూరంగా వుండే నా ప్రేమ భగ్నంచేసింది. అదిచాలదా జీవితాంతం నేను కుమిలిపోవడానికి?"

"పొరపాటు మంజీరా! నీ ప్రేమని ఆమె ఏనాడు భగ్నంచేయలేదు. కేవలం అది నీ భ్రమ"

"భ్రమకాదు. పచ్చినిజం. అటు మనసు చంపుకోలేక ఇటు ముందుకుపోయే దారిలేక అలమటిస్తున్నది నేనే."

"మనసు చంపుకోవటం దేనికి మంజీరా. నీ ప్రేమ ఫలవంతం చేసుకోవచ్చుగదా!"

"ఫలవంతంకావడానికి నేను ప్రేమించిన వ్యక్తికి నాపై అంత మమత వుండాలిగా"

"వుందో లేదో నీకేం తెలుసు?"

"లేదా నామీద మమకారమే వుంటే అంగుళం కదిలేవారు కాదు. ప్రమీల
'నం అంత తపనపడరు."

"ప్రమీలని గురించి ఇన్ని అంటున్నావు." అతనింకేదో అనేలోగా అందు
ంది మంజీర.

"నాకు తెలుసు. మీరు ఎప్పుడూ ఆవిడిగారిని వెనకేసుకువస్తారు." అంది
'పంతో బుసలుకొడుతూ.

"ఆమె దారి ఆమెది. నా దారి నాది. ఆమెని వెనకేసుకురావలసిన అవసరం
దు."

"ఎందుకు లేదు. ఆవిడంటే మీకు తగని ప్రేమ."

ఆ మాటకి ఫక్కున నవ్వాడు శరచ్చంద్ర.

"నీకు మాత్రం లేదా రామప్రసాద్ అంటే. అతనితో తిరగడం లేదూ,
తనింటికి వెళ్ళి కూర్చోవడంలేదూ." సూటిగా అడిగాడు శరత్.

ఆ మాటకి చర్రున లేచింది మంజీర.

"అర్థంలేని మాటలు మాట్లాడకండి. అతనితో మాట్లాడినంత మాత్రాన
అతన్ని ప్రేమించేస్తానా, పెళ్ళాడేస్తానా?" రోషం బుసలుకొట్టింది మంజీరలో.

"ఏమో మంజీరా ఆడవాళ్ళ హృదయం అర్థంచేసుకునే కంటే సముద్రంలోతు
ంతో తేలిగ్గా గుర్తించవచ్చు" బాధ ధ్వనించిందాతనిస్వరంలో.

"మీరు నన్నేదో అనాలని అంటున్నారు". కోపం క్రమక్రమంగా కరిగి
కన్నీళ్ళు తిరిగాయి. అవి చెంపల మీదుగా జారిపోతుంటే చూసిన శరచ్చంద్ర
షాక్ తిన్నట్లయ్యాడు

"మంజీరా ఏడుస్తున్నావా?" అని అడిగాడు తడబడుతూ.

"నాకు చివరకి అన్ని విధాలా మిగిలింది ఇది ఒక్కటే." అంటూ దిగ్గున
లేచి తల్లిదగ్గరకి వెళ్ళిపోయింది.

శరచ్చంద్ర రెండు నిముషాలలాగే చూసి అక్కడే వున్న ఓ చిన్నకాగితం
ముక్క అందుకుని "మంజీరా నేను బెజవాడ వెడుతున్నాను. రేపు ఈ
పాటికి యిక్కడ వుంటాను." శరచ్చంద్ర- అని రాసి గబగబా వెళ్ళిపోయాడు.

అతను ఇంటికి వచ్చేసరికి జనమేజయరావు కొడుకుకోసం తువ్వాలు
అడ్డంపెట్టుకుని కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నాడు. కొడుకుని చూడగానే ఆయన
పంచప్రాణాలూ లేచి వచ్చాయి

"క్షేమంగా వున్నావురా" అంటూ కొడుకుని కావలించుకుని భోరున ఏడ్చాడు.




"క్షేమంగానే వున్నాను నాన్నా! నిన్ననే వద్దామంటే బస్‌లు లేవుగా! ఈ రోజనా లేవనుకో. కొంతదూరం నడిచి– గూడురిక్షామీద– ఎలాగో చచ్చిచెడి వచ్చాను."

"అక్కడెలావుంది?"

"అక్కడంతా సర్వనాశనం అయింది నాన్నా! మళ్ళీ నేను వెళ్ళాలి," అంటూనే కాసేపక్కడ అన్నీ పరిశీలించి, ప్రమీల ఇంటికి వెళ్ళాడు. వాళ్ళిల్లు బాగానేవుంది, తుఫాను తాకిడికి తట్టుకుని.

"శరత్! పదిరోజుల్లో నా వివాహం. రిజిస్టర్ మారేజ్ అనుకో. అయినా నువ్వు రా! ఇన్విటేషను పంపిస్తాను," అంది ప్రమీల.

"కంగ్రాట్యులేషన్స్ ప్రమీలా!" అంటూ వరుని గురించిన వివరా లడిగాడు. అన్నీ చెప్పింది ప్రమీల

"శుభం ప్రమీలా! అన్ని విధాల అతను నాకంటే అధికుడు. నీ జీవితం సుఖప్రదం కావాలని ఆశిస్తున్నాను" అన్నాడు శరచ్చంద్ర.

"థాంక్స్ శరత్!" అని వూరుకుంది ప్రమీల.

ఇతన్ని తను ప్రేమించిన మాట వాస్తవమే అయినా అతనూ ఒకప్పుడు తనంటే వూగినా రానురానూ అతనిలో మార్పు బాగా కనిపించింది తనని పెళ్ళాడే ఉద్దేశం అతనికి కనిపించలేదు. తను చాలా విధాల నచ్చజెప్పింది. అతను

విముఖత్వమే చూపించాడు. రానురాను అతని హృదయం మంజీరపైపు మొగ్గుతోందని బాగా గుర్తించి తను దూరంగా తొలగిపోయింది. జీవితంతో రాజీపడకపోతే ఎలా కుదురుతుంది? ప్రేమనేది మనస్సుకు సంబంధించినది. ఆత్మపరమైంది. బాధ్యతలు, బరువులు అనేవి కుటుంబంతో, సంఘంతో ముడిపడివున్నాయి. అవి నెరవేర్చక తప్పదు— వీరందరి మధ్యా తన మనస్సు మరల్చుకోక తప్పదు. తన పెళ్ళితో తన చెల్లెళ్ళ పెళ్ళి ముడిపడివుంది. తన ఫలించని ప్రేమకోసం, ఒన్‌వే ట్రాఫిక్‌లాంటి ప్రేమకోసం వారందరి మనస్సులూ బాధించడం దేనికి. అందుకే తన ఇష్టపడిన కృష్ణమూర్తిని చేసుకోవడానికి సిద్ధపడింది.

"వస్తాను ప్రమీలా! ఏమాత్రం వీలుగావున్నా డేట్ చెప్పావుగా తప్పకుండా వస్తాను."

"నువ్వు మళ్ళీ అక్కడికే వెళుతున్నావా?"

"వెళ్ళాలిగా మరి! అక్కడ నానాభీభత్సంగాను వుంది పాపం అస్తినష్టం బాగానేవుంది" అన్నాడు దిగులుగా.

ప్రమీల సానుభూతి చూపించింది. శరచ్చంద్ర ఇంటికివస్తుంటే "అడ్రసియ్యి శరత్! కార్డు పంపిస్తాను" అంది ప్రమీల. కాగితం తీసుకుని రాసిచ్చాడు.

ఆ రోజు ఇంటిదగ్గరే వుండి మర్నాడు బయలుదేరాడు మంజీర దగ్గరికి.

అతను వెళ్ళేసరికి మంజీర ఏదో పుస్తకం చదువుకుంటోంది. శరచ్చంద్రని చూసి ఆమె మనస్సు కలువపువ్వులాగే వికసించింది.

"ఏం మంజీరా! ఎలావుంది ఒంట్లో. చెయ్యి నెప్పి తగ్గిందా?" అని అడిగాడక్కడేవున్న స్టూలుమీద కూర్చుంటూ.

"బాగానేవుంది లెండి. భోజనంచేస్తారా?" అని అడిగింది మంజీర. చేస్తాననట్లు తలవూపాడు. తనే స్వయంగా సిద్ధించింది.

"రాత్రిళ్ళు ఇక్కడే పడుకోండి. [illegible]మిడిగోంకి వద్దు."

"చిత్తం. మీరు యజమానురాలు. నేను సేవకుడిని. మీరు ఎప్పుడు ఎలా చెబితే అలా చేయవలసిన వాడినేకాని మీ ఆజ్ఞని వుల్లంఘించేవాడిని కాను" శరచ్చంద్ర మాటవింటూ కాస్త తీక్షణంగానే చూసింది మంజీర.

ఆ రాత్రికి అరుబయటే పడుకున్నారు. ఏ విశేషాలూ లేకుండా మరో రెండు రోజులు గడిచిపోయాయి. పొలంలో నిలిచిన నీరు కాస్త కాస్తే తగ్గుతోంది. కనబడక మునిగిన శవాలెన్నో బయటపడుతున్నాయి. వాటికి అంత్యక్రియలు, మిగిలిన వారందరికీ కలరా ఇంజక్షన్లు— ఇలా ఇటువంటి కార్యక్రమాలలోనే



వున్నాడు శరచ్చంద్ర. నారింజతోటకి మామిడితోటకి కలిగిన నష్టాలను చూసుకుంటూ పడిపోయిన కొమ్మలను బాగుచేసుకుంటూ అలసటగా ఇంటికి వచ్చేసరికి మంజీర గదిలోంచి మంజీరాల ధ్వని వినిపిస్తోంది. గది తలుపులు తీసే వున్నాయి. ఆమె ముఖంలో మునుపెన్నడూ కనిపించని ఏదో ఆనందం కనిపిస్తుంటే ఆశ్చర్యంగా నిలబడి చూడసాగాడు.

నిజంగా మంజీర దగ్గర మంచి ఆర్టు వుంది. ప్రతిభ వుంది. రూపంలో సమ్మోహనాస్త్రం వుంది. అందుకే ఆమెని చూస్తుంటే మతిపోతూ వుంటుంది తనకి. అనుకుంటూ గుమ్మందగ్గరే నిలబడిపోయాడు. మంజీర నాట్యం ఆపి శరచ్చంద్రని చూసి తటాలున యివతలకి వచ్చింది.

"ఎంతసేపయింది వచ్చి." అని అడిగింది.

"ఇప్పుడేలే!" అంటూ ఆమెనే పరిశీలనగా చూడసాగాడు.

అతని చూపులధాటికి తట్టుకోలేనట్లు తలవంచుకుంది మంజీర. ఇంతలో గుడికి వెళ్ళిన కమలమ్మ తిరిగివచ్చి అతనితో లోకాభిరామాయణంలో పడి పోయింది.

"మీకి శుభలేఖ వచ్చింది." అంటూ అందించింది. అది ప్రమీల పెళ్ళి శుభ లేఖ. చదివి టేబుల్‌మీద పెట్టాడు.

మామిడితోటలో ఆ చెట్లమధ్య మడతమంచం- పక్క- వేయించుకునే వచ్చాడు. భోజనంచేసి గబగబా వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోతుంటే బేలగా చూసింది మంజీర.

చిదంబరం ఇల్లు పడిపోవడంతో- అచ్యుతరామయ్య ఇంట్లోనే వెనకవైపు గదిలో వండుకుంటూ అక్కడే వుంటున్నారు. పగలంతా అక్కడ ఇల్లు బాగుచేసుకోవడంలో సరిపోతోంది మగవాళ్ళకి.

శరచ్చంద్ర అక్కడే ముఖం కడుక్కుని అక్కడే పగలంతా పనిచూసు కుంటాడు. రామయ్య ఉదయం ఫ్లాస్కునిండా కాఫీపోసి తెస్తాడు. మధ్యాహ్నం క్యారియర్ తెస్తాడు. ఒక్క రాత్రికే ఇంటికి వస్తుంటాడు శరత్.

తెల్లగా తెల్లవారి దంతధావనం- స్నానం వగైరాలు కావిచ్చి కాఫీకోసం చూస్తున్నాడు ఎఱ్ఱని వెంకటగిరి జరీచీర, తెల్లని జాకెట్‌లో అరవిరిసిన ఎఱ్ఱ మందారంలా కాఫీఫ్లాస్కుతో ప్రత్యక్షమయిన మంజీరని చూసి విస్మయ విభ్రాం తిలో మునిగిపోయాడు శరచ్చంద్ర

"ఇదిగో కాఫీ సేవించండి." అంటూ గ్లాసులోపోసి అందించింది.

"ఈ రోజు నేను లేచినవేళ చాలా మంచిదయింది. స్వయంగా అందిస్తున్నా రీ సేవకుడికి రాణీగారు." అంటూ అందుకున్నాడు.

"మీకు వ్యంగ్యంగానూ వెక్కిరింతగానూ తప్పితే సరిగ్గా మాడటం రాదా! లేక ఈ జన్మలో నాపట్ల ప్రేమ కలుగదా!" అంది చిన్నబుచ్చుకుంటూ.

ఆ మాట వింటూ సంభ్రమంగా చూశాడు శరచ్చంద్ర అతని పెదవుల మీద చిరునవ్వు చిందులాడింది కళ్ళల్లో కార్తీకపున్నమి వెన్నెల ప్రతిఫలించింది.

"మంజీరా! నీమీద ఎంత ప్రేమ. అనురాగం లేకపోతే వెళ్ళిపోయిన నేను తిరిగివచ్చానో గ్రహించగలవా!" అన్నాడు చటుక్కున ఆమె భుజంమీద చెయ్యివేసి దగ్గరగా లాక్కున్నాడు.




ఆ మాట వింటూనే మంజీర బుగ్గలు ఎఱ్ఱబడ్డాయి. తటాలున అతని గుండెపై తలవాల్చి అతన్ని తీగలా పెనవేసుకుంది. అలా అల్లుకున్న ఆమెని దగ్గరగా మరింత గట్టిగా గుండెలకి హత్తుకుని ముద్దులవర్షం కురిపించాడు. దూరంగా రామాలయంలో గంట గణగణా మ్రోగినట్లనిపించింది.

"మంజీరా! ఈ ప్రకృతి సాక్షిగా ఈనాడు తెలుసుకున్న మన హృదయాలు సాక్షిగా మనిద్దరమూ ఇంక ఒకటే! రాణీగారు యస్ అంటే వెంటనే ముహూర్తాలు పెట్టిస్తాను."

"మీ యిష్టం. మీరెంత త్వరపడితే అంత మంచిది" అంది మంజీర.

"ఆ మాట తమరంటే రేపే పెట్టిస్తాను."

అన్నట్లుగానే పెట్టించాడు ముహూర్తం. మంజీర - శరచ్చంద్రలు పెళ్ళి చేసుకుంటున్నారని తెలిసిన చిదంబరం పెనంమీద అట్టులాగే మాడిపోయాడు. ఒట్టి దరిద్రగొట్టు వెధవని కొడుకుని తిట్టిపోశాడు. ఎవరేం అనుకున్నా మంజీరా, శరచ్చంద్రల పెళ్ళిమాత్రం నిర్విఘ్నంగా జరిగిపోయింది.

మహారాష్ట్రలో పుట్టిన మంజీరానది గోదావరికి ఉపనదిగా మారి అనేకమందికి జీవనాధారమై సాగర సంగమంపొంది ధన్య అయినట్టే ఎక్కడో మంజీరాల మధురరవళితో నాట్యమయూరిగా కీర్తిపతాకం ఎగరవేస్తుందనుకున్న మంజీరాదేవి పట్నంవదిలి పల్లెలో, పంటపొలాలమధ్య శరచ్చంద్రునికి ఇల్లాలై పక్కా గృహిణిగా మారి ఆ పల్లెసీమ బాగుకీ, ప్రజాభ్యుదయానికీ తనవిద్యని, విజ్ఞానాన్ని వెదజల్లి తన పేరును సార్థకం చేసుకుంది. ఆ పల్లెను బాగుచేస్తూ తన జన్మ పునీతం చేసుకుంది.




గోపాలం ఆ ఇంట్లోకి వచ్చి నెల దాటుతూంది. అతనికి ఈమధ్య ఓ ఆఫీసులో మంచి ఉద్యోగం దొరికింది ముందూ వెనకా ఎవరూ లేకపోవడం చేత ఎక్కడైతేనేంలే అని ఉద్యోగం దొరగ్గానే ఈ వూరు వచ్చేశాడు. ఆ రోజు ఆదివారం తన గదిలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు. గదిబయట అతనికి సుతిమెత్తని అడుగుల చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు వినిపించగానే అతను ఎలర్ట్ అయిపోయాడు. తలుపు తోసుకుని అందమైన ఒక అమ్మాయి అతని గదిలోకి వచ్చింది. "రండి శ్యామలా!" అని అతను ఆహ్వానించాడు. ఆమె లోపలికి వస్తూనే "ఈ వేళ పేపరిస్తారా?" అంది "దానికేం తొందర? కబుర్లేమయినా చెప్పండి" అన్నాడతను "తర్వాత మాట్లాడుకుందాం. నాన్నగారికి భోజనం పెట్టాలి" అని ఆమె పేపరందుకుని వెళ్లిపోయింది. ఆమె తండ్రి వాచీలు రిపేర్ చేస్తాడు. మెయిన్ రోడ్‌లో అతనికో షాపుంది ఈమె డిగ్రీ చదువుతూంది. గోపాలం గది ఎదురువాటాలో ఉంటున్నారు వాళ్లు. ఆ అమ్మాయి

చూడగానే మొదట్లో గోపాలం చకితుడై పోయాడు ఆమెలో సౌందర్యంకాక అంతకు మించిన మరేదో వున్నట్లని పించింది. చాలా లోతుగానూ నెమ్మది గానూ మాట్లాతుంది.

ఆమెతో అతనికి పరిచయం ఇలా అయ్యింది. నెలరోజుల కింద తనగదిలో దిగాక సామాన్లన్నీ సర్దుకుంటూ ఉండగా ఎవరో వెనకనించి "నేను లోపలికి రావచ్చా?" అని అడిగారు గోపాలం వెనక్కి చూసేసరికి ఈ అమ్మాయి నిలబడి వుంది. అతనాశ్చర్యంగా చూస్తూ "రండి" అన్నాడు ఆమె లోపలికి వచ్చి సామా న్లన్నీ చూస్తూ "ఇంకా సర్దడం పూర్తి కాలేదా!" అని అడిగి, "మేం ఈ కాంపౌండులోనే వుంటున్నాం. నా పేరు శ్యామల. మా నాన్న వాచీలు రిపేరు చేస్తాడు. మా ఇంట్లో ఇంకెవరూ లేరు" అంది. గోపాలం కూడా తన పేరూ, ఉద్యోగం చెప్పకున్నాడు. ఆమె అతని పుస్తకాలన్నీ తిరగేసింది. దాస్తోవిస్కీ "క్రైమ్ అండ్ పనిష్మెంట్" తీసుకుని "దీన్ని చదివి యిస్తాను" అంది. "అలాగే ఇవ్వండి" అన్నాడు గోపాలం ఆమెని చూస్తుంటే అతనికి ఒక్కో క్షణం ఒక్కో వాట్ పెరిగిపోతున్న బల్బులా కనిపిస్తోంది. ఆమె వెళ్ళి పోయింది. ఐనాగూడా అతి మార్దవ మైన ఆ గొంతుక ఇంకా గదిలో మోగుతూ వున్నట్టే వుంది. అకస్మా త్తుగా చల్లని గాలులు వీచే తోటలో అతన్ని విసిరేసినట్టు ఫీలయ్యాడు. ఆ నాటినుంచి శ్యామలను గూర్చి ఆలోచిం చడం అతనికో ముఖ్య వ్యాపకమై పోయింది. ఆమెని తాను ప్రేమిస్తున్నా నని నిశ్చయం చేసుకున్నాక ఆమెతో మాట్లాడదామని అనుకున్నాడు కానీ ఎప్పుడూ ఏదో అంతరాయం కలిగేది. ఒక్కోసారి అది సమయం కాదనిపించేది. రోజూ ఆమె అతని గదికి వచ్చి దిన పత్రిక తీసుకుపోతుంది అయితే అప్పుడు ఒక్క నిమిషంగూడా వుండదు. ఆమెకి ఎక్కువగా మాట్లాడే అలవాటు లేదు ఉత్తరం రాసి ఇవ్వడం తప్ప మార్గం లేదని నిశ్చయించుకున్నాడు. అయితే ఆ ఉత్తరం ఎక్కడ ఇవ్వా లనేదిగూడా సమస్యే అయింది. ప్రేమ అంటే ఇన్ని చిక్కులుంటాయని అంతకు ముందు అతనికి తెలీదు.

శ్యామల తండ్రి రాఘవరావు, గోపాలం కలిసి అప్పుడప్పుడూ చెస్ ఆడుతుంటారు. అందువల్ల వాళ్ళిద్దరికీ కొంచెం దోస్తీ వుంది. ఆయనతో మాట్లాడితే సరిపోతుం దనుకున్నాడు. కానీ ఆమె ఇష్టం ఏమిటో తెలవాలిగా మరి?

చివరికి ఓనాడు గోపాలం మంచి మంచి పదాలన్నీ ఏరి తన హృదయం అంతా ఆమెకి అర్థంఅయేలా ఎనిమిది పేజీల వుత్తరం రాశాడు. రాసింతర్వాత

చూసుతుంటే అది పరిపోదనిపించింది. కరెక్షన్లు చేస్తే అది కాస్తా పదకొండు పేజీలయింది. మర్నాడు పొద్దున్నే దిన పత్రికలో పెట్టి ఆమె కివ్వాలనుకున్నాడు. ఎప్పుడు తెల్లవారుతుందా అని చూస్తూ కూచున్నాడు. ఆమె రానూ వచ్చింది పోనూ పోయింది పుత్తరం మాత్రం అతని చేతిలోనే వుండిపోయింది. గోపాలానికి ధైర్యం చాలలేదు ఆమె వెళ్లి పోయిన తర్వాత "ఎంత బుద్ధితక్కువ వాణ్ణి" అని విచారి చాడు.

ఇంతలో ఒక ఆదివారం వచ్చింది. మధ్యాహ్నం పన్నెండు గంటలవుతుం డగా గోపాలం శ్యామల వాటాలోకి వెళ్ళాడు. ముందుగదిలో రాఘవరావు ఏదో వార్తని పట్టుదలగా చదువు తున్నాడు పేపర్లో. గోపాలాన్ని చూడ గానే "రండి, రండి" అని ఆహ్వానిం చాడు. "మీ కోసమే చూస్తున్నాను ఇంక ఆడదామా!" అని చెస్‌బోర్డ్ తీసి టీపాయ్ మీద పరచి పావులు సరి చేశాడు. గోపాలం ఆ మాటా ఈ మాటా మాట్లా డుతూ ఒకసారి పావుల్నికదిపి "శ్యామల లేదా!" అనడిగాడు. "లోపల వుంది" అన్నాడు రాఘవరావు ఆ మాటలకి శ్యామల లోపల్నించి ఓసారి తొంగి చూసింది. గోపాలం రాఘవరావు గమ నించకుండా లోపలి గుమ్మంలోకి చూస్తూ పరధ్యానంగా ఆట ఆడుతున్నాడు రెండు క్షణాల్లో గోపాలం ఆట కట్టయింది. "ఇంత డల్‌గా వున్నారేం ఇవాళ!" రాఘవరావు అడిగాడు. "అబ్బే అలాంటి దేంలేదు మరో ఆట వేద్దాం" అని మళ్లీ సర్దాడు పావుల్ని గోపాలం ఈ లోగా శ్యామల రెండు మూడు సార్లు గుమ్మం లోంచి చూసి చిర్నవ్వులు నవ్వింది గోపాలం అన్యమనస్కంగా ఆట మొద లెట్టాడు మళ్లీ అతని ఆట కాసేపట్లోనే కట్టయింది

"ఏమిటయ్యా! ఇలా వున్నావ్ ఇవాళ, కొంపదీసి ఎవరితోనన్నా ప్రేమలో పడ్డావా!" రాఘవరావు ఫెళ్లున నవ్వాడు. గోపాలం తత్తరపడ్డాడు. అతని చేయి అప్రయత్నంగా జేబులో పుత్తరాన్ని తడిమింది శ్యామల లోపలనించి కాఫీ తెచ్చిఇస్తూ "ఎవరు ఎవర్ని ప్రేమించారు నాన్నా!" అంది. ఆమె శరీరంలో సౌందర్యమే కాకుండా ఏదో సుగంధం గూడా వున్నట్టు తోచింది గోపాలానికి. "అబ్బే ఆయనేదో వూరికే అన్నారు లెండి" అని మాట తప్పించాడు. శ్యామల అక్కడే ఓ కుర్చీలో కూచుంది. గోపాలానికి గుండె దడగావుంది. కాఫీ తాగుతూ ఆ ఆట పూర్తిచేసి "ఇక చాలండీ! నేను ఆడలేను" అని అన్నాడు. రాఘవరావు కాఫీగ్లాసు కిందపెడుతూ "ఇవాళ మీరు బాగున్నట్టు లేదు" అన్నాడు. శ్యామల ఎందుకో నవ్వింది. "అట్లా ఎందుకున్నారు!" అంది. "రాత్రంతా చదువుతూ కూచున్నానుగా




"కాస్త అలసటగా వుంది" అన్నాడు గోపాలం. రాఘవరావు ఎందుకో లేచి లోపలికి వెళ్ళాడు. గోపాలం చటుక్కున జేబులో వుత్తరం తీసి శ్యామల చేతిలో పెట్టి "చదువుకోండి" అని గబగబా వచ్చేశాడు. శ్యామల ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది. గదిలో కొచ్చాక కూడా గోపాలం గుండె గుబగుబలాడుతూనే వుంది. ఆ వుత్తరం చదువుకుని ఆమె ఏమంటుందో! ఒకవేళ కోపం వస్తే వచ్చి తిట్టదుగదా! గబగబా బట్టలేసుకుని రోడ్డుమీద పడ్డాడు. రాత్రి రెండో సినిమాగూడా చూసి గదిలోకొచ్చి పడుకున్నాడు. ఆ రాత్రంతా తనికి నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా? ఆమె పేపరుకోసం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూశాడు.

చివరికి తెల్లవారింది. ఆమె మామూలుగా వచ్చి పేపరు తీసుకుని వెళుతూ అడిగింది. "రాత్రి అంత పొద్దు పోయేదాకా ఎక్కడికెళ్ళారు?" అని అడిగింది.

"ఎవరో ఫ్రెండు సినిమాకి పిలిస్తే వెళ్ళాను" అన్నాడు.

ఆమె మామూలుగా వుంది "వుత్తరం చదివారా?" అనడుగుదా మనుకున్నాడు. కానీ ధైర్యం చాలలేదు. ఈలోగా ఆమె వెళ్ళిపోయింది.

గోపాలం నిరుత్సాహ పడిపోయాడు. ఐనా ఆమె ఆవిషయం ఆలోచిస్తుందేమో! ఇప్పుడే ఎలా చెబుతుంది? అని సరిపెట్టుకున్నాడు. అలా ఒకటి రెండు కాదు ఆరు రోజులు గడిచాయి. గడుస్తున్నకొద్దీ అసలామె ఆ వుత్తరం

చదివిందా? అని అనుమానం వస్తోంది గోపాలానికి.

ఆ వారం పొద్దున్నే ఆమె ప్త్రిక కోసం వచ్చింది. ఆమె వచ్చేటప్పటికి గోపాలం పేపరు చదువుతూ కూచున్నాడు "కొంచెం వుండండి. ఈ కాస్త చదివేసి ఇస్తాను" అన్నాడు. ఆమెని కాసేపు ఆపి మాట్లాడించాలని వుద్దేశం. ఆమె కూచుంది క్షణం తర్వాత "మీరు ఏమీ చెప్పనే లేదు" అన్నాడు గోపాలం "ఏమిటి?" అంది శ్యామల "మొన్న నేనిచ్చిన వుత్తరం గూర్చి" అన్నాడు గుండెలు కూడదీసుకుంటూ. ఆమె సీరియస్‌గా గోపాలాన్ని చూసి "తొందరేం?" అని పేపరు లాక్కుని వెళ్ళిపోయింది గోపాలానికి విషయం అవగాహన కాలేదు ఆమె తప్పకుండా తనకు కావాలి ఆమె లేకపోతే జీవితం ఎలా వుంటుందో అతనికి ఊహగ్గూడా అందడం లేదు.

మధ్యాహ్నం అన్యమనస్కంగా అతను తన గదిలో పడుకుని వున్నాడు. ఆవేళ ఆఫీసుకి సెలవు పెట్టి పొద్దుణ్ణుంచీ గదిలోనే వున్నాడతను. శ్యామల వచ్చింది ఆమె వచ్చిన అలికిడికి అతను తలెత్తి చూశాడు ఆమె అప్పుడే స్నానం చేసి జుత్తు ఆరబెట్టుకుంటూ వచ్చింది. అప్పుడే విరబూసిన గులాబీల గుత్తిలా వుందామె. "నేను సాయంత్రం సినిమా కెళుతున్నాను" అంది జుత్తుని వెనక్కి తోసుకుంటూ. గోపాలం గుండె పైకి ఎగదన్నినట్టయింది. కంగారుగా లేచి కూచున్నాడు. "ఏమిటి?" అన్నాడు. ఆమె మళ్ళీ చెప్పింది "మీరు రావచ్చు" అని అతనడిగాడు "ఎలాగూ వాళ్ళనేగా చెబుతున్నాను" అని ఆమె ఎలా వచ్చిందో అలా వెళ్ళిపోయింది. అతిస్మాతుగా లైటు వేసి తీసేసినట్టయింది గోపాలానికి. తనని సినిమాకి ఆహ్వానించిందంటే మరింక సుముఖంగానే వుందన్న మాట. ఆ ఆలోచన వచ్చేసరికి అతనికి ఏనుగెక్కినంత సంబరమైంది. గబాల్న లేచి అద్దంముందు కూచుని నీట్‌గా షేవ్ చేసుకున్నాడు. సాయంత్రందాకా కాలం గడవడం అతనికి కష్టమైంది. గదిలో పచార్లు చేశాడు అద్దంముందు కూచుని తనని తానే పరీక్షించుకున్నాడు. సిగరెట్లు ధాటిగా తగలేశాడు. 'ఓహో, ప్రేమ జయించింది. జయించదా మరి గొప్పదికదా ప్రేమంటే!' అని చాలా సార్లనుకున్నాడు. ఆమె వచ్చాక తన జీవితం ఎలా వుంటుందో వూహించు కుంటూ గడిపేశాడు. గంటలు, నిమిషాలు అన్నీ తనిమీద పగబట్టి ఆగిపోయినట్టు అతనికి తోచింది

సాయంత్రం ఆమె ముస్తాబై వచ్చింది. చిరునవ్వు నవ్వుతూ "పదండి" అంది. గది తాళంవేసి ఆమెతో నడుస్తుంటే గాల్లో తేలిపోతున్నట్టుగా వుంది ఆమె చక్కగా అలంకరించిన పూలకుండీలా

బాగా పూసిన మల్లెపందిరిలా వుంది గోపాలంతో చకచకా కబుర్లు చెబుతూ నడుస్తోంది ఆమె. ... ప్రపంచం అంతా తన పాదాక్రాంతమైపోతున్నట్టు అన్పిస్తోంది

"ఇలా ఎంత దూరం నడద్దాం?" అంది శ్యామల.

గోపాలం ... లిక కరుచుకుని ఆటోని పిలిచాడు ఇద్దరూ కూచున్నారు. ఆటో రివ్వున పోతూవుంటే శ్యామల సాన్నిహిత్యం అతనిలో ఏవేవో ప్రకంపనాలు రేపుతోంది. ఆమె దేవత ఐనట్టూ, తానొక దివ్యుడైనట్టూ ఇద్దరూ తోటల్లో, సెలయేళ్ళలో, మబ్బుల్లో ఇంకా ఎక్కడెక్కడో, ఏవో అందని లోకాల్లో విహరిస్తున్నట్టు తోస్తోంది. ఆటో థియేటర్ చేరగానే కలలోంచి దిగాడు గోపాలం.

థియేటర్ బుకింగ్ దగ్గరా, లోపలా అందరూ తమ ఇద్దర్నీ చూసి అసూయ పడుతున్నట్టు అన్పించింది శ్యామల చిరునవ్వు నవ్వుతూ అతన్ని ఏదో అడుగుతోంది అతను ఏదో చెబుతున్నాడు. వాటిలో విషయం ఏమీలేదు.

సినిమా మొదలైంది. గోపాలం శ్యామల భుజాలమీద చేయివేశాడు. ఆమె నవ్వుతూ తీసేసింది అతని చేతిని. సినిమా అయిపోయేదాకా ఆమె అతన్ని అలాంటివి ఏమీ చేయనివ్వలేదు.

అప్సరసను వెంటబెట్టుకున్న నలకూబరుడిలా అతను ఆమెలో ఒక పెద్ద హోటలుకెళ్ళాడు. అక్కడ ఏ ప్రత్యేకతలేని సామాన్య మానవులని చాలా మందిని తిరస్కారంగా చూశాడు గోపాలం. ఇద్దరూ కలిపి యూప్ గార్డెన్లో చక్కని భోజనం చేశారు. భోజనం ఐన తర్వాత విశ్రాంతిగా వెనక్కి వాలి అతను సిగరెట్ అంటించాడు ఎదురుగా శ్యామల మెరిసిపోతూ అతని కళ్ళకి కన్పిస్తోంది ఆమె చేతివేళ్ళు సన్నగా పొడగ్గా సాగి టేబిల్ మీద ఏదో లయ వేస్తున్నాయి ఆమె కళ్ళు ఎందుకో వెలుగుతున్నాయి. ఆమె పెదాలు ఎందుకో సన్నగా కదులుతున్నాయి. కాస్సేపయాక

"మీ నిర్ణయం దృఢమైనదేనా?" అంది శ్యామల

గోపాలం తన కలల్లోంచి దిగి వచ్చాడు. "మీ నిర్ణయం గూర్చే నేను అందోళన పడుతున్నాను. నేను దృఢంగా నిలుస్తానని నాకు నమ్మకం వుంది" అన్నాడు. ఆమె నవ్వుతున్నట్టుగా చూసింది. "నా నిర్ణయాన్ని చెప్పేముందు మీరు కొన్ని తెలుసుకోవాలి అవన్నీ ఈ వుత్తరంలో వున్నాయి. ఇంటికి వెళ్లాక చదువుకోండి," అని అతనికో వుత్తరం అందించింది. గోపాలం మెరిసే కళ్ళతో దాన్నందుకున్నాడు అక్కడే చింపబోతుంటే అమె" ఆఁ ఆఁ ఒంటరిగా చదువుకోండి" అంది వారిస్తూ గోపాలం

నవ్వి దాన్ని జేబులో పెట్టుకున్నాడు. ఇద్దరూ లేచి బిల్లు చెల్లించి బయటికి వచ్చారు. "చలిగావుంది" అంది శ్యామల కొంగుని నెత్తిపైనుంచి కప్పుకుంటూ. గోపాలం నవ్వి ఆటోని కేకేశాడు ఆటోలో వెచ్చగా ఆమె పక్కన కూచోడం అతనికి స్వర్గతుల్యంగా వుంది ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు ఆమె మెల్లగా చేయి విడిపించుకుంది

ఆటో ఇంటిముందు ఆగగానే దిగి మీటరు చెల్లించి ఆమె వైపు చూశాడు గోపాలం ఆమె నవ్వుతూ "అలవస్తాను. రేపొద్దునే కలుసుకుందాం" అంది గోపాలం తలవూపాడు ఇద్దరూ కాంపౌండు గేటుదగ్గరికి రాగానే మసక చీకటిలో ఆమెని అకస్మాత్తుగా ముద్దు పెట్టుకోబోయాడు. ఆమె ముందే ఊహించిన దాన్లాగా తప్పించుకుని "రేపు కలుద్దాం" అంటూ నవ్వుతూ పరుగెత్తింది గోపాలం ఒక్క క్షణం బ్రమాన్పడి అంతలోనే తేరుకుని హుషారుగా కూనిరాగం తీస్తూ గది తాళం తీశాడు.

లోపలికి వెళ్లగానే అర్జంట్‌గా ఆమె ఇచ్చిన కవరు తెంచి చదివాడు చదువుతుంటే అతని కాళ్లు చప్పుకూలిపోయాయి కళ్ళు బైర్లుకమ్మాయి

"మీ నిర్ణయం నాకు చాలా సంతోషంగా వుంది. ఐతే ఈ విషయం విని గూడా మీ నిర్ణయం అలాగే వుంటే నా కంతకంటే ఆనందం ఏముంది? నా కిదివరకే పెళ్ళయింది ఆయన ఒక ఆక్సిడెంట్‌లో పోయారు నా బతుకు చీకటి కాగూడదని మా నాన్న నన్ను మళ్ళీ చదివిస్తున్నాడు ఈ సమయంలో మీ వుత్తరం నా కెంతో ధైర్యాన్నిచ్చింది నా పెళ్ళయిన తర్వాత ఒక సంవత్సరం మాత్రమే నేను ఆయనతో "

గోపాలం ఇక ఆ వుత్తరాన్ని చదవలేకపోయాడు బుర్ర బద్దలైపోతూంది గుండె దెబ్బతిన్న పక్షిలా వుందతని మనసు. రాత్రంతా తెరిచిన కన్నులా అతని గదిలో లైటు వెలుగుతూనేవుంది ఆ వెలుతురులో అతను కాల్చే సిగరెటు పొగ వలయాలుగా గదంతా నిండింది. చివరికి తెల్లవారు జామున అతను లేచి ఎక్కడికో పోయాడు

తర్వాత రెండు రోజులకు అతనా గది కాళీచేసాడు!



# చట్టం ఆవలివైపున

సిహెచ్ పాపారావు



చీకట్లో మఱ్ఱిచెట్టు నీడ చీకటిలో చీకటి కలిపి చిక్కపరచినట్లుంది ప్రక్కన పోతున్న పంటకాలువ అలలపై చీకటి తెరలుతెరలుగ ఎగురుతుంది చుక్కల నీడల్ని మింగేయాలని ఉరుకుతుంది. ఈ చీకటి శోకంలా ఉంది. రాక్షసిలా ఉంది రమ్యంగానూ ఉంది. ఎటు చూసినా నల్లటి చీకటికాంతిని కడుపులో దాచేసుకొని కళ్ళతో ప్రకృతిని పరికిస్తుంది అర్ధచంద్రుడు బిక్కుబిక్కు

మంటూ చూస్తున్నాడు. వల్చటి గాలి నీటి అలలపై ఎగురుకుంటూ చల్లగా పోతుంది. చల్లటిగాలి నల్లగా ఉంది చీకటిలో చల్లని గాలిలో కూడ సన్నని చిరుచెమట బిందువులు క్షణక్షణానికి తొంగిచూస్తున్నాయి భయంతో. రాఘవ మనస్సంతా ఒక విధమయిన భయం రక్తంలో ప్లాస్మాలా జీర్ణించుకుపోతుంది ప్రతిక్షణం మనస్సంతా ఆలోచనల వల వేసినట్లుంది అంతా గజిబిజిగ పిచ్చెక్కించేట్లుంది. క్షణక్షణానికి భయం, బాధ రెట్టింపవుతున్నాయి

దాని కీవిషయం ఎలా చెప్పాలి?

అది నామాట వింటుందా?

అయినా ఇది ఎంతసిగ్గయిన విషయం! తను నేరుచేసుకొని ఎలా చెప్పగలడు తన కిలాంటి దౌర్భాగ్యపుస్థితి కలిగించిన ఆ దేవుణ్ణి కసి తీరా తిట్టాలనిపిస్తుంది తనీ వెధవ పోలీసు ఉద్యోగానికి రాకుంటే ఈస్థితి వచ్చేదికాదేమో. బ్రతకటం ఒక సమస్యయి ఈ పనికి వచ్చి చేరాడు ఆ సమస్యే ప్రస్తుతం తనస్థితికి దిగజార్చి నైతికంగా పతనంచేస్తుంది. తనకొచ్చిన సమస్య తల్చుకుంటే గుండె చెదురుతుంది తనా పనిచేసి ఆ సమస్యను పరిష్కరించక తప్పదు తప్పదు

ఆలోచనలు అనుక్షణం బాధ్యతను గుర్తుచేస్తున్నాయి. అనుక్షణం తన గతం గుర్తొచ్చి భవిష్యత్తు గూర్చిన భయం పెంచుతుంది

• • •

తన తండ్రి తాపీపని చేసి కృంగిపోయాడు. సిమెంటు, ఇసుక వాసనలతో కడుపునింపుకొని ఊపిరితిత్తుల్లో క్షయ రోగం పెంచుకున్నాడు నలభై ఏళ్ళ వయసుకే డెబ్భై ఏళ్ళు ముంచుకొచ్చినట్లు పండిపోయి, జ్ఞాపకాలుగా రోగాలు, అనుభవాలుగా ఆరుగురు పిల్లల్ని మిగుల్చుకున్నాడు. అప్పటికి రాఘవ వయస్సు ఇరవై వయస్సు పొంగు కట్టతెంచుకుని ఉరికే వయస్సులో బాధ్యతలు బ్రతుకను కృంగతీసినయి తనే పెద్ద కొడుకు తన తర్వాత పుట్టిన ఇద్దరు ఆడపిల్లలు కోర్కెలు గుండెల్ని మండించే వయసులో అడుగుపెట్టారు. నోట్లోకి నాల్గువేళ్ళు వెళ్ళటం కష్టమయి చివరకు పోలీసు జవానుగా చేరాడు

ఆ ఊర్లో చిన్న స్టేషన్ హవుస్‌లో పోస్టింగ్ వచ్చింది. ఆ ఊరు అంత పెద్దది అంత చిన్నది కాదు. పల్లెటూరుగానే పరిగణించవచ్చు జనాభా ఒక అయిదారువేలు ఉంటుంది. ఊరు ముచ్చటగా, పచ్చటి పంటలతో కళకళలాడుతూ ప్రగతి ప్రతిబింబంలా ఉంటుంది ఆ ఊరు చూసి తన కెంతో ముచ్చటవేసింది.

ఆ స్టేషన్‌లో ఒక హెడ్ కానిస్టేబుల్, ఒక రైటర్, నల్గురు కానిస్టేబుల్స్ ఉన్నారు. హెడ్ జకరయ్య నల్లగా బలిసిన తుమ్మమొద్దులా ఉంటాడు. గారపట్టిన పళ్ళు నవ్వినపుడు బయటపడి

వికృతంగా కనిపిస్తాయి కళ్ళలో ఎర్రటి జీరల్లో అధికారదర్పం కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది రైటర్ రామచంద్రం ఎంతో మర్యాదయిన మనిషిగా ప్రవర్తి స్తాడు అతనికి కొండముచ్చని నిక్‌నేమ్ ఇక మిగిలిన నల్గురు కానిస్టేబుల్స్ భద్రయ్య జాన్, హసన్, రాముడు. తమపనేదో తామేదో అన్నట్లు ప్రవర్తి స్తారు

మొదట్లో జీవితమెంతో సుఖంగా సాగిపోయింది అప్పుడప్పుడు పైడబ్బులు దొరికినయి తనిక జీవితంలో పూర్తిగ స్థిరపడ్డా ననుకున్నాడు పున్నమ్మ వెన్నెల్లో వెలిగే పొన్నపువ్వులాంటిది నల్లటి ఛాయలో లేతివయస్సు మెరు స్తుంటుంది నల్లటి పెద్ద కళ్ళలో తెల్ల గుడ్డు వెన్నెల్లా, నల్లపాప చీకటిమరకలా అద్భుతంగానూ వింతగానూ కన్పిస్తుం టుంది నల్చటి పెదవులమీద నల్చటి చిర్నగవు ఆమె మనస్సు చిర్నవ్వులా అందమయినదే ఆమెతో జీవితం ఎంతో ఆనందాన్నిస్తుంది జీవనకాలం ఒక వసంతం ఊహించనంత వేగంగా తిరిగిపోయింది

జీవితం యొక్క రెండవవైపు అసలు స్వరూపం బయటపడుతుంది చేదు అను భవాలు ఎదురవుతున్నయి. ఆ ఉద్యోగం ఒక విధంగా వెట్టిచాకిరిలాంటిదే హెడ్ ఇంట్లో పనులుచేయాలి విజిటింగ్ కొచ్చే ఆఫీసర్లకు అడుగులకు మడుగులొత్తాలి. మిగతా కానిస్టేబుల్స్ కొత్తగా వచ్చిన వాళ్ళచేత తమ డ్యూటీలు చేయించు కుంటారు నైట్ డ్యూటీలు ఎక్కు వగా వేస్తారు

హెడ్ చేయించుకోని పని అంటూ ఉండదు కేసులు దొరక్కపోతే అతను తిట్టే తిట్లు తిట్లుకావు అతి క్రూరంగా, అసహ్యంగా తిడతాడు ఒక్కోసారి ఈ బ్రతుకు నుంచి తనకు పారిపోవా లనిపిస్తుందేది కాని తనచుట్టూ అశలు అల్లుకొని బ్రతుకుతున్న తల్లీ, తండ్రీ, తమ్ముళ్ళు దీనంగా కళ్ళ ముందు కదులుతూ తనను బంధించేవారు

రోజురోజుకు పని ఎక్కువయి పోతుంది నెలాఖరు వస్తుంద టే గుండె దడ జకరయ్య అదమాయింపులు ఎక్కువ అవుతున్నాయి కేసులు దొర కవు సి ఐ ఇన్స్‌పెక్షన్‌కు వస్తున్నా డట, రామచంద్రయ్య చెప్పాడు. మిగతావాళ్ళకు కాస్త కూస్తా పలుకుబడి ఉండటంవల్ల పని చేయకున్నా ఎవ్వరూ పట్టించుకునేవారు కాదు తనే ఏ దిక్కు లేక పొరుగూరునుంచి వచ్చి ఉద్యోగం చేస్తున్నాడు దానికి తోడు సర్వీసు కూడ తక్కువ కావటంతో అందరూ చులకనగ చూస్తున్నారు

ఈసారి నెలాఖరుకు కేసులు పట్టాల్సిన బాధ్యత తనమీద పడింది పాత అయిదీలను పట్టుకొని క్రొత్త కేసులు బనాయించి చార్జిషీట్సు తయారు

చేయించాడు పల్లెటూర్లలో జరిగే నేరాలు తక్కువ పట్టణాలలో అయితే ఏదో ఒక నెపం చూయించి పట్టుకోవచ్చు ఇక్కడలా చేయటం కష్టం. దానికితోడు ఎవరికెలాంటి బలాబలా లుంటయ్యో సరిగా తెలియదు. ప్రాస్టిట్యూషన్ కేసులు లేవని తెగ చిరాకుపడుతున్నాడు జకరయ్య. ఇంట్లో భార్య లేనపుడు ఆ కేసులు పట్టమని పంపుతుంటా డంట మొన్న మూడు నెలల క్రితం అలానే వేధించాడు అప్పు డెలానో సర్ది చెప్పాడు. కాని ఈసారి అలా ఊరు కునేట్లు లేదు. మెమొ ఇస్తానంటున్నాడు. మొన్న ఎంతో కష్టపడి ఒంటరిగ వస్తున్న ఆడమనిషిని అనుమానం మీద తీసుకెళ్తే నానా రభసా అయ్యింది. ఆవిడ సర్పంచి బంధువంట బంధువు లింట్లో మనస్పర్థలొచ్చి తన ఇంటికి బయల్దేరిందంట అదెంతవరకూ నిజమో కాని తన బ్రతుకు, పరువు వీధిన పడేసేసింది. ఆ రోజు జకరయ్య నానా బూతులు తిట్టాడు. అవి ఇపుడు తల్చు కుంటే వళ్ళు జలదరిస్తుంది ఆ క్షణం అతనిమీద పడి పీక పిసికి చంపేసి పారిపోవాలన్నంత కసి పెరిగింది. కాని తనలో అంత గుండెబలం ఏది?

కేసులు విషయమై వారం రోజు ల్నుంచి హెచ్చరిస్తున్నాడు రేపు చివరి రోజు ఎల్లుండి సి ఐ వస్తాడు ఏం చేయాలో తోచటల్లేదు. ఆలోచిస్తున్న కొద్దీ పిచ్చెక్కేలా ఉంది

ఎవరినన్నా సంప్రదించాలి ఎవరు న్నారు తనకు సలహా ఇవ్వటానికి. రాత్రి భద్రయ్య నడిగితే చెప్పిన పనే చెయ్యాలి. అతను చాలా సేపు ఆలో చించి తనకా సలహా ఇచ్చాడు. తనొక సారి అలా నే చేశాడంట అతను చెప్తుంటే గుండె ఓ క్షణం ఆగిపోయింది. అంత నీచమయిన పని తను చేయగలడా? అనిపించింది అయినా దాన్నెలా ఆప గటం ఈ 'బతుకు బ్రతకటం కన్న చచ్చిపోవటం నయం అనిపిస్తుంది కాని చచ్చిపోయేంత తెగువ తనలో లేదు. తను పిరికివాడు

చావును తల్చుకున్న కొద్దీ బ్రతుకు మీద ఆశ పెరుగుతుంటుంది బ్రతకా లన్న తపన పెరుగుతుంది అతనిలోను అదే తపన ఈ బ్రతుక్కి అర్థంలేకున్న సార్థకతలేకున్న ఏదో వెర్రివ్యామోహం ప్రవేశించి మనిషిలో నున్న నైతిక స్థితి నుంచి దిగజార్చి మరీ బ్రతికిస్తుంది. ఆ తపన, వ్యామోహం ఆలోచిస్తున్న కొద్దీ చావు భయంతోపాటు పెరిగిపోతు న్నాయి రక్తంలోని కణాలన్నీ బ్రతక మని ప్రోత్సహిస్తున్నాయి ఆ ప్రోత్సా హం నైచ్యాన్ని సైతం ఆచరిస్తుంది. అతనా స్థితికి దిగజారాడు ఆమెకు ఆ విషయం చెప్పి చేయమని ప్రార్థిసాడు వినకుంటే భర్తగా ఆజ్ఞాపిస్తాడు.

'తప్పదు. చెప్పక తప్పదు.'

లేకుంటే బ్రతుకు వ్యామోహం




అతన్ని చంపేస్తుందన్న భయం. అంత వరకూ సాగిన ఆలోచనలకు అతని నిర్ణయం ఆనకట్ట వేసింది.

అప్పటికి ఊరు పూర్తిగ నిద్ర పోయింది. చీకటిలో తల్లిఒడిలో పిల్ల లాగ పున్నమ్మ తన కోసం ఎదురు చూస్తుంటుంది. తనెళ్లి ఎలా చెప్పాలి? అనే ప్రశ్న మళ్ళీ తలఎత్తుతుంది. దాని నల్లటి కళ్ళల్లో నవ్వుల నీడల్ని చూస్తూ తనెలా అడుగగలడు

'మావా, ఇంతకన్న నన్నొక్కమారు చంపేయరాదా!' అని అంటే తానేమని బదులు చెప్పగలడు.

'పున్నా! ఆడదాని ప్రాణం కంటె మానానికి వెలువెక్కువే. నువ్ చచ్చి పోతే నా సమస్య తీరుతుందా' అని బ్రతిమాలి బుజ్జగించి ఆ పనికి ఒప్పించాలా?

తనా పని చేయలేడు!

చేయలేడు!

మరి ఎలా?- బ్రతుకు మీద మమకారం వేస్తున్న ప్రశ్న

ఈ ఉద్యోగంవదులుకుంటే అందరూ ఆకలితో చావాలి ఎండి ఎండి చావాలి. అంతటి భయంకరమయిన చావు తాను భరించలేడు.

'అయితే ఏం చేయాలి?'

స్వార్థం ప్రశ్నలతో రెచ్చగొడు తుంది. మనస్సు సంద్రంలా ఎగిరి పడు తుంది. తన కోసం, తనవాళ్ళ కోసం, భవిష్యత్తు కోసం ఎవరో తల్లి కన్న బిడ్డను తను బలి తీసుకుంటున్నాడు.

అసలు తనకా అధికారం ఎక్కడిది. తను కట్టిన పసుపు తాడుదా! అది అంత పవిత్రమయిందా! అయితే తను ఎందు కిలా అతి నీచమయిన పనికి ఆ పవిత్రతను బలి తీసుకుంటున్నాడు.

'స్వార్థం' మనస్సు మథనంలో స్వార్థం గెలిచి మానవత్వంపై దురాక్రమణ జరిపి విజయ పతాకం ఎగరవేసింది ఓడిపోయిన ఆత్మ మూలుగుతూనే ఉంది కంటికి కనిపించక అరిచే కీచురాయిలా మూల్గుతూనే ఉంది దానిని తాను గుర్తించడు. గుర్తిస్తే తాను బ్రతకలేడు.

ఆలోచనం సుడినుంచి లేచి ఇంటికి బయల్దేరాడు అతని ప్రయాణం చీకట్లో నుంచి చీకట్లోకే. ఎప్పటికీ చీకటిలోకే. తను చీకటిలో కలిసిపోయేదాక చీకట్లో కరిగిపోయేదాక. ఒక్కొక్క అడుగు ముందుకు పడుతుంటే రక్తం వేగంగా పరిగెత్తుతుంది. గుండె బరువవుతుంది రక్తం చెమటగామారి వళ్ళంతా భయంతో తడిపేస్తుంది ఇల్లు దగ్గరవుతున్న కొద్దీ కాళ్ళు బరువవుతున్నాయి. వాకిట్లో తెల్లటి చీరెలో ప్రసన్నమ్మ చీకట్లో దీపంలా మెరుస్తుంది. అతన్ని చూసిన ఆమె కళ్ళు తళుకులు కురిపిస్తున్నాయి అతని కెదురొచ్చి 'ఏం మావా! ఇంత ఆలస్యమయిందే' అని ప్రశ్నిస్తుంటే గుండెల్లోని అర్ద్రిత పొంగిమాటల్లో తొంగిచూస్తుంది.

అతనేం సమాధానం చెప్పలేదు.

"స్నానం చేస్తావా. వేడినీళ్ళు పెట్టాను" ఆమె

"ఇపుడొద్దులే. చన్నీళ్ళు చేస్తాను."

"జలుబు చేస్తదేమో. అసలే కాస్త చలిగాలి ఈస్తుంది."

"సర్వాలేదులే." దానికేం తెలుసు తనలో ఉన్న అలజడి. ఆ అలజడి అణుచుకోవటానికే చన్నీళ్ళను.

అతను స్నానం చేస్తున్నంత సేపు ఆమె ఏవేవో అడుగుతూనే ఉంది. అతను అప్రమత్తంగా సమాధానాలిస్తున్నాడు. ఆమెలో అనుమానం పొడ చూపింది.

"ఏంటి మావా! అట్టగున్నావ్?"

ఆ ప్రశ్న కతను తత్తరపడ్డాడు. ఏమని సమాధానం చెప్పగలడు. మౌనంగా ఊరుకున్నాడు. ఆమె మరి ఇక ప్రశ్నించలేదు. అతను స్నానం చేసి భోజనంచేసి ఇంటి వెనక నడవలో పడుకునే దాకా ఇద్దరూ ఏం మాట్లాడుకోలేదు. ఆమె అతని ప్రక్కనే కూర్చుని అతన్ని చూస్తుంది అతను మాత్రం ఆమెను చూడలేక దూరంగా ఉన్న చుక్కల్ని లెక్కపెడుతున్నాడు.

"మావా!" ఆమె కళ్ళతోను, పెదవులతోను పిలిచింది. అతను మాత్రం గుండెలో 'ఊఁ' అనగలగాడు. ఆమె అతని ఛాతీపై తల ఉంచి పడుకుంది మెత్తని చెంపలు అంతకన్న మెత్తని ఊరువులు వత్తుగా తగులుతున్నాయి. ఆమె విడిచే ఊపిరి వాడి పిట్టూర్పులా ఉంది. ఆ స్పర్శలో అతని కేమాత్రం అనుభూతి కల్గటల్లేదు. అతనిలో ఎలాంటి సంచలనం లేదు. అది శరీరమయితే కదా! కేవలం రక్త

మాంసాల ముద్ద. స్వార్థం తప్ప మరేం లేని క్షుద్రశక్తుల కుప్ప.

ఆమె కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి.

"మావాఁ! నీ బాధ నాకు చెప్పవా!" అని అడిగింది.

"పున్నా! నా గుండె నీకేం చెప్పట్లేదా!" అని అడగాలనుకున్నాడు. కాని అడగలేదు.

"ఈ గుండె భాష నా కర్థమయితే ఎంత బాగుండును. మామ బాధ నాకు తెలిసేది కదా!" అని ఆమె ఓక్షణం బాధపడింది. అతనికింకా దగ్గరగా జరిగి చేతి వేళ్ళతో మీసకట్టు సవరిస్తూ అతని కళ్ళల్లోకి చూస్తూ కళ్ళయినా బదులు చెపుతయేమోనని భ్రాంతిపడింది. అవి కళ్ళయితేనే కదా! గాజుముక్కలు.

అతనికి ఏం మాట్లాడాలో తెలియటల్లేదు. చాలాసేపు మౌనంగా ఉన్నాడు. తనలో తను ధైర్యపరుచుకుంటున్నాడు. గొంతులో మాటలు తడితడిగా తయారై ముద్దగ వస్తున్నయి.

"పున్నా!"

"మావాఁ!"

కాసేపతను ఏమీ మాట్లడలేదు.

"పున్నా, నిద్రవస్తుందా!"

"లేదు మావాఁ!"

"నేనొకటి చెపుతాను వింటావా!"

"చెప్పు మావాఁ!"

"మనం ఇంత దరిద్రులం ఎందుకయ్యాం?"

"అంతా దేవుఁడి దయ మావాఁ!"

"ఆ దేవుఁడుంటే మనం ఇంత మొక్కుతున్నా పలకడేం పున్నా అసలు దేవుఁడు లేడు పున్నా. మనిషే మనిషి భవిష్యత్తును నిర్ణయిస్తాడు అధికారి తన క్రింద ఉద్యోగుల భవిష్యత్తు నిర్ణయిస్తాడు. ఇక దేవుఁడి నిర్ణయాలకు తావెక్కడిది పున్నా!"

"................"

"చూడు పున్నా! మనిషి తాను ఎందుకు చచ్చిపోతను అనుకుంటాడో తెలియదు. చచ్చిపోవటంతో సమస్యలు తీరిపోతయ్యని అతనికి తెలియదా."

"అదేమిటి మావాఁ! అట్లా మాట్లాడుతున్నావ్!"

"పున్నా! నేను చచ్చిపోతే నాకున్న సమస్యలు తీరిపోతయి కదా! కాని నేను చచ్చిపోలేను. నేను పిటికివాడ్ని. నా కది చాతకాదు. ఎంత నీచమయిన బ్రతుకయినా బ్రతకటానికి సిద్ధపడుతాను కాని చచ్చిపోలేను కదా!"

"మావాఁ!" ఆమె కంఠంలో భయం.

"పున్నా! నే నెన్నో మాటలుపడుతూ ఈ ఉద్యోగం చేస్తున్నాను. నా వ్యక్తిత్వం చచ్చిపోయినా బాధపడలేదు. ఆఖరికి ఈ ఉద్యోగం చేయటానికి ఇంత నీచస్థితికి నన్ను నేను దిగజార్చుకుంటున్నాను. నన్ను క్షమించవూఁ!"

"మావాఁ! నీ మాటలు నాకేమీ అర్థం కావటల్లేదు!"

"ఇవి మాటలు కావు పున్నా. ఇంత తన్న నే నెలా చెప్పగలను. పున్నా, నాకోసం నువ్వేమయినా చేయగలవా!"

"నీ కోసం ఏమయినా చేయగలను మావా!" ఆమె కంఠంలో ఏదో ఉద్రిక్తత ప్రవేశించింది.

"నా స్వార్థంకోసం నా వాళ్ళకోసం నిన్ను పణంగా పెట్టుకొంటున్నాను పున్నా నిన్ను నేను బలితీసుకుంటున్నాను. ఆ భగవంతుడు కూడ నన్ను క్షమించలేడు. ఈ స్వార్థపిశాచాన్ని నీవు క్షమించద్దు. నన్ను క్షమించవద్దు పున్నా" అతను ఆవేశంతో తల్లడిల్లుతున్నాడు.

"చెప్పు మావా! నన్నేం చేయమంటావు నా ప్రాణా న్నిమ్మంటావా!"

"పున్నా! ఆడదాని మానానికున్న విలువ ప్రాణానికెక్కడుంది!".

"ఏమిటి మావా! నువ్వనేది. ఏం చేయాలి నేను. చెప్పు మావా" ఆమె కన్నులలో భయం, ముఖంలోనూ, పెదవులలోను, చెక్కిళ్ళలోను, కనురెప్పల్లోనూ భయం.

ఎలా చెప్పాలో తోచక మాటలు తడుముకుంటున్నాడు. తరతరాలుగా స్త్రీని పురుషుడు ఆస్తిగా వాడుకున్నాడు. మట్టిబొమ్మతో ఆడుకున్నట్లు వాడుకున్నాడు స్త్రీని. తనని ఎంతో గాఢంగా ప్రేమించిన ఈ పొన్నపువ్వుని దూరంగా అందురూ నడిచే దారిలోకి విసిరికొడుతున్నాడు "ఓ కాఠిన్యమా? ఎంతటి భయంకరమైనదానవు నీవు!" అని అనిపిస్తుందతనికి. తప్పదు చెప్పక తప్పదు తన భవిష్యత్తుకు ఆమె పునాది రాయిగ వేసుకోక తప్పదనిపించింది:

"నిన్ను వ్యభిచారిగ పోలీసుస్టేషన్లో హాజరుపర్చాలి!" అని మాత్రమే అనగలిగాడు. అతని మాటలు ఆమె గుండెలకు గుచ్చుకున్నాయి. కళ్ళల్లో కన్నీరు ఇంకిపోయి ఆ చూపులు బిత్తరపోయినయి. పెదవులు శోకంతో వణుకుతున్నయి. ఆమెలోని చైతన్యం చచ్చిపోయి సుషుప్తి ఆవరించినట్లుండిపోయింది. చీకటిలో చీకటిలా నిల్చిపోయింది.

"మావా! ఒక్కసారిగా చంపేయరాదు" అని అడిగింది ఆమె ఆ కంఠంలో తెగింపు. సుఖదుఃఖాలు ఏమీ లేవు. కళ్ళనిండా ప్రశాంతత. దైన్యం గుండె నిండా.

"నిజమే పున్నా! నిన్ను చంపి నేను చచ్చిపోతే ఎంతో బాగుంటుంది కాని మన సమస్యలు చస్తే తీరవే నా తల్లి, తండ్రి, తమ్ముళ్ళు అందరూ అన్నమో రామచంద్రా అంటూ బిచ్చమెత్తుకుంటూ తిరగాలి మనిషి ప్రాణం కన్న ఈ దరిద్రం, ఆకలి విలువయినవి. అందుకనే ఈ వెర్రి తాపత్రయం"

ఆమె ఏమీ మాట్లాడలేదు. తను ఎన్నో సార్లు అతనికి చేదోడువాదోడుగా ఉంది. డబ్బు చాలక సంసారం గడవ

నపుడు తను కూలికెళ్ళేది. దబ్బవసర మయితే తను పసుపుకొమ్ము కట్టుకొని మంగళసూత్రాలు అమ్మింది. అపుడు త నేమాత్రమూ బాధపడలేదు. కాని ఇపుడు తన భర్తే తనని వ్యభిచారని సమాజానికి పరిచయం చేస్తున్నాడు. ఇంత కాలం నమ్మి ప్రేమించినందుకు అతనామెకు ఇస్తున్న కానుకిది.

ఇది ఇప్పటి విషయం కాదు.

ఎన్నోసార్లుగ పు రు షు డి లా నే ప్రవర్తిస్తున్నాడు పురాణాల్లోనూ, చరిత్ర లోనూ పురుషుడి ప్రవర్తన ఇలానే ఉంది. గతం, వర్తమానం, భవిష్యత్తు వీటి అన్నిటిలోను ఎక్కడా పురుషుడిలో మార్పు కానవచ్చే ట్లులేదు. స్త్రీ పురుషుడు కోసం ఎపుడూ ఆవేదన, జాలి పడుతూనే ఉంది తనని త్యాగం చేసుకుంటుంది. ఈ త్యాగానికి ఎవరు విలువ కట్టారు ప్రపంచ ధనరాసులన్నీ కొల్లగొట్టు కొచ్చి ఆమె పాదాలమీద పోసినా ఆ ఋణం తీరదు. ప్రకృతిశోభ కామెను రాణిని చేసినా ఆ ఋణం తీరదు. స్త్రీకి పురుషుడు ఎప్పుడూ బాకీయే. పురుషుడు తనెంతగా తన ప్రతిభకు మురిసిపోయినా స్త్రీ ఔన్నత్యానికి ఎపుడూ సాటిరాదు.

పున్నమ్మ చాలాసేపు ఆలోచించింది చింది. తను అతని మాట కా ద ం టే ఆమెను అంతగా ప్రేమించలేదు ఆ ప్రేమ లేనిదే తను బ్రతుకలేదు. ఆ ప్రేమ కోసం తను త్యాగం చేస్తుంది. కాని అతనిలో ప్రేమ లేదే. అది ఎండి పోయిన మధుపాత్రికని ఆమెకు ఎలా తెలుస్తుంది దాని అంచులు స్వార్థంతో చిట్లిపోయినయి. ఆ పాత్రిక ప్రేమ మధువు పోయటానికి పనికిరాదని ఆమె కెవరు చెప్తారు. తన త్యాగం వృధాయే నని ఆమె కెట్లా తెలుస్తుంది

త్యా గ ం జీ వ న పరమావధిగ నిర్ణ యించుకున్న ఈ స్త్రీ ఎపుడూ ఉత్తము రాలే. ఆమె తీసుకున్న నిర్ణయం అద్భు తమయినదే ఏ స్త్రీ చేయ సాహసించని త్యాగమది దాని విలువ కొన్ని ప్రాణాలు ఆమె ఆశించింది పిడికెడు గుం డె కు ప్రేమ

తాను జైలుగదిలో కష్టాలనుభవించే వారి ఎందరి కథలు వింది. అక్కడ జరిగే అ మా ను షా లు వింది. తాను పవిత్రంగా రాలేనినాడు, అపవిత్రమయి నపుడు ఆమెలో బ్రతకాలనే వాంఛ కూడా ఉండదు. ఇవన్నీఆలోచించి నిర్ణయించు కొని గుండె దిటవుపర్చుకొని కన్నీళ్ళ చారికలు తుడుచుకొని అతని కళ్ళల్లోకి చూసింది. అతని కళ్ళు మౌనంగా ఏడుస్తున్నాయి

"మావా!"

అతను పలుకలేదు

"నీయిష్టం మావా!"

అతను కళ్ళు తెరిచాడు. అతని కళ్ళ కామె కనపడలేదు ఏదో అఖండమయిన వెలుగు కనిపించింది. ఆ వెల్గు నతడు

చూడలేదు. చూసి భరించలేదు. కళ్ళు మూసుకునే "నన్ను క్షమించవూ!" అన్నాడు.

ఆమె అతనికి దగ్గరగా జరిగింది. అందులోనే క్షమాపణ ఉన్నది. అతనామె తలను మెల్లిగా నిమిరాడు.

"మావా! నన్ను మర్చిపోవుకదూ!"

"నిన్నెలా మర్చిపోతాను పున్నా. నిన్ను మర్చిపోతే నన్ను నేను మర్చిపోయినట్లు కదా."

"మావా! మరో జన్మంటూ ఉంటే మళ్ళీ మనం ఇలానే .."

"పున్నా! నిన్ను నేను జైలు నుంచి వదిలంగా తెచ్చుకుంటాను."

"నాకు నమ్మకం లేదు మావా! మనకిదే చివరి కలయిక అనుకుంటాను. మావా! ఆ ఆకాశం చూడు. ఎంత అందంగా వంగింది నేలనందుకోవటానికి నేను నీకోసం అలా వంగి నీలో కల్సిపోతాను మావా! మన కలయికలో మెరుపులు మెరిసి కాంతిని కురిపిస్తయి కదూ! చూశావా మావా! రాబోయే ఎడబాటు తల్చుకుంటే మనస్సు ఎంతగా ఊగిపోతుందో చూశావా మావా!" ఆమె వెచ్చటి ఊపిరి అతనికి ఊపిరయ్యింది. ఆ ఊపిరిలోనే అతను మనకల్లుతున్నాడు ఆమె ఆవేశంతో, ఆవేదనతోను పొంగి పొంగి అతనిలో కల్సిపోయింది. ఒక జన్మ ఎడబాటు భరించటానికి సిద్ధపడుతూ.

* * *

ప్రతిరోజులా ఆ రోజు తెల్లారింది. ఎర్ర సూర్యుడు తూర్పు కొండలపై అమాయకంగా తేలాడు.

అతను నిద్ర లేచి చొక్కా కయిన కుంకుమ మరక రోజులా తుడిచివేయ లేదు అది కనపడకుండా చెయ్యడ్డం పెట్టుకొని లోనికెళ్ళాడు. అప్పటికే అతనికోసం ఆమె ఎదురు చూస్తుంది. పల్చటి కురులు తలస్నానం చెయ్యటం వల్ల నుదుటమీద అతుకుంటున్నయి. రోజుకన్న వెడల్పయిన బొట్టు పెట్టుకుంది. కాలి బొటనవ్రేళ్ళకు పసుపు రాసుకుంది

అతని ముందు ఆమె దేవతలా సాక్షాత్కరించింది పెదవులపై చెరగని చిర్నగవు. అతను ఏదో చెప్పాలనుకుంటున్నాడు. తనని క్షమించమని పదే పదే వేడుకోవాలనుకొంటున్నాడు. కాని అడగలేకపోతున్నాడు సిగ్గుతో తల వంచుకొని అక్కడ్నించి కదిలాడు. ఆమెను ఎలాగయినా చాలా జాగ్రత్తగా మరల విడిపించుకోవాలి. అదే అతని ఆలోచన ముఖప్రక్షాలన కానిచ్చేసరికి పళ్ళెంలో అన్నం కల్పి ఉంచింది. అతను ఆమె ఎదురుగా కూర్చున్నాడు. ఏమీ తినాలని అనిపించలేదు. ఆమె నోటికి ఒక ముద్ద అందించాడు. అందులో సగం మాత్రమే తినింది. మిగతాది తను తిన్నాడు. ఆమె కళ్ళు కన్నీటిని బలవంతంగా ఆపుతున్నయి. అతనిది అదే స్థితి. గుండె



దిటవుపర్చుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

అతను యూనిఫారమ్ వేసుకొచ్చే వరికి ఆమె సిద్ధంగా ఉంది. అతను మౌనంగా కదిలాడు ఆమె అతన్ని అనుసరించింది ఇంట్లోవాళ్లు అంతా వింతగా చూస్తున్నారు. వారిద్దరూ దారిలో ఏమీ మాట్లాడలేదు. ఒక్కటే ఆలోచన. ఆమెను పదిలంగా తెచ్చుకోవాలని తర్వాత తర్వాత మెల్లగా జకరయ్యకు నచ్చచెప్పి విడిపించుకోవాలి. ఇవే అతని ఆలోచనలు ఆమె మాత్రం ఏం ఆలోచించటంలేదు. లక్ష్మణుడి చేత అడవిలో విడిచిపెట్టిన 'సీత'లా ఉంది ఆమె. అతన్ని మౌనంగా అనుకరిస్తుంది.

స్టేషన్ చేరేవరికి ఇంకా ఎవ్వరూ రాలేదు. రాత్రి డ్యూటీ చేసిన భద్రయ్య అతన్ని జాలిగా చూసి బాధపడవద్దని చెప్పి డ్యూటీ రాఘవకప్పగించి వెళ్ళిపోయాడు. అతనామెను సెల్‌లోకి తీసికెళ్ళి కూర్చో పెట్టాడు. కొద్దిసేపటికి జకరయ్య వచ్చాడు. రాఘవ అతనికి సెల్యూట్ చేసి నిలబడ్డాడు.

“కేసులు పట్టావా!” హుంకరించాడతడు.

“యస్ సార్! బ్రోతల్ కేసు.” అతని ప్రయత్నం లేకుండానే అధికార దర్పానికి భయపడి మాటలు వచ్చేస్తున్నాయి.

“తీసుకురా” మళ్ళీ అరిచాడు.

అతను సెల్లోంచి తీసుకొచ్చాడామెను. ఆమె తలవంచుకొని ఉంది. ఆమెను చూడగానే జకరయ్య కళ్ళలో మెరుపులు మెరిసినయి. పెదవులు వెకిలిగ నవ్వినయి.

“ఇదేనా ఆ లంజ. ఆ మిండిదేది!”

"దొరకలేదు సార్. పారిపోయాడు "

"తొత్తుకొడుకా నువ్వేం చేశావ్?"

తొత్తుకొడుకు అనేది అతనికి ఊతపదం. అందరినీ అంటూంటాడు. ఎవ్వరూ అతనికి ఎదురు తిరగలేదు.

"అదికోసం వెళ్తే ఇది పారిపోతదని వెళ్ళలేదు సార్."

"ఎక్కడ పట్టుకున్నావ్."

"పెద్దమర్రికాడ."

"ఆరు బయటా? ఏవేం లంజ! మీకు ఒళ్లు కొవ్వెక్కుతుంది." జకరయ్య కసిగా తిట్టాడు అందులో అతని కేదో ఆనందం కనిపిస్తుంది.

"ఎన్నింటికి దొరికింది."

"అయిదింటికి సార్."

"సిగ్గులేవియ్యి తెల్లారేదాక కుతి తీరలేదంటే.. ఊఁ నువ్వు అపుడు డ్రస్‌లో ఉన్నావా?"

"లేను సార్."

"ఎందుకు లేవురా తొత్తుకొడుకా!"

"డ్యూటి నాది కాదాసార్"

"మరి ముందనేం చేసావు. నీ ఇంటికి తగులు కెళ్ళావా? మరేం చేశావు?"

"సెల్‌లో వేసి వెళ్ళానండి"

"రైటర్ వచ్చాక అన్ని వివరాలు చెప్పు."

"యస్ సార్"

అతను లేచి వచ్చి ఆమెను నఖశిఖ పర్యంతమూ చూశాడు. అతని కళ్ళల్లో ఏదో వింత మెరుపులు. ఆమె వంచిన తల ఎత్తలేదు.

"నీ పేరేటి". జకరయ్య.

ఆమె మాట్లాడలేదు.

"చెన్నమ్మంట సార్" - రాఘవ.

"ఏ ఊరు"- జకరయ్య

"........" పున్నమ్మ.

"ప్రక్కనున్న లంక సార్" రాఘవ.

"తొత్తుకొడక, అడిగింది దాన్ని" కసిరాడు జకరయ్య. అతనికి చిరాగ్గాను, కోపంగాను ఉంది. తప్పు చేసి కూడా పొరపాటయిందని కాళ్ళా వేళ్ళా పడక దెయ్యమల్లే విలబడి ఉందని కసిగా ఉంది

"మాట్లాడవేమే లంజా." అంటూ చేతిలోని లాఠీతో భుజంమీద పొడిచాడు. ఆమె కదల్లేదు. అతనికి చిరాకెక్కువయ్యింది. ఆమె చుబుకం క్రింద లాఠీ పెట్టి ముఖం పైకెత్తాడు. ఆమె కళ్ళ నిండా గంభీరత. నుదుట కుంకుమ ఎర్ర సూరీడులా మెరుస్తుంది.

"పెళ్ళయిందా"

"..............."

"మొగుడున్నాడా?"

"లేదు" ఆమె పలికిన మొదటి అక్షరాలు చాలా సంక్షిప్తంగా వచ్చినయి- ఆ మాటలయినా. ఆ సమాధానానికి రాఘవ విత్తరపోయాడు. శరీరం అంతా భూమిలోకి కృంగిపోయినట్లవుతుంది. ఆ సమాధానం తన చేతకానితనాన్ని వేలెత్తి చూపించింది.

జకరయ్య అర్థంలేని ప్రశ్నలు వేస్తున్నాడు. లాఠీతో మెడలోఉన్న తాళి బయటకు లాగాడు.

"మరి ఇదెందుకే లంజ పెద్ద పత్తిత్తు గాగ" అని కసిగా లాగాడు. అది తెగ లేదు బలంగ పేనిన త్రాడది. మనుషుల మధ్య ఉన్న బంధం కన్న బలమైనది. అది తెగకపోవటంలో అతనికి చిరా కేసింది. కసిగా త్రెంచేద్దామనుకున్నాడు. తన అసిస్టెంటుండగ తను ఆ పని చేయటం ప్రిస్టేజిలా అనిపించింది.

"ఇది త్రెంచి విసిరికొట్టవోయ్."

రాఘవ శిలలా నిలబడ్డాడు జకరయ్య ఇచ్చిన ఆజ్ఞ శూలంలా తగిలింది. ఓ క్షణం కదలిక కోల్పోయాడు. "పోనీ యండి సార్. ఉంచుకోనీయండి." భయంగా నెమ్మదిగా పలికాడు. అతని సమాధానం జకరయ్యలో చిరాకును రెట్టింపు చేసింది.

"చెప్పింది చెయ్యవోయ్" అసహనంగా అరిచాడు.

తప్పదు. చేయాలి అతని చేతులు వణుకుతున్నాయి ఆమె కెదురుగ వచ్చి నిలబడ్డాడు. ఆమె తలఎత్తి కళ్ళల్లోకి చూసి కళ్ళతోనే జాలిగా నవ్వింది. అతని చేతులు కదలలేక పోతున్నాయి. చేతులు భారమయి పోతున్నాయి. తన చేతులు తనే మొయ్యలేకపోతున్నాడు. ఊపిరి ఆగిపోయేలా ఉంది. ఆమె కళ్ళు ఇంకా నవ్వుతూనే ఉన్నాయి. అతని కళ్ళు ఆమెను చూడలేకపోతున్నాయి. కళ్ళు చుట్టూ ఏవో మంటలు అల్లుకుపోయి నట్లుంది. ఆమెను చూస్తూంటే మృత్యువు చూస్తున్నంత భయం కల్గుతుంది. తల బరువెక్కిపోతుంది. చేతులు ఆ త్రాడును అందుకోలేకపోతున్నాయి. ఆమె ఆ త్రాడును అతని చేతుల కందించింది. అది ఏమిటి?

కేవలం రెండు శరీరాలను కల్పి ఉంచే బంధమే కాదు. పవిత్రతకు చిన్హ మయిన బంధం మాత్రమేకాదు. రెండు ఆత్మలు, రెండు శరీరాలు, రెండు ఆశ యాలు, రెండు జీవితాలను జన్మ కడ దాక కలిపి ఉంచే ప్రకృతి శక్తి ఆశక్తిని మనిషి రెండు ముక్కలుగా త్రుంచేస్తు న్నాడు. ఇది చూస్తూ ప్రకృతి ఎదురు తిరగదే. ప్రళయం రాదే

అంవిలోని పశు శక్తులు చేతుల్లోకి త్రోసుకొచ్చి ఆ బంధాన్ని త్రెంచేసినయి. ఈ జన్మకిక అవి కలవవు. రెండు పసుపు దారాలు విర్జీవంగా పేలవంగా ఉన్నాయి. పసుపుకొమ్ము నలిగిపోయి తునిగిపోయి దీనంగా ఉంది. అంతవరకూ మౌనంగ ఉన్న కళ్ళు రెండు కన్నీటి బొట్లను తన చేతిమీదకు వర్షించినయి. ఇంకిపోయిన గుండెల్లో నుంచి రక్తం ఇగిరి కన్నీళ్ళుగా మారి వచ్చినట్లుంది వెచ్చటి కన్నీటి బిందువులు అతని చేతిమీద నిప్పుకణి కల్లా మెరుస్తున్నయి. చేతులు దహించుకు పోతున్న అనుభూతిని పొందుతున్నాయి. అతనక్కడ నిలువలేక బయటకు పరుగెత్తాడు.

జకరయ్య ఆమెను ఆర్తిగా చూస్తు

న్నాడు. కసిగాను, చిరాగ్గానూ చూస్తు న్నాడు. అతని కామెను ఏదో చేయాలని ఉంది ఆ కసితో ఏవో ప్రశ్నలు వేస్తు న్నాడు. నోటికొచ్చినట్లు తిడుతున్నాడు. అతని ప్రశ్నలన్నిటికీ సమాధానంగా ఒక్కసారి తలఎత్తి చూసింది. కళిస్తు న్నట్లు చూసింది. ఎర్రటి బొట్టు ఇంకా ఎర్రగామారి హోమాగ్నిలా ఉంది. ఆ బొట్టును చూస్తూంటే జకరయ్యలో ఇంకా కసి పెరిగిపోతుంది.

"ఏమే లంజ! పొద్దునే ముస్తాబయ్యా వేసే" అని కసురుతున్నాడు. ఆమె మళ్ళీ తల ఎత్తి చూచింది. ఆ చూపుల్లో అతన్ని భయపెట్టే రుద్రులు కనిపిస్తు న్నారు. కంటికొసల ఎర్రదనంలో వెల్లు ఖాండాలు కనిపిస్తున్నాయి. అతనిలో ఆ బొట్టు చూస్తున్న కొద్దీ మరింత ఎలర్జీ పుడుతుంది ఆ బొట్టును కసిగా తుడి చేయాలనుంది దానికొక్కారణం అతని సుప్త చైతన్యంలో ఉన్న మతప్రేరణ కూడా కావచ్చు.

"ఏమే! ఆ బొట్టు పెట్టుకొని పసుపు రాసి పెద్ద పతివ్రతలా తిరిగితే వదిలేస్తా ననుకున్నావా. అవులిస్తే పేగులెక్కెడ తాను. ఎంవ వేషాలు ఏస్తే బయటపడ వనుకున్నావేమో రంకుముండా! దేవరలా ఆ బొట్టేమిటి! తుడిచెయ్ అది" అంటూ ఆ బొట్టును లాఠీతో చెరిపాడు. ఆ కుంకుమ నుదురంతా పాకి ఆ నుదురు రుద్రకాళి నాలికలా ఉంది కళ్ళు కోపంతో భగ్గుమన్నాయి. అతన్ని దహించేలా చూస్తున్నాయి. ఆమెను చూస్తుంటే అతనిలో భయం పెరిగిపోతుంది. గొంతు తడారిపోతుంది. టేబుల్ మీద ఉన్న గ్లాసులో నీళ్ళు సగం తాగేసాడు. ఆమె ఇంకా అలానే చూస్తుంది. ఆ కుంకుమ అతన్ని భయపెడుతూనే ఉంది. భయంతో గ్లాసులో మిగిలిన నీళ్ళు ఆమె ముఖంమీద చిమ్మాడు. కుంకుమ నీళ్ళతో కలిసి రక్తంలా కారింది. ముఖంపై కుంకుమ నీళ్ళు ఎర్రగా మెరిసి నయి. ఆ నీటి బిందువుల్లో జాతి, సంస్కృతి పగిలిపోయి ముక్కలు ముక్కలుగ కనిపిస్తుంది. ఆమెను చూసే ధైర్యంలేక ఆమెను సెల్‌లోకి తోశాడు.

* * *

పున్నమ్మ జైలుగోడ కానుకొని కూర్చుంది ఊరు చీకటంతా ఆ గదిలోనే ఉంది. ఆమెలో ఆశతోపాటు ఆకలి చచ్చిపోయింది. ఆమె శోకదేవతలా ఉంది. చీకటిలా ఉంది. కాని కాంతిలా మెరుస్తుంది. సుషుప్తిలా ఉంది. కాని చైతన్యం కడుపులో దాచుకుంది. విరాగి విలా ఉంది కాంతి, చైతన్యం విప్లవం ఇవన్నీ చీకట్లో బంధించినట్లుంది.

నైట్ డ్యూటీ కానిస్టేబుల్ నల్ల మందు మింగి నిద్ర పోతున్నాడు. జకరయ్య మెల్లగ తూలుతూ ఆ గదిలో ప్రవేశించాడు. చేతిలో బ్యాటరీ లైటు వెలుగులు కక్కుతుంది కాంతి ఆమె




మీద పడింది. అతను చీకట్లోనే మిగిలి పోయి కాంతితో చీకటిని చూస్తున్నాడు కాని కాంతిని చూడలేకపోతున్నాడు. ఆమె కదలలేదు. మెదలలేదు.

అతనామె దగ్గర జరిగాడు. మౌనంగా తలవంచు కూర్చుందామె. ఆమెను పడుకోబెట్టాడు. ఆమె ఎదురు తిరగ లేదు దానివల్ల ఫలితం శూన్యం. అతనామెను ఆర్తిగా ఆక్రమించుకుంటు న్నాడు. ఆమె కళ్ళు మూసుకొని పడుకుంది ఆమెలో చలనం లేదు. తిరుగుబాటు లేదు. ఆ శరీరం తనది కాద న్నట్లు మౌనంగా ఉంది. ఆ శరీరం ఇంకా ఎవరికి కావాలి. కావాల్సినవాడు బంధం త్రెంచుకొని పోయాడు. కసిగా అను భవించాలని వస్తున్న అతన్ని చూసి ఆమె నవ్వింది జాలిపడుతున్నట్లు జీవన సారాన్ని కాచి వడపోసిన వేదాంతిలా నవ్వింది. ప్రతిదానికోసం ఎగపడే బిడ్డను చూసి తల్లి నవ్వినట్లుంది. ఆ నవ్వు పురుషుడి బలహీనతలు చూచి స్త్రీ ఎపుడూ జాలిపడుతూనే ఉంది

జీవిత పాఠశాలలో చదువుకున్న పాఠాలతో, అనుభవాలతో రాటుతేలి పోయిన మనస్సుతో ఆమె ఆలోచిస్తుంది. అతనామెను నగ్నంగా చేస్తుంటే నవ్వు కుంది ఈ శరీరాన్ని నగ్నంగా చేసి అవమానపరుస్తాడు కాని తన ఆత్మ నత దేమీ చేయలేడుగా. చిన్నపుడు పాలు కుడిచిన రొమ్ముల్లాంటి రొమ్ముతో ఇపుడు కామదాహం తీర్చుకుంటున్నాడు. [ తన తల్లిని, చెల్లిని తనలో నగ్నంగా చూసుకుంటున్నాడని అతని మీద జాలిపడుతుందామె ] అతను పశువులా ప్రవర్తిస్తున్నాడు. పెదవులు చెంపలు కసిగా కొరుకుతున్నాడు. ఆమెకు ఎలాంటి బాధ కల్గటం లేదు ఆ గాయాలు నుంచి రక్తం కారుతుంటే తాను మరింత పరి

శుద్ధమవుతున్న అనుభూతి పొందుతుం దామె. అతని దాహం తీరాక ఆమె నుంచి వేరయి లేచి వెళ్ళిపోయాడు. మనిషికి జంతువుకి ఉన్న తేడా ఒక్కటే. జంతువులు మనుషుల్లాగా రాక్షసంగా రమించవు.

మరునటి రోజు సి. ఐ. వచ్చాడు. అతను ఆఫీసుకు రాలేదు ఊరి సర్పంచ్ గారింట్లో తన ఆఫీసులో ఫైళ్ళు వారి దగ్గరకు కదిలి వెళ్ళినయి. వాటితో పాటు బహుమానాలు కూడ. ఆ రాత్రి కోళ్ళు తలలు తెగినయి. విస్కీ బుడ్ల తలలు తెగినయి. సి. ఐ. గారు మంచి ఏర్పాట్లు చేసినందుకు ఆనందించారు. ఇంకా ఏదో కాస్త వెలితి కనిపించింది. రాత్రి పదింటికి ఆ వెలితి కూడ తీర్చారు భక్తులంతా. పున్నమ్మని బలిపశువులా అలంకరించి పంపారు. ఆ కానుకతో సి. ఐ. గారు మరింత సంబరపడి స్టాఫ్ స్వామిభక్తిని కొనియాడారు.

జీవమున్న మట్టిబొమ్మతో వారు కాలక్షేపం చేస్తూ త్రాగిన మత్తులో ఆమెను విడదుల చేస్తామని హామీ ఇచ్చారు. అందు కామె నవ్వుకుంది. తనకు ఈ ప్రపంచంనుంచే విడుదల కావాలి. అది ఆ భగవంతుడు తప్ప ఎవ్వరివ్వగలరు.

తెల్లారాక ఊరంతా గందరగోళ మయ్యింది. సి. ఐ. పడుకున్నా గది కిటికీఊచలకు చీరతో ఉరేసుకున్న శవాన్ని అందరూ వింతగా చూసారు. ఎవ్వర్నీ ఎవరూ ప్రశ్నించలేదు. ఏట వాలుగ వ్రేలాడుతున్న శవం గ్రుడ్లు వెళ్ళుకొచ్చి నగ్నంగా వికృతంగా ఉంది. ఆ నగ్నత్వాన్ని ఎవ్వరూ చూడలేక పోతున్నారు. దానికోసమై పడి చచ్చిన జీతరయ్య కూడ కళ్ళుమూసుకొని గుడ్డ కప్పాడు.

ఆ గదిలో ఆ రాత్రి ఉన్న వ్యక్తి కోసం ఆచూకీ తీస్తామని సి ఐ. గారు పూరి ప్రజలకు హామీ ఇచ్చారు. ఊరి ప్రజలు సి. ఐ వ్యక్తిత్వం మెచ్చుకున్నారు. మున్సిపాలిటీవాళ్ళు, పోలీసులు శవాన్ని ఊరేగించి పాతేసారు. తలకొరివి పెట్టేందుకు ఎవ్వరూ లేక ఊరంతా చందాలేసుకుంది పూడ్చేయటానికి.

ఆ తర్వాత రెండ్రోజులకి గన్నేరు కాయలు తిని చచ్చిపోయిన రాఘవ తల్లీ, తండ్రీ, తమ్ముళ్ళ శవాలను మున్సిపాలిటీ బండి తోలుకుపోయింది.

రాఘవ మాత్రం ఆ ఊరి పిచ్చివాడిలా ఇంకా చెలామణి అవుతున్నాడు. అతని పిచ్చి బ్రతుకు పిచ్చి ........ బ్రతుకు వ్యామోహం తీరాక అతన ఎపుడో ఒకపుడు రాలిపోతాడు ...... అతను ఈ దేశపు సగటు మనిషే... బాధ్య తెరిగిన పౌరుడే.

---

# ప్రయోగం



'మిర్రర్'

సమయం మధ్యాహ్నం పన్నెండు అయింది.

కాలింగ్ బజార్ కీచుగొంతుకలతోనూ, టైప్ రైటర్ కట కట శబ్దాలతోనూ ఆఫీసు వాతావరణం చాలా గందరగోళంగా వుంది. స్టాఫ్ అంతా మహాబిజీగా వున్నారు.

తన ముందు తెరిచివున్న ఓ ఫైలు వంక చూస్తూ సారధి బుర్ర బద్దలు అయ్యేలా ఆలోచిస్తున్నాడు. అనేక రకాలుగా హైరానపడిపోతున్నాడు. ఎంత తన్నుకున్నా సమస్యకో పరిష్కారం లభించటంలేదు.

సారధిని అంతలా తలకిందులు చేస్తున్న ఆ ఫైలు ఏ విషయానికి సంబంధించినదో అని "పైవారు" ఆసక్తి చూపవచ్చు కానీ అసలు సంగతి ఏమంటే, సారధి ఆలోచనలకు ఆ ఫైలులోని విషయానికి ఎలాంటి సంబంధం లేదు.

అది ఆఫీసు కాబట్టి ఓ ఫైలు ముందు వేసుకుని కూర్చున్నాడు. కానీ అసలు అతని మనసంతా ఇంటిమీదే వుంది. తన సమస్య కూడా గృహసంబంధమైనదే. గృహ సంబంధం అనే కంటే "గృహిణి సంబంధం" అంటే బాగుంటుంది.

సారధి బి.యస్.సి చదివి ఆ చదువుకి పొంతనలేని వుద్యోగంలో స్థిర పడి గత అయిదేళ్ళుగా ఆ ఆఫీసులో పనిచేస్తున్నాడు.

తను ఈ మధ్యే ఓ చక్కని చుక్క మెళ్ళో తాళికట్టి మూడు నెలల క్రిందట కొత్త కాపురం పెట్టాడు. ఆ చుక్క పేరు మోహిని

మోహిని నిజంగానే మోహినే. ఆమె మోహన రూపం చూసి మోజుపడి పెళ్లి చేసుకున్నాడు.

ఇప్పుడు మోహిని తన జీవితం.

ఆమె తన ప్రాణం.

ఆమెను తను చచ్చేలా ప్రేమిస్తున్నాడు.

ఆమె లేకపోతే తను పిజంగానే చచ్చిపోతాడు.

అయితే! ఆమె లేకుండా ఎక్కడికి పోతుంది?

అంటే-

ఏమో! ఏక్కడికైనా పోవచ్చు. ఇది కేవలం తన భయం మాత్రమేకాదు.

సారధి చిక్కడపల్లిలో ఓ మేడ మీద రెండు గదుల పోర్షనులో అద్దె కుంటున్నాడు ఆ మేడ పక్కన మరో మేడ వుంది. ఈ రెండు మేడలు ఎంత దగ్గరగా వున్నాయంటే, ఇవతలి మేడ మీద నుంచి గంతువేసి అవతలి మేడ మీదకి దూకవచ్చు అలాంటి ప్రక్క మేడలోని ఒక పోర్షనులో కొందరు "బ్రహ్మచారులు" వుంటున్నారు.

ఆ బ్రహ్మచారుల పోర్షను సారధి పోర్షనుకు సరిగ్గా ఎదురుగా వుంది ఆ ఇంట్లోవాళ్ళు, ఈ ఇంట్లో వీళ్ళూ నుంచుంటే మొహంలో మొహం పెట్టు కున్నట్టుగా వుంటుంది కానీ రెండూ వేర్వేరు ఇళ్ళల్లో వున్నట్టుగా వుండదు

ఆ బ్రహ్మచారులు ఉద్యోగులు కాదు. మెడిసన్, ఇంజనీరింగ్ వంటి చదువులు ఏవో గాని ఒకటి చదువు తు న్నారు. కాలేజీలకు ఎప్పుడు వెళ్తారో తెలియదు కానీ అస్తమానం రూములోనే పాటలు పాడుతూ, ఈలలు వేస్తూ కాలం గడుపుతుంటారు. చాతీ మీద ఎలాంటి ఆచ్ఛాదన లేకుండా గుండెలు తీసిన బనీటుల్లా అస్తమానం గదిలోకి, బాల్కనీలోకి తిరుగుతూ వుంటారు.

వాళ్ళు అలా ఫ్రీగా మువ్ అవు తూంటే తనకి "ప్రైవేసీ" లోపించి నట్టుగా వుంటూంది సారధికి

వెంటనే మరో చోటకి ఇల్లు మారితే సమస్య పరిష్కారం అవుతుంది. కానీ హైదరాబాదు లాంటి ఈ మహానగరంలో అనుకున్నదే తడవుగా ఇల్లు దొరకటం అనేది అసంభవం.

అంతవరకే అయితే అది ఒక సమస్య కాకపోను. కానీ సారధికి ఈ మధ్య ఒక అనుమానం బయలుదేరింది.

తను వుదయం తొమ్మిదిన్నరకి ఇంటి నుంచి బయలుదేరుతాడు. సాయంకాలం ఆరు అయితే కానీ తిరిగి ఇల్లు చేరుకోడు.

తను ఆఫీసులో వుండగా పగలంతా ఇంటిలో మోహిని ఏంచేస్తూవుంటుంది? తను ఆఫీసుకు బయలుదేరిన తరువాత ఆమెకు పని ఏమి వుండదు. ఇంట్లో తామిద్దరే కాబట్టి ఆమె కాలక్షేపంకోసం పత్రికలు, పుస్తకాలు చదువుతూ వుంటుంది ఎంత చదివినా రోజంతా చదువుతుందా? చదవదు. అలాంటప్పుడు పనిచేస్తూ వుండవచ్చు.

ఆ ప్రక్క మేడలోని బ్రహ్మచారుల వంక చూస్తూ వుంటుందేమో! వుంటుందేమో ఏమిటి? చూస్తూనే వుంటుంది. ఎదురుగావున్న మనుషులను చూడకుండా వుండాలంటే ఎలా సాధ్యం.

ఒక వేళ ఈమె చూడకున్నా, ఆ బ్రహ్మచారులు వంతుల వారీగా మోహిని పంక అదే పనిగా చూడకుండా వుంటారా?

ఎప్పటికీ కాదు.

అలా ఒకరికొకరు చూసుకుంటూ పోతే పరిచయం పెరుగుతుంది. పెరిగి అభిమానంగా మారుతుంది. అభిమానం ప్రేమగా పరిణమించవచ్చు.

ప్రేమ అంటూ కలగాలేగానీ వూరికే వుండనిస్తుందా. వుండనీయదు? వాళ్ళల్లో ఎవడో ఒకడు మోహినికి ప్రేమ లేఖ వ్రాస్తాడు.

కానీ ఇదంతా చెప్పాలంటే– ఇంత వరకూ ఆ బ్రహ్మచారులు ఎలాంటి వెధవ వేషాలు వెయ్యలేదు. కాగా మోహిని కూడా ఎన్నడూ వారిపట్ల ఆసక్తి చూపలేదు. కానీ ఎల్లకాలం పరిస్థితి ఇలాగే వుంటుందా?– ఏమో!

రేపటి సంగతి ఎవరు వూహించ గలరు?

కానీ మన బంగారం మంచిది అయి నప్పుడు ఎవరో ఏదో చేస్తారని భయ పడనవసరంలేదు.

అయితే మన బంగారం మంచిదేనా?

మంచిది అంటే?

అదే తెలియాలి

కానీ ఎలా తెలుస్తుంది?

అసలే కొత్త కాపురం కావటంవల్ల ఆమె ఎలాంటిదో ఇంకా అవగాహన కాలేదు. అలా అని ఇది ఒకరిని సంప్రదించి తెలుసుకునే విషయంకూడా కాదు.

ఒకరికి చెప్పుకోలేక, తన మనసులో దాచుకోలేక సారధి గత కొద్ది రోజులుగా బుర్ర బద్దలుఅయ్యేలా ఆలోచిస్తున్నాడు.

ఆఖరుకు సారధికి ఓ వుపాయం తోచింది.

తన బంగారం ఎంత మంచిదో తెలుసుకోవాలంటే తనో ప్రయోగం చేయాలి.

ఎదురింటి బ్రహ్మచారులలో ఒకరు వ్రాసినట్టుగా ఒక ప్రేమలేఖ మోహినికి తనే వ్రాయాలి. అది చూసిన తరువాత ఆమె ఎలా "రియాక్టు" అవుతుందో తను గమనించాలి.

వుత్తరం అందగానే– "ఎవరో తుంటరి వెధవ ప్రేమలేఖ వ్రాసాడు" అని ఆ లెటరు తనకి చూపించితే ఆమె "ప్యూర్ గోల్డు"గా భావించుకోవచ్చు. అలాకాక ఆ లెటరు విషయం తనతో సంప్రదించక గోప్యంగా వుంచితే, తన బంగారంలో కల్తీ వున్నట్టుగా భావించు కోవాలి

అనుకున్నదే తడవుగా ఓ లెటరు తయారుచేసాడు.

"మీరు చాలా అందంగా వుంటారు. కానీ మీ అందం అంతా అడవి కాచిన వెన్నెల లాంటిది మీ అందాన్ని ప్రత్యే

క్షంగా ఆరాధించాలని ఆరాటపడే వారిలో నేను మొదటివాడిని"

ఇట్లు
మీ (అజ్ఞాత) ఆరాధకుడు

మోహిని గుర్తించకుండా తన చేతి వ్రాత మార్చి, లెటరు వ్రాసి, కవరులో పెట్టి పైన మోహిని పేరుతో తన ఇంటి అడ్రసు వ్రాసాడు.

ఆఫీసు అయిన తరువాత పోస్టు బాక్సులో లెటరు డ్రాప్ చెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

* * *

"మోహినీ! అలా వున్నావేమిటి, ఒంట్లో కులాసాగా లేదా" అంటూ భార్యని ఎంతో ప్రేమగా పరామర్శించాడు సారథి, ఆఫీసు నుండి ఇంటికి వస్తూనే.

తన లెక్క ప్రకారం ఆ రోజు మధ్యాహ్నం పోస్టులో తను వ్రాసిన లెటరు మోహినికి అంది వుండాలి.

"ఎలా వున్నాను" అంది మోహిని.

"ఏదోలా వున్నావు. మొహం ప్రశాంతంగా లేదు" అన్నాడు సారథి కావాలనే.

"ఏమో! నేను బాగానే వున్నాను." అంటూ కాఫీ కలపటానికి అవతలి గదిలోకి వెళ్ళింది,

సారథి బాత్ రూమ్ వైపుకు దారి తీసాడు.

తను కాళ్ళు కడుక్కొని వచ్చేసరికి ఆమె టేబుల్ మీద కాఫీ సిద్ధంగా వుంచింది

సారథి కాఫీ తాగుతూ భార్యని గమనించసాగాడు.

ఆమె అతి సాధారణంగా కనపడింది. మొహంలో ఎలాంటి ప్రత్యేకమైన భావాలు అగుపడలేదు. అప్పటికీ ఆమెను పరీక్షించటం కోసం, కావాలని మరోసారి "నువ్వు అలా వున్నావేమిటి" అంటూ ప్రశ్నించాడు.

అయినా తను వూహించిన మార్పు రాలేదు.

ఒకవేళ లెటరు మోహినికి అందలేదేమోనని అనుమానం కలిగింది.

అనుమానం నివృత్తి చేసుకునేందుకుగాను, ఆ రాత్రి మోహిని నిద్రపోయింతరువాత నెమ్మదిగా లేచి, ఆమె లెటరు ఎక్కడ దాచివుంచవచ్చో అంచనా వేసుకుని వెతకసాగాడు.

ఆఖరుకు ఆ లెటరు ఆమె ట్రంకు పెట్టిలో చీరె మడతల మధ్య కనపడింది!

ఆ లెటర్ ఇవాళ్ళే అందినట్టు పోస్టలు ముద్ర వుంది నెమ్మదిగా దాన్ని వున్నచోటికే వదిరి ఏమీ తెలియనట్టుగా వచ్చి మోహిని పక్కన చోటుచేసుకున్నాడు.

సారథికి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. ఎంత ఆలోచించినా మోహిని తత్వం అంతుపట్టలేదు.

మరో రెండు రోజులు గడిచాయి.

మోహిని తనకు వచ్చిన లెటరు భర్తకి చూపించలేదు. కాగా తన



ప్రవర్తనలో కానీ, మొహంలో కానీ ఆ లెటరు కారణంగా ఎలాంటి తొట్రుపాటు కనపరచలేదు.

మోహిని వుద్దేశ్య మేమిటో?

ఆ లెటరు ఇంకా ఆమె పెట్టెలోనే వుంది దాని ప్రభావం అమె మనసుపై ఎలావుందో తనకి తెలియాలి. అందుకని సారధి భార్యకి మరో లెటరు వ్రాసాడు.

"నిన్న సాయంకాలం మీరు గళ్ళ చీర కట్టుకున్నారు అలాంటి చీర నాకు చాలా ఇష్టం మీరూ, మీవారు కలిసి బయటకు వెళ్ళారు. మీరు తిరిగి వస్తారేమో, ఆ చీరెలో మిమ్మలను మరోసారి చూడాలని కుతుహలపడ్డాను. రాత్రి పదిదాటేవరకూ ఎదురుచూసాను. కానీ నాకు నిరాశే మిగిలింది. ఈరోజు వుదయం మీరు ఇంట్లో తిరుగుతూ కనిపించారు. కానీ మరో చీరెలో వున్నారు

ఇట్లు

మీ (అజ్ఞాత) ఆరాధకుడు.

కనీసం రెండవ లెటరు అయినా

మోహిని తనకి చూపిస్తుందని సారధి భావించాడు.

కానీ అలాంటిది ఏదీ జరగలేదు.

రెండవ లెటరు మొగటి లెటరుతో పాటు అదే ప్రదేశంలో భద్రపరిచింది

సారధి మవునంగా తన పాత్ర పోషిస్తున్నాడు.

అంతకంటే నిర్వికారంగా మోహిని ప్రవర్తిస్తూంది. మరో నాలుగు రోజుల కాలం గడిచింది.

రోజులు గడుస్తున్నకొలదీ సారధికి మోహనిమీద అనుమానం పెరగ సాగింది.

భర్తకి తెలియకుండా పరాయి వ్యక్తి నుంచి ప్రేమ లేఖలు అందుకోవటం ఎంత సాహసం? అమాయకంగా కనపడే మోహినిలో ఇంత జాణతనం వుందా? ఆమె అందం వెనకను ఇంత వంచన వుందా? ఆమె తనతో మాట మాత్రం చెప్పకుండా ఆ ఉత్తరాలు భద్రపరుచు కుందంటే ఆ లెటర్లు వ్రాసే వ్యక్తిని ప్రోత్సహిస్తున్నట్లే కదా! ఆ వ్యక్తి ఎదురుగా వచ్చి "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నాతో వచ్చెయ్యి" అనగానే ఆమె ఆ క్షణం తనని వదిలిపెట్టి అతనితో వెళ్ళిపోయేలా వుంది

నిజంగా అలాంటి పరిస్థితి ఎదురైతే మోహిని ఏం చేస్తుందో చూడాలనే కుతూహలం సారధిలో పెరగసాగింది. పెరిగి పెరిగి అతనితో మరో లెటరు వ్రాయించింది.

"మోహినిగారు!"

మీ నుంచి ఇంకా అజ్ఞాతంగా వుండ లేను మీపై నాకు గల ప్రేమను ప్రత్యక్షంగా ప్రకటించుకునే అవకాశం కలిగించ ప్రార్థనలు. మీరు ఆనాటి గళ్ళచీరె కట్టుకుని రాబోయే శుక్రవారం మధ్యాహ్నం ఒంటిగంటకు పబ్లిక్ గార్డెనులో హెల్త్ మ్యూజియంకి రాతలయును ఆ సమయంలో మీవారు ఆఫీసులో వుంటారు కాబట్టి భయంలేదు. నేనే మిమ్మలను గుర్తించి మీ సముఖం చేరుకోగలను.

ఇట్లు
మీ (అజ్ఞాతంలో వుండలేని) ఆరాధకుడు

* * *

రాబోయే శుక్రవారం కోసం వూపిరి పిల్చుకోలేనంత "థ్రిల్" తో కాలం గడిపాడు సారధి.

ఆఖరుకు ఆ రోజు రానే వచ్చింది.

సారధి వుదయం తొమ్మిదిన్నరికి మామూలుగా ఆఫీసుకి బయలుదేరాడు.

మధ్యాహ్నంవరకూ ఎలాగో పళ్ళ బిగువున ఆఫీసులో కూర్చున్నాడు

ఒంటిగంట అయ్యేసరికి సారధి పబ్లిక్‌గార్డెను చేరుకున్నాడు

చెట్లు, పొదలు చాటుచేసుకుంటూ సారధి హెల్త్ మ్యూజియం వద్దకు వచ్చాడు. అప్పటికే మోహిని వచ్చి ఒక చెట్టుకింద నిలబడి అటూ ఇటూ చూస్తూంది.ఆమె గళ్ళ చీరెలోనే వుంది.

సారథికి గుండె వేగంగా కొట్టుకో సాగింది. ఆమె ప్రియుడుకోపంవచ్చింది. అసలు ప్రియుడనేవాడు లేడనే విషయం ఆమెకు తెలియదు. కానీ తనకి తెలిసినా ఆమె నిజంగా ఎవరితోనో వెళ్ళిపోతుం దని సారథి తంగారుపడసాగాడు

ఆమె ఇలాంటిది అని తెలిసిం తరు వాత కూడా ఆమెతో సంసారం చెయ్యాలా లేక విడాకులు ఇచ్చెయ్య టమా? అదీ ఇదీ కాకపోతే-ఇది మంచి పనికాదు అని చెప్పి ఇంటికి తీసుకువెళ్ళి తన సంసారం కాపాడుకోవాలా అని ఆలోచించసాగాడు.

ఈ విషయంలో సారథి ఓ నిర్ణయం తీసుకునేలోగా, మోహిని అంతదూరం నుంచి సారథిని గుర్తించి గబగబా అడు గులు వేసుకుంటూ అతన్ని చేరుకుంది.

సారథికి ఏం మాట్లాడాలో తోచలేదు.

ఇంతలోనే—

"ఆఫీసుతని బయలుదేరి మీరు చేసే నిర్వాకం ఇదా? ఏదీ. ఆ పగలాడిని ఎక్కడ దాచారు? మీ నాటకం ఈ రోజుతో ఆఖరు. నా మెళ్ళో తాళికట్టి నువ్వే నా ప్రాణం అంటూ నావద్ద డైలాగులు చెప్ప నానుంచి ఇవతలకి వచ్చి మరో అమ్మాయిని వెంటేసుకుని షికార్లు చేస్తారా. దానిమీద అంత ఇష్టం వుంటే మీరు నన్నెందుకు చేసుకు న్నట్టు?" అంటూ మోహిని పెద్దగా అరుస్తూ సారథిని దులిపెయ్యసాగింది.

సారథి కొయ్యబారిపోయ్యాడు.

ఇదేమిటి? ఇలా తిరగబడింది కథ.

"మొగుణ్ణి కొట్టి—అన్నట్టుగా వుంది వ్యవహారం. తన గుట్టు నా కళ్ళపడగానే ప్లేటు ఫిరాయిస్తూంది. నేను వూరుకో కూడదు," అనుకుంటూ సారథి నోరు తెరచి ఏదో అనబోయాడు.

అంతలో—

హేండ్‌బేగు తెరిచి మోహిని ఓ ఇన్ లాండ్ లెటర్ బయటకు తీసి "ఎవరో ఈ లెటర్ వ్రాసి నాకు మేలుచేసారు. మీ గురించి అంతా తెలిసిపోయింది. లేక పోతే ఇంకా ఎంతకాలం మీ రహస్య వ్యవహారం నడిచేదో. ఇక చాలు కానీ ఇంటికి పదండి" అంటూ లెటర్ సారథికి అందించి పిల్ల రౌడిని ఉపాధ్యాయుడు బడికి లాక్కువెళ్తున్నట్టుగా అతడిని ఇంటికి తీసుకువెళ్ళింది.

మోహిని అందించిన లెటర్‌లో ఇలా వుంది.

"మోహినిగారూ!

మీ భర్త మరో స్త్రీతో ప్రతిరోజూ పబ్లిక్‌గార్డెనులో తిరుగుతున్నాడు. మరి కొన్నాళ్ళకు అతను మిమ్ములను పూర్తిగా వదిలిపెట్టి ఆమెతో కాపురం పెట్టవచ్చు. మీ జాగ్రత్తలో మీ రుండగలరు.

ఇట్లు
మీ శ్రేయోభిలాషి.

తను ఎవరితోనో తిరగటం ఏమిటో,

ఈ ఆకాశరామన్న వుత్తరం మోహినికి ఎవరు రాసారో సారధికి అంతుపట్టలేదు.

సారధికి మెదడు మొద్దుబారిపోయింది గొంతునిండా దిగులు పేరుకుంది

ఏ విషయంలో నైతే తాను మోహిని అనుమానించాడో ఆమె ఇప్పుడు తనని అదే కోణంలో అనుమానిస్తుంది. ఆమె ఇప్పుడు తనని ఎంతగా అసహ్యించుకుంటుందో ఏమో! పరిస్థితి ఇలా రావటానికి కారణం ఏమిటి? ఏది ఏమైనా ఇప్పుడు తన నిర్దోషిత్వం నిరూపించుకోవలసిన అవసరం ఏర్పడింది.

ఆ సాయంకాలం వరకూ ఆ ఇద్దరి మధ్య కాలం భయంకరమైన నిశ్శబ్దంగా గడిచిపోయింది

"భోజనానికి లేవండి" అంటూ ఆ రాత్రి ముభావంగా మోహిని భర్తని వలకరించింది. ఆమె కంఠంలో అంతు లేని అసహ్యం ధ్వనించింది.

"మోహినీ! ఆ వుత్తరంలో వున్నదంతా అబద్ధం. మన ఇద్దరి అన్యోన్యత చూసి అసూయతో ఎవరో ఈ ఆ లెటర్ వ్రాసారు." అంటూ బొంగురుగొంతుతో మిగిలిన మాటలు మింగేసాడు.

అప్పటివరకూ గొప్ప సీరియస్‌గా వున్న మోహిని ఒక్కసారి నవ్వేసింది.

"ఏమి కంగారుపడకండి. ఆ ఆకాశ రామన్న లెటరు వ్రాసింది నేనే ఆ రోజున నా పేరుమీద వున్న ఓ లెటరు మీ బేగ్‌లో చూడటం జరిగింది కుతూహలంతో విప్పి చదివి పరిస్థితి అర్థం చేసుకున్నాను. ఆ మర్నాడు అదే లెటరు నాకు పోస్టులో వచ్చింది. నాపై మీకు గల అనుమానం తొలగిపోవాలంటే నోటి మాటలతో కాక, మీ ఎత్తుకి పైఎత్తు వేయాలనిపించింది అంతే.

"ఏది ఏమైనా కట్టుకున్న భార్య పై నిష్కారణంగా అనుమానం పెంచుకోవటం క్షమించరాని నేరం" అంది మోహిని.

తన ప్రవర్తనకి తానే సిగ్గుపడి సారధి తల దించేసుకున్నాడు.



# జరుగుతున్న చరిత్ర

ఇరాన్ తర్వాత అఫ్గానిస్తాన్, పిమ్మట పోలాండ్ సమస్య పెద్దదై ప్రపంచాన్ని కలవరపరిచింది. పోలాండ్ ఎర్రటి సీమ కార్మికవర్గ నాయకత్వాన మిగిలిన ప్రజలంతా సమకూడివచ్చి ఎర్రటిసీమలో రాజ్యాన్ని నిర్మాణం చేసుకుంటారు.

అటువంటి రాజ్యమైన పోలాండ్‌లో కార్మికులు కొన్ని ముఖ్యమైన ప్రాంతాలలో కీలకమైన రేవులలో, ఇంధనం (బొగ్గు) విశేషంగా లభించే తావులలో సమ్మెచేసి, ఆర్థికమైన - రాజకీయమైన కోర్కెలను వెల్లడించేసరికి, కమ్యూనిస్టేతర ప్రపంచానికి అది పెద్ద తిరుగుబాటుగా దృశ్యమానమైనది. కమ్యూనిస్టు పాలితరాజ్యాలకు ఇందులో పాశ్చాత్యుల అమెరికన్ల బాపతు ధూర్తులు దూరివచ్చి కల్లోలం పుట్టించినట్లుగా అనిపించింది. చివరకు, నిజం నిలకడ మీద తెలిసింది

పోలాండ్‌లో 1970లో, 1976లో, మళ్ళీఇప్పుడు 1980లో అలజడి కలిగింది. ఇది కమ్యూనిస్టుపార్టీ వ్యవస్థను, ఆ పార్టీ రాజ్య విధానాన్ని సవాల్‌చేసే ఆందోళన కాదు. అందరు అందుకు లోబడినవారే.

1970లో జరిగిన ప్రదర్శనలలో కొన్ని తావులలో కాల్పులవరకూ వచ్చింది. 100 మంది మరణించారు ● ప్రదర్శనలలో పాత్ర వహించిన వాలేసాను 1976లో మళ్ళీ అలజడి వచ్చినప్పుడు ఉద్యోగంలోనుంచి తొలగించారు. 1980సెప్టెంబర్ 14న రేగిన ఉద్యమంలో మొదటి కోర్కె వాలేసా పునర్నియామకం. [illegible] జరిగి [illegible] రెండో కోర్కె స్వేచ్ఛగా కార్మిక [illegible] సంఘాలను నిర్మించుకునే హక్కు. [illegible] అది నెరవేరింది. ఆదివారం నాడు కాథలిక్ ఆరాధనా మందిరాలలో జరిగే ప్రార్థనలను-ప్రవచనాలను ఆకాశవాణిలో క్రమం తప్పకుండా ప్రసారం చేస్తారు.

ఆందోళన సమయంలో కాథలిక్ ధర్మ ప్రచారకుల పాత్ర గణుతింపదగినది. ఉభయపక్షాలకు వారు నిగ్రహాన్ని బోధించి కృతకృత్యులైనారు.

చట్టరీత్యా 'స్వపరిపాలక సంఘాలను, (self governing trade unions) నిర్మాణంచేసుకునే హక్కును కార్మికులు పొందుతారు.

బూతుబొమ్మలను, బూతుకూతలను, దుర్మార్గాన్ని ప్రేరేపించే వేషభాషల ప్రదర్శనలను సహించరు. జీతాలను పెంచేటప్పుడు, అందరికంటె తక్కువ జీతాలు పొందేవారి సంగతి మొదట ఆలోచిస్తారు.

---

*మండి జగన్నాథం*

మాతలైన కార్మిక స్త్రీల విషయంలో, ఇంకా ఇతర కార్మికుల జీతభత్యాల, సదుపాయాలలో మంచి మార్పులను చేస్తారు.

1970, 1978 సంవత్సరాలలో ఉద్యోగాలు పోగొట్టుకున్న వారికెవరికైనా అన్యాయం జరిగి వుంటే, సమీక్ష ఫలితంగా దానిని సరిదిద్దుతారు.

ఒక పక్షం రోజులుగా నడిచిన ఆవేదన మూలాన ఉత్పత్తి బాగా దెబ్బ తిన్నది. దానిని దృష్టిలో వుంచుకుని కార్మికులు ఆ నష్టాన్ని పూడ్చే విధంగా కృషిచేయడానికి స్వచ్ఛందంగా పూను కున్నారు. పార్టీ సంతోషించింది.

• • •

పోలిష్ సంఘటనల తర్వాత మనకు ముఖ్యమైనది మన రాజధానిలో జరిగిన కామన్వెల్తు ఆసియా-పసిఫిక్ ప్రాంతీయ పరిషత్సమావేశాలు. ఈ సమావేశాలలో, అయిదు రోజులపాటు (సెప్టెంబర్ 4 మొదలు 8 వరకు) చర్చించని అంతర్జాతీయ విషయం లేదు. వీటిలో పాల్గొన్న సీమల పరస్పర సహకారానికి సంబంధించిన అర్థికాంశాలను దీర్ఘంగా చర్చించడం జరిగింది. ఆ సీమల పేర్లు: మనదేశం (భారత్), బంగ్లాదేశ్, శ్రీలంక, సింగపూర్, మలేషియా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఫీజి, సోలోమన్ దీవులు, టోంగా, పాపువా (న్యూగినీ), నేరూ, తువాలూ, వనురాతూ, కిరిబాత్, వెస్ట్ మోవా, (పాకిస్తాన్, బర్మా, ఇండోనిషియా లేవు) పాకిసీమను తిరిగి లోనికి తేవలెనని ఆంగ్లసీమ, సింగపూర్, ఆస్ట్రేలియా దేశాలు సూచించినవి, కాని, ఆ సీమ తిరిగి వస్తానని అన్నప్పుడు చూద్దాం. అని మన దేశంవైపునుంచి అందుకు సమాధానం వచ్చింది.

విషయజ్ఞుల భావనలో, ఈ సమావేశాల చర్చలు కంపూచియాలో సింహనాయకుని రాజ్య ప్రతిష్ఠ జరగడానికి-దానిమీద అంగీకారం ఒక మోస్తరుగా కుదిరే సూచనలున్నవని వారి అంచనా-తో స్పడగలవు.

కంపూచియాలో ఒక రాజకీయ పరిష్కారం సూత్ర మార్గాన లభ్యమైతే ఆసియా ప్రాంతంలో కొంత వేడి చల్లారవచ్చునని పంశీలుల భావన.

ఆఫ్ఘానిస్తాన్ విషయంలో ఇతర ప్రతినిధులకు మనవారికీ ముఖ్యాశాంశ భేదా ఏమీలేదు. మన ప్రధానమంత్రి ఆ సంగతిని విశదం చేసింది కాని, క్లిష్టమైన ఆ సమస్యలో ఇమిడివున్న ప్రశ్నల ద్వారా మన ప్రభుత్వం మహా తీవ్రంగా అతి గంభీరంగా ప్రకటించడానికి పూనుకోలేదు. ఆ లోపాన్ని సింగపూర్ ప్రధానమంత్రి పూర్తిచేశాడు. ఈ సమయంలో పాశ్చాత్యరాజ్యాలు మెళకువతో వర్తించకపోతే సోవియట్ యూనియన్ కు అది పెట్టని కోట; గబుక్కున దూకి అప్పుడు యుద్ధానికి పూనుకొని గెల్చ




లేకపోతే మున్ముందు రష్యాకు గొప్ప చిక్కు రాక తప్పదు; కమ్యూనిజం మహావుంటే ఇక ఇరవై ఏండ్లు నిల్చవుండ గలదు; ఆ తర్వాత అది నీగిపోక తప్పదు. దానిలోని వైరుధ్యాలు అటువంటివి; కాలక్రమేణా అవి దానిని పడగొట్టగలవు; ఆ పద్ధతి కిందైవున్న ప్రజలకు ప్రజాస్వామిక జీవనమే చాలా మెరుగు అనిపిస్తుంది. ఇదీ వరస

మలేషియా వంటి సీమలు కంపూచియాలో రష్యాను ఎక్కువగా నిందించవు; వియత్నాం రాజ్యమే వాటి దృష్టిలో అపరాధి

ఈ విధంగా మన ప్రభుత్వ వైఖరికీ ఆరి ఇతరుల వైఖరికీ ఆఫ్గన్, కంపూచియాల అంశాలలో విభేదాలు ఎక్కువగానే వున్నప్పటికీ, కామన్వెల్త్ సమావేశాలలో చర్చలు సరసంగానే జరిగినవి. ఒకర్నొకరు అర్థం చేసుకున్నారు.

తమలో తాము ఆర్థిక కార్యక్రమాల్లో సాయం చేసుకుని ప్రజ్ఞను, వనరులను [illegible]చుకోడానికి తీర్మానించుకున్నారు. పెద్దరాజ్యాలనబడేవి చిన్నరాజ్యాల పట్ల వర్తించే తీరుతెన్నులలో చిన్నవాటికి అనుకూలమైన మార్పులు రావలెననీ, పరంత ధర్మసమ్మతమైన అంతర్జాతీయ వ్యవస్థ రూపొందడానికి అందరు కలిసి కృషిజేయవలెననీ నిర్ణయించుకున్నారు.

మన ప్రధానమంత్రి చేసిన ఒక సూచనమీద కూడా దీర్ఘ చర్చ జరిగింది. అందరి ధ్యానం దానిపై లగ్నమైంది. అయిల్ సప్లయి చేసే సీమలకు అయిల్ పొందే సీమలకు మధ్య సంభాషణలు జరగవలెననీ, వృద్ధికి రావలసిన సీమలకు

చేసే సప్లయిల విషయంలో కొన్ని పదు పాయాలు ఉండలేనవీ, ఆయిల్ రాజ్యాల సొమ్ము ఇతర దేశాల వాడకానికై వస్తున్నపుడు చిన్నదేశాల స్థితిని సానుభూతితో పరికించవలెనని ఆ సూచన సారాంశం. అందరు అందుకు అనుకూలంగానే పలికినట్లు వింటున్నాము

మొత్తాన కామన్వెల్తు ప్రాంతీయ రాజ్యముఖ్యుల సమావేశాల ముఖ్య పుసుఖా తమే జరిగినందుకు మనల్ని మనం అభినందించుకోవచ్చును; సమావేశాలలో పాల్గొన్న ఇతరులకు ధన్యవాదము లర్పించడం మన విధ్యుక్త ధర్మం.

•   •   •

మన పొరుగునవున్న పాకిస్తాను ధోరణి లోగడ వ్యక్తమైన సందర్భంలో, సౌదీ అరేబియా కూడా శ్రద్ధవహించిన సందర్భంలో జమాతే-ఇస్లాం కాశ్మీర్‌లో జరిపిన హడావిడి మూలాన షేక్ అబ్దుల్లా మానసంపై వాదావివాదాలు కొన్ని రేగినవి కాని, ఆయన తన వైఖరిలో ఎట్టి మార్పురాలేదని విస్పంకోచంగా ఒక పత్రికా ప్రతినిధికి ఇటీవలనే స్పష్టీకరించాడు. ఆ స్పష్టీకరణ సారాంశ మేమనగా 'భారత దేశంలో అంతర్భాగమైనది కాశ్మీరం అని ఎన్నోసార్లు బిగ్గరగా ప్రకటించినాము. హిందువులు, ముస్లిములు అవల ఒకర్నొకరు చంపుకునే రోజుల్లో మేము భారతదేశానికి చేరి వున్నాము హిందువులు, సిఖులు, ముస్లిములు, క్రయిస్తవులు అందరు భారత దేశంలో కలిసివుండగలరని ఆ ఆదర్శాల తాత్పర్యం అందరు తల యెత్తుకని సగర్వంగా సంచరించవచ్చునని దాని అర్థం. ఒక వేళ ఈ దేశం ఆ ఆదర్శాన్నుంచి దూరంగా వెళ్ళినా మేము వెళ్ళము ఆదర్శాన్ని పునరుద్ధరించటానికే పోరాడుతాము గాంధిజీ ప్రసాదించిన శక్తితో మా యత్నాలను కొనసాగిస్తాము మన పునాది సెక్యులర్ హిందూస్తాన్. దానిని బుద్ధిపూర్వకంగా అవలంభించినాము మన ఆశయసాధనలో అది ముడిపడివున్నది. పాకిస్తాన్ స్థితి ఎంత అధ్వాన్నంగా తయారైనదో గమనించండి. గాంధిజీ చెప్పినది ఎంత సబబో ఇప్పు డర్థమవుతున్నది. ద్విజాతి సిద్ధాంతం ఎంత తప్పో కూడా తెలుస్తున్నది. పాకిస్తాన్‌లో నడిచే కథంతా భారతదేశంలో మేము కలిసిపోవడానికి చేసుకున్న నిర్ణయం సరియైనదని వెల్లడిస్తున్నది.



# పర్సులో పులి

పి. శ్రీనివాసశాస్త్రి

ఏడువందల రూపాయలు .... నలభై పైసల చిల్లర....ఆవిడ రాసిచ్చిన సరుకుల చీటీ.

ముప్పైరోజుల కష్టార్జితం .. 720 గంటలలో 480 గంటలు నిద్రపోవడానికి నిద్రపట్టకపోవడానికి తినడానికి తినక పోడానికి ఇంకా అనేకానేక అసందర్భాలకి పోగా, రోజుకు ఎనిమిదిగంటలు చొప్పున టైప్‌మిషన్‌మీద బండిబారిన తన కళ్ళు గడియారంలో సెకండ్ల ముల్లుతో పోటీపడి – టీ పడి – పడి – డి ...న ఫలితం!

పోయినందుకు మూడో వ్యక్తి నెవర్నయినా తిట్టుకోగలిగితే, నా పర్సు కొట్టేసిన పాపానికి నువ్వూ – నీ పిల్లా జల్లా, పెళ్ళాం, తల్లీ అటు ఏడేసి తరాలూ, ఇటు ఏడేసి తరాలూ దుంప నాశనమైపోవాలి అని శపించే అస్కారం ఉంటే మనసు కదో తృప్తి.

పర్సు పోవడానికి దేశంలోని వేలు లక్షల పిక్‌పాకెటర్లలో ఏ ఒక్కడూ బాధ్యుడు కాదు. కేవలం ఇదిగో ఈ నేను ...... సవాలక్ష సమస్యల దాడిలో పరధ్యానాన్ని ఆశ్రయించి మరో సమస్య తెచ్చి పెట్టుకున్నాను.

జీతాల రోజని నవ్వు అతిగించుకుని

ఎదురొచ్చే 'ఆవిడ' దరహాసం ఏమై పోవాలి?

ప్రొద్దున్నే ప్రత్యక్షమయ్యే పాలమ్మికీ, చీపురుకట్టతో నిలబడిపోయే పనిమనిషికీ, ఎందుకైనా మంచిదని ఎప్పుడూ రెండు బట్టలు ఉంచేసుకొనే దోభీకీ "ఆయన ఇంట్లో లేరని" ఆవిడ చెబుతుంటే, రెండుగదుల అద్దెకొంపలో బయటపడకుండా ఎలా దాక్కోవాలి?

మళ్లా ముప్పైయ్యొకటో తేదీ దాకా ఎలా బతకాలి (లేదా) ఎలా చావాలి?

సవాలక్ష అంకెకి కొత్తగా తోడయ్యే సమస్య లెన్ని?

? ? ? ? ?

వాటికి సమాధానా లేవి?

* * *

రెండువందల రూపాయలు... నలభై పైసల చిల్లర. పెళ్లాం రాసిచ్చినది కాబోలు సరుకుల చీటీ.

చీటీ చదివితే అది అన్నీ నిండు కొన్న కొంపలా ఉంది.

'నిండు పర్సు పోతే నిండుకున్న కొంప కెంత కష్టం?' అని ఇంకా అన లేదా శ్రీశ్రీ?

ఎవడో అక్షరాలా దౌర్భాగ్యుడు

పర్సులో రెండువందలున్నా, పర్సు ఆ బరువుని నెలకొక్కసారే, అదైనా ఓ నాలుగైదు గంటలు మాత్రమే మొయ్యగలిగేదిగా ఉంది. నలిగినంత నలిగి, చిరిగినంత చిరిగి ఇంకెలా నలగాలో, ఇంకెలా చిరగాలో తెలియ నట్టున్న ఈ పర్సు నిస్సందేహంగా దేశంలోని వేలు లక్షల చిరుద్యోగులలో ఒకడిదై ఉండాలి

ఈ డబ్బు నిజంగా శ్రమే తప్ప సుఖం తెలియని రెండు చేతులపై ఉండాలి

ఈపాటి కతగాడు జేబులు వెతుక్కోడం మిన్ను విరిగి మీదపడడం జరిగిపోయి ఉండాలి.

నీకు దొరికిన అదృష్టం విలువెంత?

ఎదుటివాడు పోగొట్టుకున్న విలు వంత!

ఇది అదృష్టవంతుడి సాపేక్ష సిద్ధాంతం!!

ఎన్నో కష్టనష్టాల కూడికలు తీసి వేతల మధ్య సతమతమవుతున్న రోజున కాలికి తగిలింది సాక్షాత్ శ్రీలక్ష్మి....

గొప్ప చిక్కొచ్చి పడిందని తం భారంతో చేతులు జేబులో పెట్టి, చూపులు నేలమీద ఆన్చి నడుస్తుంటే గొప్ప డబ్బొచ్చి పడింది.

బుర్రలో చీకటి తెరల్ని ఎత్తెయ్!

ఆనందపు బురఖా ముఖానికి తగిలిం చెయ్!

తాప్పేపు విషాదం మరచిపో.

ఏదీ — గుండెమూలల్లో మూలుగు తున్న కోరికల జాబితా బయటికి లాగు.

పెళ్లానికి కంచి పట్టుచీరా?

కంచి పట్టుచీర బాగుంటుంది కంచి

పట్టుచీర కట్టుకోకపోయినా పెళ్లాం బాగుంటుంది.

ఊ .. వ్హాట్ నెక్ట్స్ —

అమ్మాయికి వోణీయా.. ?

"వోణీలు వేసుకోకుండా బళ్ళోకి రావొద్దమ్మాయ్।" అని కోప్పడి ఇంటికి పంపేసిందిట హెడ్‌మిస్ట్రెస్।

అమ్మాయి ఏడుస్తూ తల్లికి చెబితే, తల్లి నసుగుతూ తనతో చెప్పింది.

ఆడపిల్లలకి ఫీజు వొద్దన్నది వోణీలు కొనడానికే అయ్యుండాలి వోణీలు కట్టుకొని అమ్మాయి తిరుగుతుంటే, "అమ్మాయికి పెళ్లెప్పుడు చేస్తార"ని గూఢచారి పిన్నిగార్ల పలకరింపులు.

పిల్లకు వోణీలూ, పెళ్ళికొడుకులూ ఒకేసారి బేరమాడతగును.

అవును ఒక వోణీ ఎన్ని రూపాయలు ? ఒక పెళ్ళికొడుకు ఎన్ని రూపాయలు ? ఒక పెళ్ళికొడుకును కొనే డబ్బుతో ఎన్ని వోణీలు కొనవచ్చును ?

లాభంలేదు. ఈ వోణీని మరచిపోక పోతే కథ ముందుకు నడిచేట్టు లేదు.

ఆ తరువాత నీ కోరికల లిస్టులో మూడో దేమిటో చెప్పు .. అక్కర్లేదు అక్కర్లేదు.

అడుగో ఎదురుగా —

మాంట్ గోమరీ బార్ అండ్ రెస్టారెంట్ ।

అక్కడు అన్ని రకముల స్వదేశీ విదేశీ మద్యములు సరసమైన ధరలకు (సామాన్యుడితో ధరల సరసాలా ?) దొరుకును.

ఐనా ధరలకు దొరకడమేమిటి ? డబ్బిచ్చి కొంటే దొరకడం ఎందుకవుతుంది ? ఈ చేతిలో పప్పులా ఎడివనో కొంపముంచి రోడ్డుమీద జారి పడి మరోడి కాలికి తగిలితేనే అది దొరకడం అవుతుంది.

ఏమిటో తెలుగుభాష చాలా కన్ఫ్యూజ్ చేసేస్తోందండీ మనుషుల్ని।

తెలుగు భాషను సంస్కరించాలనే ఆలోచనని, సుబ్బరంగా ఓ పెగ్ విస్కీ కొట్టేయాలన్న ఆలోచన ఓవర్‌టేక్ చేయగా మాంట్ గోమరీలోకి అలెగ్జాండర్లా నడిచాడు అచ్యుతరావు.

అలెగ్జాండర్ని చూసి బేరర్ సాల్యూట్ చేయబోయి అతని ఒడులొదులు చొక్కా, బురదంటకుండా పైకి మడచిన ఫాంటూ, గీసుకోని గెడ్డం, దువ్వుకోని జుట్టూ చూసి టక్కున ఆ పని మానేశాడు. ఐతే అలెగ్జాండర్ అతను చేయబోయిన సాల్యూట్ చిరునవ్వుతో స్వీకరించి ప్రతినమస్కారం చేసేసి దెబ్బతిన్నాడు.

ఆ దృశ్యం కన్‌పడగా తిలకిస్తున్న ఇద్దరు కష్టం తెలియని కష్టమర్లు పరాయివాడు ఫూలయినందుకు ఫూలిష్‌గా నవ్వుతున్నారు

"ఎక్స్‌క్యూజ్ మీ. కెనై సిట్

హియర్," అన్న అచ్యుతరావు ఇంగ్లీషుని గౌరవించి సీటిచ్చారు.

సీటు గెలిచిన అచ్యుతరావు చిటికేసి పిలిచాడు బేరర్ని. చిటికెలో వొచ్చి అచ్యుతరావు ఆర్డరు మోసుకుపోయిన బేరర్ ఆ తర్వాత ఎన్ని చిటికెలేసినా ఐపూ మచ్చాలేదు

తదనంతరం —

గొప్ప మీమాంస బయల్దేరింది

"మనిషి ఎందుకు చస్తాడు సార్....?" అనడిగాడు అరబుద్ధి తలకెక్కించుకొన్న పూలిష్ కష్టమర్లిద్దరిలో ఒకడు- సాక్షాత్తు అచ్యుతరావుని.

"మనిషి బతకడానికి పుట్టడం ఒక్కటే కారణమైతే - చావడానికి సవాలక్షకారణా లున్నాయి," అని తేలిగ్గా సెలవిచ్చాడు అచ్యుతరావు

ఆ సవాలక్ష కారణాలేమిటో చెప్పందే వదలనని భీష్మించాడు పూలిష్కష్టమర్లలో రెండోవాడు.

'చచ్చాను' అనుకున్నాడు అచ్యుతరావు. అంతలో బేరర్ ఆర్డర్ మోసుకొచ్చి అచ్యుతరావుని బతికించాడు.

ఐతే సహకష్టమర్లిద్దరూ అచ్యుతరావుని చంపైడం ఇంకా మానుకోలేదు. "మనిషి చచ్చిపోకుండా ఎవరైనా మందు కనుక్కుంటే ఎలా ఉంటుంది. ఇంతోటి సైంటిస్టు లున్నారు కదా. వెధవది ఏ ఒక్కడికీ ఆమాత్రం తట్టలేదెందుచేత సార్ " పాశుపతాస్త్రం వదిలాడు

వీడి నోరు నొక్కాలంటే తానో బ్రహ్మాస్త్రం వదలాలి బ్రహ్మాస్త్రం అంటే గుర్తుకొచ్చింది - అంగోస్త్రా అసలే లేవు- ఈ డబ్బులోంచి రెండు కొనుక్కోకపోతే లాభం లేదు. నవగ్రహాలలో ఏ గ్రహం మీదున్నాయి అంగోస్త్రాల ధరలు?

నవగ్రహాల పేర్లు గుర్తుచేసుకొంటూ అచ్యుతరావు గ్లాసు ఖాళీచేయడంలో మునిగిపోయాడు

* * *

బాధలకు అలవాటుపడితే కన్నీళ్లు ఉండవు.

బాధపడ్డాన్ని బాగా ప్రాక్టీసు చేసాడు ముకుందం. పర్సుపోయిందని నెత్తినోరు కొట్టుకుని ఏడవకుండా మున్సిపల్ పార్కులో బాధ కక్కేసి, పంపునీళ్లతో నోరు కడిగేసుకుని కాళీజేబుతో అత్యంత సాహసోపేతంగా ఇంట్లోకి అడుగుపెట్టి సంసార వృక్షం నీడలో పడి నిద్రపోయాడు.

* * *

కోర్కెల జాబితా తీసిన కొద్దీ ఒస్తోంది అచ్యుతరావుకి. డౌన్ విత్ ది మాంట్గోమరీ డౌన్ విత్ ఎవ్విరి బార్ అండ్ రెస్టోరెంట్ . అని తిట్టుకుంటూ రోడ్డుమీద కొచ్చాడు.

గంట వరదాకి యాభై రూపాయలు మింగిన మాంట్గోమరీ ముందు బాబిలోన్లో అలెగ్జాండర్లా దీలాపడి చౌరస్తాదగ్గర మిగిలిపోయాడు అచ్యుతరావు.

ఈ యాభై రూపాయిలతో ఇంటి కేదన్నా పనికొచ్చే వస్తువు పట్టిగెడితే బాగు-దేది అంత డబ్బూ పట్టుకెళ్ళి "విస్కీ" పోసాను అని బాధ మిగుల్చు తున్నాడు

రానీ రానీ

వస్తే రానీ

కష్టాల్ నష్టాల్

కోపాల్ తాపాల్

రానీ రానీ

కానీ.... కానీ

హాసం...లాసం

ఎదురుగా కిళ్ళీ కొట్లో అట్టహాసంగా ఉన్న (అట్టమీద అందమైన అమ్మాయి హాసం) పత్రిక కొన్నాడు.

ఈ అట్టమీద అందంగా నవ్వుతున్న అమ్మాయి పత్రికలోపల కట్ రూల్స్‌తో కట్టిన బాక్సులో బట్టలు మార్చుకుంటోంది. ఎవరో ప్రఖ్యాత ఫోటోగ్రాఫరు తీసిన వదరు ఛాయా చిత్రానికి అవార్డుకూడాను.

డబ్బుకోసం ఫోటోగ్రాఫర్ ముందు బట్టలు మార్చుకున్న అమ్మాయి పరిస్థితు లేమిటి ?

....తల దిమ్ము....కణతలు పేలి పోతున్నాయి.... పత్రికని చెత్తకుండీ లోకి విసిరేశాడు. పత్రికని కొన్నప్పుడు కంటే పారేసినప్పుడే మంచి థ్రిల్ కలిగింది అచ్యుతరావుకి.

తప్పతాగేవాళ్ళు కొందరు !

తాగి తప్పేవాళ్ళు కొందరు !!

• • •

నిన్నటి రోజే మళ్ళీ మొదలైంది ముకుందానికి. నిన్నటికీ నేటికీ తేడా అల్లా ఒక్కటే-

సాయంత్రం విందు జీతం అందు కొంటానన్న ఆశ విన్న.

మున్ముందు రోజు ఎలా గడపాలన్న దిగులు లేదు.

• • •

ఒచ్చినందుకు సంతోషం లేదు. ఒచ్చింది ఒచ్చినట్టే పోయిందని దిగులే మిగిలింది. పైగా వానన భార్య వసిగడు తుందేమోనని రోడ్డుమీదే రాత్రంతా సంచారం.

పర్సు పోగొట్టుకున్నవాడొచ్చి పీకట్టుకుంటాడాని బెదురు....

పోలీసుల అనుమానపు చూపులు....

ఎవరన్నా మీదపడి కొడతారేమోనని భయం.

తల దాచుకుందుకి తలుపులు తెరిచున్న కొంప ముందు నిలబడితే గుమ్మం దగ్గర గాజుల గలగల మనసు లోపల మూల మూలల నుంచి క్రమంగా ఓ కోరిక ఎదిగి ఎదిగి మనసంతా కమ్మే యడం.

జీవితంలో మొదటిసారి క్షమించరాని తప్పు చేసేయడం. తనకు తానే కొత్తగా చీత్కారంగా అనిపించడం.... వెళ్లానికి

చీర కొనడానికి, కూతురుకి వోణీ కొనడానికి యాభై ఆలోచించానే. చివరకు నా వ్యక్తిత్వాన్నే కోర్కెలకి అమ్మేశానే.... ఈ వయస్సులో ఏవిటి నాకీ పాపపుటాలోచన అనుకొంటూ తన తలని తానే నరికేసుకోవడం.

చివరికి పాప పరిహారం కోసం అలక్ష్యంగా కలిగిన జ్ఞానోదయంతో ఒక బాకీ తీరినా తీరనట్టేనని ఉదయం ఆఫీసు కొస్తూ విశ్వప కొట్లో బాకీ తీర్చేయడం.

డబ్బు: జిందాబాద్!

డబ్బు: జిందాబాద్!!

* * *

ఆఫీసు క్యాంటీన్‌లో కాఫీ తాగుతున్నా నీరసంగానే ఉన్నాడు ముకుందం.

కారణం ఏమిటని అడిగాడు అచ్యుతరావు.

"పర్సు పోయిందిరా చిన్నా. రెండు వందల రూపాయలు.... నలభై పైసల చిల్లర.... ఆవిడ రాసిచ్చిన పచారుల చీటీ...."

అచ్యుతరావుకి తాగుతున్న కాఫీ కరిగించిన ఇనుములా గొంతు మండించింది.

విన్నటి మాంట్‌గోమరి విస్కీ భక్ష్మవ వాంతిలా పైకి తన్నుకు రాబోయింది.

'మనిషి ఎందుకు చస్తాడు సార్?' ఒక ప్రశ్న.

అర్థరాత్రి తెరచుకున్న తలుపుల దగ్గర గాజుల గలగల... మరు నిమిషంలో ఆ ఇంటి లోపల తాను జంతువయి పోవడం.... ఒళ్లు జలదరించింది అచ్యుతరావుకి.

'మనిషి చచ్చిపోకుండా ఎవరైనా మందు కనుక్కుంటే ఎలా ఉంటుంది సార్?'- మళ్ళీ వాడిదే ప్రశ్న.

అంతా ఒక సెకను.

ఆ తరువాత దృశ్యం ఎప్పటిలాగే ఉంది.

ఎదురుగా కాఫీ తాగుతున్నది ఎప్పటి ముకుందమే.... కాని ఈ కాఫీని ఆఫర్ చేస్తున్నది ఎప్పటి అచ్యుతరావు కాదు.

"నువ్వు చాలా అదృష్టవంతుడివిరా ముకుందం. డబ్బు సులభంగా పోగొట్టుకున్నావ్. నేనెంత కష్టపడ్డానో తెలుసా!" అన్నాడు.



# బావుటాలు ఎగురుతున్నాయి

మనదేశంలో ఉన్నన్ని పండగలు ప్రపంచంలో మరే దేశంలోనూ లేవుట. మనదేశంలో ఉన్నన్ని ఉద్యమాలూ ఏ దేశంలోనూ లేవని చెప్పవచ్చు. పండగలకు కారణం, పూర్వ శిలాయుగంనుంచి వస్తున్న ఏ అమ్మవారినీ వదులుకోకుండా కొత్త దేవతలను చేర్చుకుంటున్నాం. మన దేవతల వేటకాలపు దేవతలూ, పశుపోషకుల దేవతలూ, వ్యవసాయ సంబంధమైన దేవతలూ, రాజరికపు దేవతలూ ధనయుగపు దేవతలూ రానున్న కల్కీ, మళ్లీ పుట్టనున్న బుద్ధుడూ కూడా ఉన్నారు.

ఇక ఉద్యమాల మాటకు వస్తే, ఇవి పాపం పెరిగినట్టు, లేదా జనాభా పెరిగినట్టు, అదీ కాదంటే నిరుద్యోగాలూ, దారిద్ర్యమూ పెరిగినట్టు పెరగటానికి అనేక కారణాలున్నాయి. మనం నాగరికతను అరువుతెచ్చుకోవటంలో లాగే ఉద్యమాలను అరువు తెచ్చుకోవటంలో అందెవేసిన చేతులం. బీటిల్స్ సంగీతమేమిటి, నైరూప్య చిత్రకళ ఏమిటి, అబ్సర్డ్ డ్రామా ఏమిటి, ఇతర దేశాలలో ఏ ఉద్యమం వచ్చినా, దాన్ని అరువు తెచ్చుకోవటంలో మనంత శీఘ్రంగా పరిగెత్తేవాళ్లు ప్రపంచంలో మరెవరూ లేరు (వీటికికూడా గొల్డ్ మెడల్స్ ఉంటే బాగుణ్ణు!)

మన ఉద్యమాలు అసంఖ్యాకంగానూ, ప్రజా జీవితంతో ఎలాటి సంబంధం లేనివిగానూ, గమ్యరహితంగానూ, నిష్ప్రయోజనంగానూ ఉండటానికి ఇది - అరువు కొట్టుడు - ఒకటి మాత్రమే

మరొక కారణం, మనం చేపట్టే ఉద్యమాలు చిరంజీవులు. వాటికి కాలదోషం పట్టటమంటూ ఉండదు. సంస్కరణోద్యమాలు దాదాపు అన్నీ ఇలాంటివే. సిద్ధాంతరీత్యా వీటికి లక్ష్యం ఉంటుంది. కాని శతాబ్దాల తరబడి అది సిద్ధించని కారణంచేత, ఉద్యమంతో పని తీరదు.

వేదకాలపు సంస్కృతి వెనకబడిన అనంతరం బ్రాహ్మణుల ఋషి యాజమాన్యానికి దనెలకొల్పబడిన చాతుర్వర్ణ్యం సమాజ పురోభివృద్ధికి గుదిబండగా ప్రయత్నించినది మొదలు వర్ణవ్యవస్థకు విరుద్ధంగా నా [illegible] ఎన్నో ఉద్యమాలు బయలుదేరాయి కాని ఏమీ జరగలేదు. తిరుగుబాటు చేసినవారు వేరు వేరు మతాలవారుగా మిగిలారు. చిన్న మతాలు (శైవా వైష్ణవా లాంటివి) కులవ్యవస్థను ఆమోదించి హిందూ మతంలోకి సిగ్గుల పెళ్లికూతుళ్లలాగా తలలు వంచుకుని తిరిగివచ్చాయి. ఇవి హిందూమతంలోనే అంశాలుగా మిగిలివున్నాయి. కొన్ని మతాలు (విశ్వ

కొడవటిగంటి కుటుంబరావు

బ్రాహ్మణులలాటివి) హిందూ సమాజంలో ప్రత్యేక కులాలు అయాయి.

లక్ష్యానికి తగలని ఉద్యమానికి చావు ఎందుకుంటుంది? ఈ రహస్యం మన భారతీయులకు తెలిసినట్టు మరేదేశం వారికీ తెలీదు

ఆడవాళ్లకు సంబంధించిన ఉద్యమాలు చూడండి. వాళ్లు చచ్చిన మొగుళ్లతో పాటు చితిమీద కాలిపోవటం నిషేధిస్తూ ఉద్యమం నడిచింది. ఆ ఉద్యమం నెగ్గినట్టు కనబడింది. కారణం స్త్రీలను ఉద్ధరించాలని మనలో కలిగిన జ్ఞానావేశం కాదు. వితంతువులు జీతం అడగని వెట్టివాళ్లు. ఆర్థికంగా దోచుకునేటందుకు పనికివచ్చే శ్రమజీవులు. దానికి కోరికలు లేవు. కన్నీళ్లు లేవు! మెట్టినింటివాళ్లకు విధవ కొండలు పాడి ఆవు! అమెరికాలో బానిసవిధానం అంతం కావటానికి కారణం భూతదయ కాదు: పెరిగివస్తున్న పారిశ్రామిక దేశాల్లో బానిసలకంటె కార్మికులు చాలా చౌక! బానిస అవసరాలకు యజమాని బాధ్యుడు, "స్వేచ్ఛ" గల కార్మికుడి దారిద్ర్యానికి పారిశ్రామికుడు బాధ్యుడు కాడు! సతీసహగమన నిషేధంకూడా అలాగే జరిగింది.

ఆడవాళ్లను మొగుళ్లతో పాటు దహనం చెయ్యటం పోయిన రెండు శతాబ్దాల అవతల కట్నం తేలేదని ఆడవాళ్లను మొగుళ్లు బతికుండగానే కాల్చేస్తున్నారు! ఆడవాళ్ల ఉద్ధరింపు ఉద్యమంలో వచ్చిన పరిణామం అంతా కలిసి ఇంతే!

స్త్రీ పునర్వివాహాలూ, స్త్రీ విద్యా, స్త్రీ స్వాతంత్ర్యమూ మొదలైన ఉద్యమాల సంగతి చెప్పకండి ఇంకో వెయ్యేళ్ల తరవాత కూడా మనం ఈ ఉద్యమాలను ఉత్సాహంగా నడుపుతూ ఉండవచ్చు.

ఇటీవల స్త్రీల సంవత్సరమనీ, బాలల సంవత్సరమనీ అందరూ జరుపుతూంటే మనమూ జరుపుకున్నాం. కాని వాటికి లక్ష్యం ఉన్నదంటే మనం వాటి జోలికి పోయిఉండం. సహస్రాబ్దాలపాటు ఉద్యమాలు నడపగల భారతీయులకు ఒక్క ఏడాదిపాటు జరిగేది పేలపిండి అన్న సంగతి అంతర్జాతీయ సమితివారికి తెలీదు.

కాని రాజకీయోద్యమాలూ, ప్రజలకూ ప్రజాజీవితానికీ అతిసన్నిహితమైన ఉద్యమాలూ ఉన్నాయి కావా అవి అడగవచ్చు. ఎందుకులేవూ? ఉన్నాయి.

మన దేశంలో రాజకీయ చైతన్యానికీ, అనేక రాజకీయ పార్టీలకు పుట్టకుదురైన కాంగ్రెసును తీసుకోండి. అది ప్రజాస్వామ్య బావుటానూ, సోషలిజం బావుటానూ ఎగరేసింది అది నిజంగా సోషలిజంకోసం ప్రయత్నించినా, కనీసం ధనికులకూ దరిద్రులకూ మధ్య ఉండే వ్యత్యాసాన్ని తగ్గించినా ఇంత కాలం బతికిఉండునా? అలాగే కాంగ్రెసు పార్టీ యొక్క రాజకీయ పటుత్వమంతా

వ్యక్తి ఆరాధన అనే ఒంటి స్తంభం మీద నిలబడి ఉండటం మనం చూస్తున్నాం. ఇది ప్రజాస్వామ్యానికి సంబంధం ఎంతమాత్రమూ లేని సంగతి అయినా సోషలిజం, డెమోక్రసీ నినాదాలు కాంగ్రెసుకు అంతులేని ఆయుర్దాయం పోశాయి. ఆ లక్ష్యాలను దూరంగా ఉంచగలిగినంత కాలమూ కాంగ్రెసుకు ఢోకాలేదు.

కమ్యూనిస్టు పార్టీలైనా అంతే. అవి కమ్యూనిజమునూ, విప్లవ భావాలను ప్రజలనుంచి దూరంగా ఉంచగలిగినంత కాలమూ వాటి మన్నిక గ్యారంటీ. రాజ్యాధికారం ప్రజల పరం కావటం కమ్యూనిస్టు పార్టీల లక్ష్యం. ప్రస్తుతం ప్రజలకుగల వోటింగ్ హక్కుతోనే ప్రజలు తృప్తిపడి కమ్యూనిస్టు పార్టీలను బలపరుస్తున్నారు కాకపోతే కమ్యూనిస్టు పార్టీలలో తెగలు ఏర్పడి, వర్గ కలహాలలోనో, విప్లవ సమరాలలోనో ప్రాణాలు అర్పించవలసినవాళ్ళు వర్గాంతర రాజకీయ విభేదాలకు బలి అయిపోతున్నారు. ఇలాంటి చాలు కమ్యూనిస్టు రాజకీయ చైతన్యంలో భాగం అయినంత కాలమూ ప్రజలు రాజ్యాధికార హస్తగతం చేసుకుని లెఫ్టిస్టు ఉద్యమాలు మరో రూపంలోకి పరివర్తన చెందే ప్రమాదం లేదు.

కమ్యూనిస్టుల ఉద్యమాల గురించి చెప్పుకున్నప్పుడు మార్క్సిస్టులను గురించి చెప్పుకోవటం విధాయకం. అందరికన్నా బాగా చరిత్రను విశ్లేషించి ప్రజాసామాన్యాన్ని భవిష్యత్తుకేసి నడప గలిగే శక్తి మార్క్సిస్టు మేధావులకు ఉండాలి వీళ్ళు ప్రజలలో ఆదర్శ ప్రాయంగా పనిచేస్తే ప్రతి సామాన్య పౌరుడూ ఒక లెనిన్, లేక ఒక మావోలాగా తయారుకావచ్చు కాని అది మార్క్సిజమును దుర్వ్యయం చెయ్యటం అవుతుంది. అందుచేత మా మార్క్సిస్టు మేధావులు మామూలు పౌరులకు ఎంత మాత్రమూ అర్థం కాకుండా సందర్భశుద్ధి లేకుండా మార్క్స్ ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావోలు ఎందుకు, ఎప్పుడు అన్నవన్నీ ఏకరువుపెట్టి, మామూలు జనాన్ని అదరగొట్టేస్తారు. ఆ తరవాత ఆ అట్టడుగు జనానికి, మా మార్క్సిస్టులలో అంతులేని గురి కుదురుతుంది జనానికీ, మా మార్క్సిస్టులకూ ఉండే సంబంధం శంకరాచార్యులవారికీ, వారి భక్తులకూ ఉండే సంబంధం కన్నా అంత తేడాగా ఉండదు. అన్నీ ప్రవచనాలే! అంతకు తక్కువ ఉంటే మార్క్సిస్టు మేధావికాడు

"లంజకొడకా" అన్నది తిట్టని రెండు పూటలా కడుపునిండా తిండిలేని ప్రతి నిరక్షరుడికీ తెలుసు వాడు "దొరల" చేత అటువంటి మాట రోజూ పడుతూనే ఉంటాడు. కాని ఆ తిట్టిన వాళ్ళు తిరు తల్లిని లంజ అంటున్నారని వాడు కలలో కూడా అనుకోడు "వెధవా" అని తిట్టించుకున్నవాడు తన భర్త

పోయాడనుకొన్నట్టుగా! తిట్టుకూ, తీర్పుకూ తెలపటానికి సంస్కృతంలో ఒక విసర్గ ఉపయోగించేది. "రండాః పుత్రః" (లంజ కొడుకు) తిట్టు; "రండా పుత్రః" అంటే లంజకు వాస్తవంగా పుట్టినవాడని; అది తిట్టుకాదు. కాని వీర మార్క్సిస్టులకు తిట్టు ఏదో, తీర్పు ఏదో తెలిపే పనిలేదు. అలాంటి మాటలు వాడటం తప్పని మార్క్సిస్టు రంగనాయకమ్మగారు, మార్క్సిస్టు వరవరరావు చేత ఒప్పించారట. ప్రజలు రోజూ వాడే తిట్టుమాటలమీద ఆంక్షలు పెట్టి, మార్క్సిస్టు మేధావులు ప్రజలను ఉద్ధరిస్తారన్నమాట!

ప్రజలను ఉద్ధరించటానికీ, ఆడవాళ్ళను ఉద్ధరించటానికీ, పిల్లలను ఉద్ధరించటానికీ, హరిజనులను ఉద్ధరించటానికీ ఉద్యమాలు నడపండి, బావుటాలు ఎగరెయ్యండి! కాని నిజంగా ఉద్యమం సఫలం కానీకండి. అయితే తరవాత శూన్యమే!

తాము ఉద్ధరించ దలచుకున్న వారికి వీలయినంత దూరంగా జరిగే పద్ధతి ఒకటి కొంత కాలంగా నేను గమనిస్తున్నాను. మార్క్సిస్టు సోషలిస్టు భావాలు స్త్రీల సమస్యకు పూర్వం ఎవరూ చూపని పరిష్కార మార్గం చూపాయి; వర్గరహిత సమాజంలో తప్ప స్త్రీకి పురుషుడితో సమాన హక్కులు రావు. అయితే ఈ సత్యం బాగా మనసులో పాతుకుపోయిన మహిళలు కొందరు వీర మార్క్సిస్టులైపోయి తమ లాగా ఎన్‌లైటెన్ కాని స్త్రీలపట్ల తూష్ణీం భావం చూపుతున్నారు. అత్యధిక సంఖ్యాకులైన స్త్రీలు అజ్ఞానాంధకారంలో ఉండి, తమకు ఎలాగైనా మొగుడు దొరకాలనీ, పిల్లలు కావాలనీ, "అందరి" లాగా బతకాలనీ, అందుకోసం ఎన్ని హింసలైనా పడక తప్పదని నమ్ముతున్నారు. మార్క్సిజం మానవత్వానికి పరాకాష్ఠ అయితే మార్క్సిస్టు వీరిని చూసి జాలిపడాలి, వీరి జీవితాలు మార్చటానికి తమ సర్వశక్తులూ ధారపోయాలి. కాని వీరు మార్క్సిస్టు వనిత ఈ అంధకారంలో జీవించేవారిని గడ్డిపోచం కింద చూస్తుంది. వాళ్ళ కష్టాలను ఎవరన్నా సానుభూతితో ప్రస్తావిస్తే తమకు వ్యంగ్యంగా మహా ద్రోహం జరిగినట్టు పత్రికలకు రాస్తుంది.

ఆ మాటకు వస్తే ఇంకా విప్లవ పోరాటంలోకి దిగకుండానే మానసికంగా విప్లవాన్ని ఆవాహన చేస్తున్న వీర కమ్యూనిస్టులు దేశంలో అప్పుడే సామ్యవాద వ్యవస్థ ఏర్పడినట్టూ, శ్రీశ్రీలాంటి వాళ్ళు అజ్ఞానం కొద్దీ చిత్ర నిర్మాతల కాళ్ళు [illegible]చేస్తున్నట్టూ విమర్శించటం మనకు తెలిసినదే.

ఇలాంటి దేశంలో లేచే బావుటాలే తప్ప దిగే బావుటాలు ఎందుకుండాలి? అన్నీ దాదాపు విప్లవ బావుటాలే కూడా! విప్లవం వర్ధిల్లాలి - విజయవంతం అయినా, కాకపోయినా.

---




**సో**ఫాలో వాలి, టీపాయ్ మీదికి కాళ్ళు బారచాచి సిగరెట్టు దమ్ములాగుతూ దీర్ఘంగా ఆలోచిస్తోన్న రాము డోర్ బెల్ మోగగానే వులిక్కిపడి కుర్చీలోంచి లేచి నిల్చున్నాడు. చేతనున్న సిగరెట్టుని ఆష్ట్రేలో నొక్కుతూ ఆలోచన్లో పడ్డాడు.

తన కీవూళ్ళో మిత్రులెవరూ లేరు. తన్ను కలుసుకోవలసిన అవసరం ఎవరికీ లేదు అయితే హోటల్ బాయ్, లేదా పోలీసులు, కాకపోతే తన ముఠాలోని వ్యక్తులు:- హోటల్ బాయ్ కాక మిగతా యిద్దర్లో ఎవరైనా తాను చిక్కులో పడ్డట్లే. వాళ్ళని తప్పించుకోవడం తన తరంకాదు. డోర్ బెల్ మోగిన తరువాత తలుపు తెరవక తప్పదు:-

గడియ తీసి తలుపు తెరిచి రాము గుమ్మంలో ప్రత్యక్షమైన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు. తానూహించిన ముగ్గుర్లో ఎవరూ కాదావ్యక్తి!

"ఎవరికోసం?" గుమ్మంలో నిల్చుని ప్రశ్నించాడు.

అతడు చిన్నగా నవ్వాడు. "మీకోసమే బాబూ, నన్ను లోపలికి రానియ్" అన్నాడు.

రాము పక్కకి తొలిగి దారిచ్చాడు. అతడు లోపలికి చేరుకుని "తలుపు మూసి

లోపలికిరా బాబూ! నీతో ఓ రహస్యం మాట్లాడాలి!" అన్నాడు.

రాము ఆశ్చర్యానికి అంతు లేదు. తలుపు మూసి తిన్నగావచ్చి అతని కెదురుగా కూచున్నాడు.

ఆ అపరిచిత వ్యక్తి ఓసారి రాము కేసి ఆపాదమస్తకం పరిశీలనగా చూచి, చిన్నగా నవ్వి "నేను మారువేషం లోవచ్చిన సిఐడీ ఆఫీసరో కావచ్చునని సందేహిస్తున్నావు కదూ," ప్రశ్నార్థకంగా చూసి, "కాదు! నేను నీ శ్రేయోభిలాషిని! నావల్ల నీకెలాంటి ఇబ్బందీ కలగదు! నన్ను నమ్ము బాబూ! పైగా నేను నీ సాయంకోరి వచ్చిన వ్యక్తిని!" అన్నాడు

రాము ఏమీ మాట్లాడలేదు, అతని కంతా వింతగావుంది. ఇతడ్ని ఎక్కడో చూచినట్టుంది. కాని గుర్తుకి రావడం లేదు తానీవూళ్ళో అడుగుపెట్టినప్పటి నుండి తన బుర్ర చెడిపోతోంది. ఈ వీధులూ, ఈ పరిసరాలూ, ఇక్కడి మనుషులూ తనకి పరిచయమైనవాళ్ళు లాగానే కనిపిస్తున్నారు.

"నువ్వెవరో నాకు తెలుసు, నీ గురించి నేనంతా క్షుణ్ణంగా తెలుసుకున్నాను. నీవల్ల నేనో వుపకారం పొందాలని వచ్చాను. నువ్వు నాకు వుపకారం చెయ్యడంవల్ల నువ్వు నీకు వుపకారం చేసుకున్నట్టు కూడావుంటుంది.

రాము గొంతు సవరించుకున్నాడు. "నేను మీకు సాయంచెయ్యడమేమిటి? మీరేం మాట్లాడుతున్నారో నా కర్థం కావడంలేదు" అన్నాడు.

"చెబుతాను." అపరిచిత వ్యక్తి గొంతు సవరించుకున్నాడు నేను ఒక ప్పుడు బాగా బ్రతికినవాడ్ని. ప్రస్తుతం బాగా చితికిపొయ్యాను. నాకు ఒకే పొక్క కూతురుంది. దానిపెళ్ళి కాస్తా అయిందనిపిస్తే నా బాధ్యత తీరిపోతుంది. తరువాత నేనేమయినా విచారించేవాళ్ళు లేరు. ఒక కట్నం తప్ప, దాని పెళ్ళికి అన్ని ఏర్పాట్లూ జరిగిపోయినయ్. నా యిల్లు తాకట్టుపెట్టుకుని పైకం సర్దుబాటు చేస్తానని మాటిచ్చిన పెద్ద మనిషి ఇప్పుడు ససేమిరా కుదరదంటున్నాడు. నాకు అప్పు పెట్టడానికి ఎవరూ ముందుకి రావడంలేదు ఏంచెయ్యాలో తోచడం లేదు పదివేల రూపాయలు! ఎక్కడ్నించి తేను? నాకు ఒకే పొక్క మార్గం కనిపిస్తోంది!"

"ఏమిటా మార్గం?"

"నాకు దూరపు బంధు పొకాయన వున్నాడు. ఆయన దగ్గర డబ్బు మూలుగుతోంది. ఈ మధ్య ఎక్కడో ఇంటి స్థలం కొనాలని బాంకులోంచి ఇరపైవేలు డ్రాచేసి ఇనప్పెట్టెలో దాచాడు. బేరం కుదర్లేదేమో ఆ యిరపై వేలూ ఇనప్పెట్టెలోనే మూలుగుతోంది. ఆ యిరపైవేలూ స్వాధీనం చేసుకుంటే మనిద్దరికీ ఉపయోగపడుతుంది. వాగండం

గడుస్తుంది. నీ జీవితం కుదుటపడుతుంది నీ వాటాలో సంఘంలో నాకున్న పలుకు బడిలో నువ్వు యీ జీవిత విధానానికి స్వస్తిచెప్పి గౌరవంగా బ్రతకవచ్చు."

"ఏమిటి? ఆ యిరవై వేలూ స్వాధీనం చేసుకోవాలా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు

"అవును. అందువల్ల అతడు చెడి పోయ్యేదేమీ లేదు. ఇరవై వేలు అతనికో లెక్కలోనిది కాదు పైగా మన జీవితాలు బాగుపడతయ్ నేను ఆ యింట్లోనే పని చేస్తున్నాను. నీకు ఎలాంటి ప్రమాదమూ జరక్కుండా నేనన్ని ఏర్పాట్లూ చెయ్య గలను నీ ప్రయత్నం జయప్రదం కావడనికి నా సహకారం పూర్తిగా లభిస్తుంది. చెప్పు బాబూ, నీకే అభ్యం తరమూ లేదు. కదూ?" అన్నాడావ్యక్తి.

"నేనా యింట్లో దొంగతనం చెయ్యాలా?"

"అవును బాబూ! తప్పదు! మన జీవితాలు బాగుపడాలంటే గత్యంతరం లేదు. నాకు తెలుసు, నువ్వీ కార్యాన్ని జయప్రదంగా నిర్వహించగలవు. నీకా అనుభవం వుంది. ఆ నమ్మకంతో నే నేనిక్కడికి వచ్చాను"

రాము ఆలోచన్లో పడ్డాడు.

"ఏమిటి బాబూ, ఏమిటాలోచిస్తు న్నావ్?"

"నా గురించి మీరింత క్షుణ్ణంగా ఎలా తెలుసుకున్నారు? నేను నా జీవిత విధానాన్ని మార్చుకుని గౌరవంగా బ్రతకాలని నిర్ణయించుకున్న మాట నిజమే కాని మీ కిదన్నీ ఎలా తెలిసిందో నాకర్థంకావడం లేదు.

"చెబుతాను. మొన్న రాత్రి నువ్వు కోఠీ నుండి వచ్చే బస్సులో, అంటే దాదాపు ఎనిమిది గంటలప్పుడు, ప్రయాణం చేశావు కదూ?" అని ప్రశ్నించాడా వ్యక్తి.

రాము అవునన్నట్టు తలూపాడు.

"బస్సులో జనం బాగా రద్దీగా వున్నారు బస్సు అబిడ్స్ స్టాపు చేరుకునే సరికి, ఆ రద్దీలో వాడుపు చూచుకుని, పక్కనున్న వ్యక్తి జేబులోంచి పర్సు కొట్టేసి స్టాపులో దిగిపోయ్యావు."

రాము ముఖంలో నెత్తుటి చుక్క లేదు.

"జెనరల్ పోస్టాఫీసు పక్క సందులో నువ్వూ నీ మిత్రులూ కలుసుకుని పర్సు తెరిచి చూశారు. అందులో రెండు పది రూపాయల నోట్లూ కొంత చిల్లరా తప్ప ఎక్కువేమీ లేదు. పర్సు తాలుకు వ్యక్తిని తిట్టుకుంటూ మీరు ముగ్గురూ ఓ హోటల్ కేసి నడిచారు. హోటల్లో కూచుని టిఫిన్ చేసి మళ్ళీ బస్‌స్టాప్ చేరుకున్నారు. బస్సెక్కి తిన్నగా సికింద్రబాద్‌లో దిగి క్లాక్‌టవర్ దగ్గ రున్న ఓ పార్కులోకి చేరుకున్నారు. అక్కడ దాదాపు అరగంట సేపు మీ ముతావ్యక్తుల కోసం ఎదురు చూస్తూ

తూచున్నారు. చివరికి విసుగెత్తి మీ ముగ్గుర్లో ఒకడ్ని గార్డెర్ రెస్టారెంటు దాకా వెళ్ళి చూచిరమ్మని చెప్పారు. అతడటు వెళ్ళగానే మీ యిద్దరూ మీ రహస్యాలు బైటపెట్టుకున్నారు.

"మీ ముఠాలోని వ్యక్తులందరూ నిన్న సాయంత్రం హైదరాబాద్ నుండి మద్రాసుకి వెళ్ళే రైలో వెళ్ళిపోయ్యారు. చివరి పెట్టెలో ఫుట్ బోర్డుమీద విల్చుని నువ్వు సికింద్రాబాద్ స్టేషన్ నుండి రైలు కదలగానే ఫుట్ బోర్డు నుంచి మెల్లగా క్రిందికి జారుకున్నావు. నువ్వు ఆ ముఠాలోంచి బైటపడడానికి నీ మిత్రుడు నీకు అన్ని విధాలా సాయం చేశాడు" అతడు చెప్పడం ఆపాడు.

"ఇదంతా మీకెలా తెలుసు?" రాము విస్తుపోయి అతనికేసి చూస్తూ వుండిపోయ్యాడు.

"బస్సులో పర్సు పోగొట్టుకున్న వ్యక్తిని నేనే."

"మీరా? నేను మీ జేబులోంచి పర్సు కొట్టెయ్యడం మీరు గమనించారన్న మాట?"

"అవును మరొకరైతే అరిచి అల్లరి చేసి నిన్ను పోలీసులికి అప్పజెప్పి వుండేవారు. కాని నేనలా చెయ్యలేదు. కారణం ఏమిటో మీకు తెలుసా?"

రాము తెలీదన్నట్టు తల అడ్డంగా వూపాడు.

"నేను నీలాంటి వ్యక్తి కోసమే గాలిస్తున్నాను. నా అదృష్టం కొద్దీ నువ్వు కనిపించావు. అలాంటప్పుడు నిన్ను పోలీసులికి అప్పజెబితే లాభమేమిటి? అందుచేత నేనే నీ వెంటబడి నీ రహస్యం తెలుసుకున్నాను. నువ్వెలాగూ యీ జీవిత విధానాన్ని వొదులుకోదలచుకున్నావు గనక ఏ వుద్యోగమో సద్యోగమో దొరికేదాకా బ్రతకడానికి పైసా కావాలి. నేను ప్రస్తుతం పేదవాడ్నయినా ఒకప్పుడు బాగా బ్రతికినవాడ్ని. సంఘంలో కాస్త్తో కూస్తో పలుకుబడి వుంది. చివరిసారిగా నువ్వీ ప్రయత్నం చేసి, యీ జీవిత విధానానికి స్వస్తి చెప్పి బైటపడతే మనిద్దరికీ ప్రయోజనకారిగా వుంటుంది నేను నా జీవితకాలం నీకు అండగా నిలుస్తాను. నా పలుకుబడినంతా వినియోగించి అటు నీ ముఠా వ్యక్తులవల్లగానీ ఇటు పోలీసులవల్లగానీ నీకు అపకారం జరక్కుండా చూచుకుంటాను ఏమంటావ్?"

రాము ఆలోచిస్తూ వుండిపోయ్యాడు.

అతనికి దొంగబ్రతుకు మీద మొదటి నుండీ అసహ్యంగానే వుంది. ఈ ముఠాలోంచి బైటపడాలని చాలా రోజులుగా అనుకుంటూనే వున్నాడు. తమ ముఠా యీవూళ్ళో అడుగుపెట్టినప్పటి నుండి తన వాంఛ తీవ్రం కాజొచ్చింది ఈ వూళ్ళోని వీధులూ, బజార్లూ, మనుషులూ, వాళ్ళ వేషభాషలూ యివన్నీ తనని బాగా ఆకర్షించినయ్.



ఈ చిల్లికి నా వేలడ్డం పెట్టు లేస్రా!!
అది నా వేలును కొరుకుతోంది!!!

Jayadev

తనకీ యీ వూరికీ ఏదో అవినాభావ సంబంధం వున్నట్టు ఏదో భావన. తానీ వూళ్ళోంచి బైటపడకూడదన్న బలీయమైన వాంఛ తన్నీ ప్రయత్నానికి పురికొల్పింది. తన మిత్రుడు దిలీప్ కూడా తన ప్రయత్నానికి దోహదం చేశాడు. తన ప్రయత్నం ఫలించింది. కాని తాను తన ముఠాలోంచి బైటపడగానే బ్రతకడం ఎలా? అన్న దిగులు పట్టుకుంది. అలాంటి సమయంలో యీ వ్యక్తి దేవుడిలా సాక్షాత్కరించాడు. తన బ్రతుక్కి ఓ వెలుగుబాటని చూపిస్తానంటున్నాడు. బహుశా తన బ్రతుకులో మార్పు రావడానికిది నాంది కావచ్చు. వెదుక్కుని వచ్చిన అదృష్టాన్ని కాలదన్నడం అవివేకమే అవుతుంది!–

"మీరు నా భవిష్యజీవితానికి అండగా నిలుస్తానంటే నేనీ పనికి పూనుకోవడానికి సిద్ధంగానే వున్నాను" అన్నాడు రాము.

"నువ్వు చాలా తెలివయిన వాడివి బాబూ! నువ్వీ ప్రయత్నంలో తప్పకుండా విజయం సాధిస్తావు. నీ భవిష్యత్తు వుజ్వలంగా ప్రకాశిస్తుందని మనసారా దీవిస్తున్నాను. ప్రస్తుతానికి నువ్వు నిశ్చింతగా విశ్రాంతి తీసుకో. రేపు సాయంత్రం నేను నిన్ను కలుసుకుంటాను. మన కార్యక్రమాన్ని గూర్చి కూలంకషంగా చర్చించుకుందాం" అంటూ ఆ వ్యక్తి కుర్చీలోంచి లేచి వెళ్ళిపోయాడు.

## 2

రాత్రి ఒంటిగంట దాటింది. ప్రపంచమంతా నిశాకాంత వాడిలో మైమరచి నిద్రపోతోంది. చలికాలం కావడం మూలాన వీధులు నిర్మానుష్యంగా

వున్నాయ్. కార్పొరేషన్‌వారి విద్యు ద్దీపాలు బిక్కు-బిక్కు-మంటూ వెలుగు తున్నాయ్. విశాలమైన తారు రోడ్లు విశ్చింతంగా విశ్రాంతి తీసుకుంటున్నాయ్.

రాము తన లాడ్జిలోంచి బైటపడి తారురోడ్డుమీద నడుస్తున్నాడు. అతడు వడివడిగా నడుస్తూన్నప్పటికీ అంత విశ్శబ్దంలో సైతం అతని అడుగుల చప్పుడు వినిపించడంలేదు. అతడు తొడుక్కున్నది కాన్వాస్ షూస్ కావడం మూలాన అడుగులు మెత్తగా పడు తున్నాయ్.

మెయిన్ రోడ్డు మలుపు తిరిగి క్రాస్ రోడ్డులోకి చేరుకున్నాడు. రోడ్డు అంచున కార్పొరేషన్‌వారి దీపస్తంభం క్రింద ఆగి వొక్క-సారి వీధికేసి తేరిపార చూచాడు. స్తంభాని కెదురు వరుసలో వీధి చివరినుండి మూడవ ఇంటిముందు కాంపౌండులో రెండు కొబ్బరిచెట్లు గేటుకి అటూ యిటూ జవాన్లకి మల్లే విల్చుని వున్నాయ్. గేటు ఆర్చిమీద అల్లుకున్న మల్లెతీగలు కాటోలు గాలికి తలలూపు తున్నాయ్. కాంపౌండులో చీకటి రాజ్యం చేస్తోంది. మేడమీద అద్దాల తలుపు ల్లోంచి దీపపు కాంతి ప్రసరిస్తోంది.

రాము వొక్క-సారి నలుదిక్కు-లా పరికించి, తన్నెవరూ గమనించడం లేదన్న విషయాన్ని రూఢిచేసుకుని, మెల్లగా ఆ యింటివద్దకి చేరుకున్నాడు గేటువద్ద ఆగి మూసిన గేటు తలుపుల్ని మెల్లగా తోశాడు. లోపల గడియవేసి వుంది కాటోలు తలుపులు కదల్లేదు. క్రింది భాగంలో ఎవరూ లేరు కాటోలు కిటికీల్లోంచి కూడా వెలుతురు కిపించడం లేదు.

రాము మరొక్క-సారి దిక్కు-లు పరికించి, ఒక్క- వూపున గోడెక్కి- కాంపౌండులోకి అతి సునాయాసంగా దూకేశాడు. కాంపౌండులో వెలుతురు లేకపోవడం మూలాన పైకి వెళ్ళే మార్గం వెతకడంలో అట్టే కష్టమని పించలేదు. ఇంటి వెనుక బాత్‌రూము నానుకుని మురికినీటి గొట్టం పైకి వెళు తోంది. రాము ఒక్క-సారి ఆ పైప్‌కేసి మేడమీద రెయిలింగ్‌కేసీ దృష్టి సారించి తొడుక్కు-న్న కాన్వాస్ షూస్ సైతం విప్పకుండానే గబ గబా గొట్టంమీదికి ప్రాకసాగాడు. గొట్టంమీంచి రెయి లింగ్ నందుకుని సునాయాసంగా మేడ మీదికి చేరుకోగలిగాడు.

మేడమీద హాల్లో దీపం వెలుగుతోంది. రాము అడుగుమీద అడుగేసుకుంటూ అతి జాగ్రత్తగా హాలుకేసి నడిచాడు. హాలు తాలూకు ఫ్రెంచ్‌విండో బార్ల తెరిచివుంది. రాము మెల్లగా విండో దగ్గరికి చేరుకుని గ్లాస్‌డోర్ మీద వ్రేళ్ళతో టకటక లాడించి చప్పుడు చేశాడు చప్పుడు విని ఎవరూ కదిలినట్టు అలికిడి కాలేదు. మెల్లగా విండోలోంచి లోపలికి తొంగిచూశాడు. హాలు మధ్య

పరిచిన చాపమీద వెల్లకిలా పడుకుని నిద్రపోతున్నాడో వ్యక్తి. బహుశా నౌకరు కాబోలు.

రాము మరోసారి కిటికీ తలుపుమీద చప్పుడుచేసి నౌకరు గాఢనిద్రలో వున్నాడన్న విషయాన్ని రూఢిచేసుకుని, ధైర్యంగా కిటికీ మీద కెక్కి శబ్దం కాకుండా లోపలికి జారాడు. అడుగుమీద అడుగేసుకుంటూ వెళ్ళి నౌకరు దగ్గరికి చేరుకున్నాడు. జేబులోంచి కర్చీఫ్ తీసి అతని ముక్కుకి అదిమిపెట్టి రెండు సెకండ్ల కాలం వుంచి మెల్లగా అక్కడ్నించి కదిలాడు. కుడి వైపున వున్న గది దగ్గరికి చేరుకుని మూసివున్న తలుపుల్ని మెల్లగా తోశాడు. లోపల గడియపెట్టకపోవడం మూలాన తలుపులు తెరుచుకున్నాయ్. గదిలో నీలం రంగు బెడ్‌రూము లైటు వెలుగుతోంది రెండు మంచాలమీద ఇద్దరు వ్యక్తులు ముసుగులు తన్ని పడుకుని వున్నారు. రెండు మంచాలకీ మధ్య ఓ టీపాయ్ వుంది. టీపాయ్ మీద ఫ్లవర్‌వాజ్ కనిపించింది

రాము అతి జాగ్రత్తగా అడుగులు వేస్తూ టీపాయ్ దగ్గరికి చేరుకుని, ఫ్లవర్ వాజ్‌ని చేతిలోకి తీసుకున్నాడు. వాజ్ లోని ప్లాస్టిక్ పూలగుత్తిని తొలగించి, వాజ్‌లోంచి తాళాల గుత్తిని పైకితీశాడు. ఫ్లవర్‌వాజ్‌ని యధాప్రకారం టీపాయ్ మీద పెట్టి తాళాల గుత్తితో గదిలోంచి బైటపడి తలుపులు రెండూ మూసి, బైట గొళ్ళెంపెట్టి, ధైర్యంగా ఎడమ వైపున వున్న గదికేసి నడిచాడు

మూసిన గది తలుపులికి ఓ చిత్రమైన తాళం కప్ప వ్రేలాడుతోంది. తాళంకప్ప మీద నాలుగు వరుసల్లో, వరుసకి ఆరేసి చొప్పున మొత్తం ఇరవైనాలుగు మీటలు బటాణీ గింజల సైజులో వున్నాయ్. ఒక్కో మీటమీద ఒక్కో ఇంగ్లీషు అక్షరం A నుండి వరుసగా X వరకు తెల్లగా మెరుస్తున్నాయ్

రాము తనకి బాగా పరిచయమున్నవాడికి మల్లే తాళం కప్పని చేతిలోకి తీసుకుని, వరుసగా R-A-M-U అనే అక్షరాలను నొక్కాడు. తాళం కప్ప కిమ్మనకుండా చేతిలోకి వూడివచ్చింది.

రాము తలుపులు తెరిచి గదిలోకి నడిచాడు. ఎదురుగా లక్ష్మీపఠం మీద చిన్న జీరో వాట్ బల్బు వెలుగుతోంది వెలుతురు ఎక్కువగా లేకపోవడం మూలాన గదిలో ఎక్కడ ఏముందీ స్పష్టంగా కనిపించడంలేదు. అందుచేత తెరిచిన తలుపులు దగ్గరికివేసి స్విచ్ బోర్డు నొక్కి గదిలో దీపం వెలిగించాడు. ఎదురుగా కనిపిస్తోన్న లక్ష్మీపఠం క్రిందనే వుంది ఇనప్పెట్టె!

రాము తిన్నగా ఇనప్పెట్టె దగ్గరికి చేరుకుని తాళం చెవుల సాయంతో ఇనప్పెట్టె తలుపులు తెరిచి సొరుగులన్నీ లాగి చూశాడు. ఓ సొరుగులో

వెండి సామానూ మరో సొరుగులో బంగారు నగలూ ప్రత్యక్షమయినయ్. కాని రాము వాటిని ముట్టుకోలేదు. మరో సొరుగు లాగాడు. అందులో రెండు వంద రూపాయల కట్టలు కొత్తవి దర్శనమిచ్చాయి. అతని కళ్లు మెరిశాయి. ఆ రెండు కట్టల్నీ తీసి తన రెండు జేబుల్లోనూ కుక్కుకుని, సొరుగుల్ని మూస్తుండగా, ఎక్కడ్నించో సన్నగా, కర్ణపేయంగా, ఏదో సంగీతం వినిపించ సాగింది.

'కోడి వాక కోనలో- పుంజు వాక కోనలో
పిల్ల లేము తల్లడిల్లె- ప్రేమలేని కానలో '

రాము ఆ పాట వింటూ తన్ను తాను మరిచిపోయ్యాడు తన్మయత్వంలో వుండిపొయ్యాడు. అతనికి తెలీకుండానే కళ్ళల్లోంచి అశ్రువులు చెంపల మీద కాలువలు కట్టాయి.

కొంత సేపటికి పాట ఆగిపోయింది. కాని రాము అక్కడ్నించి కదల్లేదు. అతని స్మృతిపథంలో తన బాల్య స్మృతులు సినిమా రీలుకి మల్లే కదల సాగాయి.

అప్పుడు తనకి ఎనిమిదేళ్లుంటాయేమో ఓ సాయంత్రం తాను స్కూలు నుండి ఇంటికి తిరిగివచ్చేసరికి, ఎప్పుడూ గుమ్మంలో నిల్చుని తనకోసం ఎదురు చూచే అమ్మ జాడ కనిపించలేదు ఇల్లు బోసిగా ఏదో పోగొట్టుకున్నదానికి మల్లే కనిపించింది. నౌకర్లు ఓ మూల కూలబడి గుసగుస లాడుకుంటున్నారు. తాను అమ్మ కోసం గాలిస్తూ అమ్మ గది లోకి వెళ్ళేసరికి, మంచం మీద పడుకుని దిండులో తల దూర్చి వెక్కి వెక్కి ఏడుస్తోంది. అమ్మ ఎందుకు ఏడుస్తోందో తనకి అర్థంకాలేదు. తనకీ ఏడుపు ముంచుకొచ్చింది. బావురుమని ఏడుపు లంకించుకున్నాడు.

అమ్మ ఏడవడం ఆపి, తన్ను ఓదార్చి తిన్నగా బాత్ రూముకేసి నడిచింది. ఆది నిమిషాల్లో బట్టలూ అవీ సర్దేసుకుని తన్ను వెంటపెట్టుకుని స్టేషన్ కేసి బయలుదేరింది. నౌకర్లు అమ్మ వెంట స్టేషన్ దాకా వచ్చి సాగనంపారు తాము ఆ రాత్రే అమ్మమ్మగారి యిల్లు చేరుకున్నారు.

అమ్మమ్మ అమ్మని ఏవేవో ప్రశ్నలు వేసింది. ఆ తరువాత అమ్మా అమ్మమ్మా యిద్దరూ కలిసి కొంతసేపు ఏడ్చుకున్నారు. తాతయ్య మాత్రం ఎవరి మీదనో కారాలు మిరియాలు నూరుతూ కాలుగాలిన పిల్లిలా ఇంట్లోకీ బైటకీ తిరుగుతూ పెద్ద పెద్దగా మాట్లాడుతున్నాడు.

అమ్మా తానూ అమ్మమ్మగారింట్లోనే వుండిపొయ్యారు తాతయ్య తన్ను ఆ వూళ్ళోనే స్కూల్లో చేర్పించాడు తనకి అక్కడ హాయిగానే వుండేది అమ్మమ్మ




తన్ని ముద్దుచేసేది తాతయ్య తనకి చాక్లెట్లూ. బిస్కెట్లూ ఏవేవో కొని పెట్టే వాడు ఎదురింటి కుర్రాళ్ళతో తాను ఆడుకునేవాడు కాని అమ్మ మాత్రం అప్పుడప్పుడూ ఓ మూల చేరి కంట తడి పెట్టుకునేది

అలా వొక్క సంవత్సరం గడిచి పోయిందేమో, ఒకనాటి సాయంత్రం తాను స్కూలు నుండి యింటికి వెళ్ళు తుండగా దార్లో నాన్నగారు కనిపించారు తనకోసం పళ్ళూ మిఠాయీలూ, బొమ్మలూ ఏవేవో కొని తెచ్చారు. 'ఇవన్నీ నీకే బాబూ, మనం మనింటి కెళదాం అక్కడ నీకింకా బోలెడు కొని పెడతాను! వొస్తావా?' అన్నాడు. ఆ బొమ్మల్ని చూసేసరికి అమ్మను మరిచి పోయి 'అలాగే' అన్నాడు. నాన్నగారు నన్ను కార్లో తమింటికి తీసుకు వెళ్ళిపోయాడు.

అంతే తన బ్రతుకు వొంటరిదై పోయింది. స్కూలుకెళ్ళి ఇంటికి తిరిగి వచ్చేసరికి అమ్మకి బదులు ఆయా ఎదు రొచ్చేది తనకేది కావాలన్నా ఆయాని అడగాల్సిందే, నాన్నగారు ఎప్పుడో తప్ప కనిపించేవారు కారు. అమ్మని చూడాలని వుందంటే కసిరికొట్టే వారు. "నీకిక్కడేం తక్కువైంది' దాని పేరెందుకెత్తుతావ్" అనేవారు అమ్మని తలుచుకుని తాను కుమిలికుమిలి ఏడ్చే వాడు. నవుకర్లు తన్ని ఓదార్చేవారు.

ఒకరోజు ఆయాతో బాటు తాను సిని మాకి వెళ్ళాడు ఆ సినిమా పేరేమిటో తనకి గుర్తులేదు ఆ సినిమా చూస్తు న్నంతసేపూ అమ్మ తనకళ్ళముందు కదు

లాడుతూనే వుంది. తనకి తెలికుండానే తన కళ్ళల్లోంచి కన్నీరు కారుతూనే వుంది. అందులోనే యీ పాట! యీ పాటంటే తనకెంతో ఇష్టం! రేడియోలో యీ పాట వినిపించినప్పుడల్లా తాను సర్వస్వం మరచిపోయి వెక్కి వెక్కి ఏడ్చేవాడు.

అమ్మను చూడాలన్న కోరిక తనలో రోజు రోజుకీ తీవ్రం కాజొచ్చింది. నాన్నగారి నడిగితే పంపరు సరికదా, కొప్పడతారు కూడా అందుచేత ఎవరికీ తెలీకుండా ఇంట్లోంచి పారిపోయి అమ్మను చూడాలని నిశ్చయించు కున్నాడు

ఒకనాటి సాయంత్రం స్కూల్లోంచి ఇంటికి రాకుండా అటే స్టేషన్ కెళ్ళి, అమ్మమ్మగారి వూరికి టిక్కెట్టు తీసుకుని రైలెక్కాడు. రైలు అమ్మమ్మగారి వూరు చేరుకోవడం ఆలస్యంకావడం మూలాన, ఆ రాత్రి భోజనం చెయ్యక పోవడం మూలాన వాళ్ళు మరిచి నిద్ర పొయ్యాడు

ఆ నిద్రలో ఎవడో రాక్షసుడు తన కబంధహస్తాలతో అమాంతం పైకెత్తి, ఏ అఘాతంలోకో విసిరివేసినట్టయింది. అంతే, తన కేమీ గుర్తులేదు కొంత కాలం హాస్పిటల్లో పడివున్నాడు. తనకు నయమైన తరువాత ఎవరో తన్ను తమ వెంట తీసుకెళ్ళారు వాళ్ళే తిండీ బట్టా యిచ్చేవారు. వాళ్ళు ఏం చెబితే అది చేసేవాడు. గతం తనకి గుర్తులేదు. ఇప్పటిదాకా ఆ ముఠా చెప్పుచేతల్లోవుండి యీ దొంగబతుకు బ్రతుకుతున్నాడు

తల్లీ, తండ్రీ, అమ్మమ్మా, తాతయ్యా ఎవరూ తనకి గుర్తులేదు. వాళ్ళెవరో ఎక్కడున్నారో తనకి తెలీదు ఇప్పుడు ఈపాట వినేదాకా తన గతం తనకి గుర్తులేదు. తన తల్లి ఎవరో, ఆమె ఎక్కడుందో? తన తండ్రి యిప్పటికైనా ఆమెను చేరదీశాడో లేదో!—

రాము ఆలోచిస్తూ మెల్లగా వెనక్కి తిరిగాడు. ఎదురుగా గుమ్మంమీద గోడకి వ్రేలాడుతోన్న పెద్దసైజు ఫోటో మీద పడిందతని దృష్టి. కళ్ళు పెద్దవిచేసి ఆ ఫోటో కేసే దృష్టి సారించి "అమ్మా!" అని గట్టిగా కేకపెట్టి నేల విరుచుకు పడ్డాడు. తల గోడకి కొట్టుకుని రక్తం చిమ్మింది. దాంతో అతడు స్పృహ కోల్పొయ్యాడు.

రాము కళ్ళు తెరిచే సరికి తాను తన తల్లి వొడిలో వున్నాడు తల్లి పక్కనే నిల్చుని ఆత్రంగా అతనికేసి చూస్తున్నాడు తండ్రి. అపరిచిత వ్యక్తి కూడా అక్కడే వున్నాడు.

"అమ్మా!" అన్నాడు రాము ఆప్యాయంగా.

"అవును బాబూ! నేను మీ అమ్మనే. ఎలావుంది బాబూ?" అంది తల్లి అతని తలకి కట్టిన కట్టును సున్నితంగా నిమురుతూ.

"నాకేం ? బాగా నే వుందమ్మా! ఇంతకీ నువ్విప్పుడు డెక్కడున్నావమ్మా? నాన్నగారు నిన్ను యింకా తీసుకెళ్ళ లేదా? నువ్వింకా అమ్మమ్మగారింట్లోనే వున్నావా?

"నాన్నగారు పూర్తిగా మారిపోయరు బాబూ! నేనిప్పుడు మనింట్లోనే ఉన్నాను. ఇది మనిల్లే బాబూ!" అంది తల్లి చెమ్మ గిల్లిన కళ్ళని పమిటచెంగుతో తుడుచు కుంటూ.

"అవును బాబూ! నేను దుర్మార్గుడిని అందువల్ల నేను ఇంతకాలం పుత్రశోకం అనుభవించాల్సివచ్చింది," అన్నాడు తండ్రి పూడిపోయిన గొంతుకతో.

రాము తృప్తిగా వూపిరి పీల్చు కున్నాడు. "అయితే ఇంతకాలం మీరేమ య్యారు ? నేనిక్కడి కెలా వచ్చాను ? ఇప్పుడు నాకేమయింది?" ప్రశ్నలవర్షం కురిపించసాగాడు. వెంటనే ప్రక్కకి తిరిగి అపరిచిత వ్యక్తికేసి తేరిపార చూచి "మీరు మా లాయర్ విశ్వనాథం గారు కదూ?" అని ప్రశ్నించాడు.

లాయర్ విశ్వనాథం చిన్నగా నవ్వి, "అవును బాబూ! నేను విశ్వనాథాన్నే! నీకేమయిందో! ఇంతకాలం మేమంతా ఏమయ్యామో వివరంగా చెబుతాను. విను !" అన్నాడు గొంతు సవరించు కుని చెప్పడం మొదలుపెట్టాడు. "దాదాపు ఎన్నిమిదేళ్ళనాటి మాట! అప్పుడు నీకు పదేళ్ళుంటాయేమో. ఒకనాడు స్కూలు నుండి ఇంటికి రాకుండా అమ్మను చూడా లన్న కోరికకొద్దీ అమ్మమ్మగారి వూరికి బయలుదేరిన విషయం నీకు జ్ఞాపకం వుండొచ్చు. నీవు ప్రయాణంచేసిన రైలు మీ అమ్మమ్మగారి వూరిసమీపంలో ప్రమా దానికి గురికావడం, నీకా ప్రమాదంలో తలమీద బలమైన దెబ్బ తగలడం మూలాన జ్ఞాపకశక్తి పోగొట్టుకున్నావు. అంతే గతాన్ని పూర్తిగా మరచిపోయ్యా వన్న మాట! నువ్వెవరో నీ తల్లిదండ్రు లెవరో, వాళ్ళెక్కడుంటారో మొదల యిన వేవీ నీకు గుర్తులేదు అలాంటి స్థితిలో ఓ దొంగలమురాచేత చిక్కుబడి పోయావు వాళ్ళే నీ తలమీద గాయాన్ని నయంచేసి నిన్ను తన ముఠాలో చేర్చు కున్నారు. జేబులు కొట్టడం, దొంగత నాలు చెయ్యడం నీనైజానికి విరుద్ధమైనా పరిస్థితుల ప్రభావంతో నువ్వు చెయ్యక తప్పింది కాదు మీ ముఠా యీ వూళ్ళో అడుగుపెట్టిన మొదటి రోజే నాకంట బడడం, అందులో నువ్వుండడం, నిన్ను నేను గుర్తుపట్టడం వల్ల, నేను అను క్షణం మిమ్మల్ని రహస్యంగా వెంటా డుతూ మీ అందరి రహస్యాలూ తెల్సుకో గలిగాను నీకీ జీవిత విధానం మీద విరక్తి పుట్టిందనీ, యీ ముఠాలోంచి తప్పించుకు బైటపడాలని నువ్వు ప్రయ త్నించడం నాకెంతో సంతోషాన్ని కలి గించింది.

"అయితే నువ్వు నిజంగా మా

రామువో, లేక అలాంటి రూపురేఖలున్న మరో వ్యక్తివో తెలుసుకునేందుకు చిన్న నాటకం ఆడాను. ఎలాగైతేనేం, నా ప్రయత్నం ఫలించింది.

"ఇనప్పెట్టె వున్న గది తలుపుకి వ్రేలాడుతోన్న తాళం కప్పను నీపేరు తోనే తెరవాలి. ఆ విషయం నాకూ మీ యింట్లోవాళ్ళకి తప్ప మరెవ్వరికి తెలీదు. నువ్వా తాళంకప్పని అతిసునాయాసంగా తెరవడంతో నువ్వు రామూ వేనన్న విషయం తేలిపోయింది.నీకా తాళం కప్ప చిన్నప్పటినుండీ పరిచయమేగనక అట్టే ఆలోచించకుండా తెరవగలిగావు

"చిన్నప్పుడు ఏపాట నైతే నువ్వు మరీమరీ వినాలని కోరుకునేవాడివో ఆ పాట విన్న కదిలించివేయడం, మీ తల్లిగారి ఫోటోని నువ్వు గుర్తుపట్టడం మొదలైన సంఘటనలు కూడా నై విష యాన్నే బలపరచాయి. ఎలాగైతేనేం నువ్వు మీ తలిదండ్రులకి దక్కావు" అన్నాడు లాయర్ విశ్వనాధం సంతృప్తిగా.

"ఇదంతా లాయర్‌గారి చలవే బాబూ, వారు మన శ్రేయోభిలాషులు గనక యింత శ్రమకోర్చి నిన్ను మళ్ళీ ఇల్లు చేర్చగలిగారు. వారికి మన కుటుంబం యావత్తు ఋణపడిపొయ్యాం ! ఈ ఋణాన్ని ఎన్ని జన్మలెత్తినా తీర్చుకో లేము" అన్నాడు రాముతండ్రి కృతజ్ఞతా పూర్వకంగా.

"అంతా దైవేచ్ఛ! ప్రయత్నం మనదే కాని ఫలితం మన చేతుల్లో లేదు. మనకి దైవానుకూలం వుండబట్టే తప్పిపోయిన రాము మళ్ళీ మన కంటబడడం జరిగింది. అతడు మన జ్ఞాపకశక్తిని పుంజుకోవడం మామూలు విషయం కాదు. తన తల్లి ఫోటోని చూసి, సర్వస్వం మరచిపోయి క్రింద కూలడం, తలకి దెబ్బ తగలడం మళ్ళీ తన పూర్వస్మృతుల్ని పుంజు కోవడం యివన్నీ చూస్తోంటే మానవ ప్రయత్నం పేరుకి మాత్రమే నని పిస్తోంది!" అన్నాడు లాయర్ విశ్వ నాధం.

అందరూ ఒకసారి ఆ భగవంతుడికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

———

# మెరుపులూ - మరకలూ !

మీ ఆవిడ సినిమా కెళ్లాలనే పట్టుదలను మొహంలో పటిష్టంగా ప్రదర్శించి నప్పుడు, మీరు ఇంట్లో కూర్చుందామనుకోవడం మంచిది కాదు.

*

ఓ వ్యక్తికి పెళ్లి అయిందో లేదో తెలుసుకోవడానికి సులభమైన సూత్రం: అతను పక్కన ఓ స్త్రీతో కారు నడుపుతూన్నప్పుడు గమనించండి. అతను రెండుచేతులూ స్టీరింగ్‌మీద ఉంచుకొని కారు నడుపుతూంటే అతనికి పెళ్ళి అయినట్లే భావించవచ్చు.

*

ఒక రాష్ట్రంలో అసమ్మతివర్గం బలం పెరిగిపోగా, ముఖ్యమంత్రి తన పదవికి రాజీనామా చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. తెలివైన ఆ ముఖ్యమంత్రి తన బలగంతో సహా ఓ రోజు ఉదయం అసమ్మతి వర్గంలో చేరిపోయి, మళ్లీ ముఖ్యమంత్రి అయ్యాడు.

*

మనకు అగుపించే ఆకాశానికి ఆకారం లేదు రైలుపట్టాల మధ్య నిలబడి చూస్తే రెండు పట్టాలు ఎక్కడో దూరంగా కలిసిపోయినట్టు కనిపిస్తాయి. కాని నిజంగా కలవ్వు కదా! అందుకే మనం కళ్లారా చూసినా కొన్నింటిని నిజాలని నమ్మకూడదు.

*

తనకున్న బాధల్నీ, ఆందోళనలనూ అతను సిగరెట్లు తాగుతూ ఆలోచించు కొనేవాడు. ఇప్పుడు ఇతరత్రా సమస్యలకంటె సిగరెట్లే అతన్ని మానసిక ఆందోళనకూ, బాధలకూ గురిచేస్తున్నాయి.

*

జాతీయ ఆరోగ్య సేవాసంస్థకు ఓ వ్యక్తి దరఖాస్తు పెట్టుకున్నప్పుడు — దారిద్ర్యానికి గురికాకుండా టీకాలు వేసే డాక్టరు చిరునామా తెలియ జేయవల్సిందిగా.

---

కల్యాణ కృష్ణ

---




సాయంత్రం ఆరు దాటింది

రివ్వుమని వీస్తున్న చలిగాలివి చీకటి కిరణాలు కౌగిలించుకుంటున్నాయి. రోడ్డుమీద జనసంచారం ఎక్కువగా లేదు.

ఆమె వడివడిగా నడుస్తోంది వుండి వుండి అనుమానంగా వెనక్కి తిరిగి చూస్తోంది

కొంచెందూరంలో వాళ్ళిద్దరూ తనను అనుసరిస్తూనే వున్నారు వాళ్ల మాట్లాడుకుంటున్న మాటలు తనకు వినిపిస్తూనే వున్నాయి.

"కొంచెం వేగంగా నడవరా! నీకంటే ఆడపిల్ల నయం! ఆ అమ్మాయి ఎంత గబగబా నడుస్తోందో చూడు!"- ఒకడు రెండోవాణ్ణి తొందరపెడుతున్నాడు.

"ఏడిశావ్ లే! నేను నడవలేక కాదు!.. కానీ నాకు ఇష్టంలేదు!"

"దద్దమ్మలా మాట్లాడకు! మగా డన్నాక తెగింపు కావాలి!"

మళ్లీ ఆమె వెనక్కి తిరిగి వాళ్ళను చూసింది.. ఆ వందెదీకట్లో వాళ్ళ ముఖాలు స్పష్టంగా కనిపించటంలేదు

"ఇలా ఎంతదూరంరా వెళ్లేది?.... ఇంక వెనక్కి పోదాం!" ఒకడంటున్నాడు.

"ఇంతవరకూ వచ్చి వెనక్కి వెళ్ళటం ఏమిట్రా ఫూల్?.... చూడు.... అప్పు డప్పుడు ఆ అమ్మాయి మన వైపు చూస్తోంది!.... వ్యవహారం ఏమిటో పూర్తిగా తేల్చుకుందాం!"- ఉత్సాహంగా అన్నాడు రెండోవాడు.

దూరంగా ఆకాశంలోంచి ఉండి ఉండి మెరుపుతీగలు వేలరాలుతున్నాయి.... అంతకు ముందు రెండు రోజుల్నుంచీ వర్షం కురిసినందువల్ల రోడ్డంతా ఇంకా చెమ్మగానే వుంది.... పరికిణీ కుచ్చిళ్ళు కొంచెం ఎత్తిపట్టుకుని- జాగ్రత్తగా నడుస్తోంది ఆ అమ్మాయి.... అయినా ఆ నడక వేగంగానే వుంది.

ఆమె మలుపు తిరిగి బస్టాండులోకి వచ్చింది.

అక్కడ జనం పల్చగా ఉన్నారు.... ఓ బస్సు కదలటానికి సిద్ధంగా వుంది.

'సూర్యాపేట, నార్కేట్‌పల్లి, హైద రాబాద్'- అంటూ క్లీనరు కుర్రాడు కాబోలు అరుస్తున్నాడు బస్సుముందు నిలబడి.

"బస్సులో వెళ్ళిపోతుంది కాబోలు"- నిరాశగా నిట్టూర్చేడు ఒకడు, ఆమెను గమనిస్తూ.

"ఎక్కడికెడుతుందో?"- తనలో తనే అనుకున్నట్టుగా అన్నాడు మరొకడు.

ఆమె గబగబా టిక్కెట్లిచ్చే 'బుకింగ్' దగ్గరకు నడిచింది.... భుజాన వేలాడు తున్న హేండ్‌బ్యాగ్‌లోంచి డబ్బు తీసి- అక్కడున్న కండక్టరు దగ్గర టికెట్ కొనుక్కుంది.... మళ్లీ బస్సుదగ్గిర కొచ్చింది....

'సూర్యాపేట, నార్కేట్‌పల్లి, హైద రాబాద్!'- అంటూ క్లీనరుకుర్రాడు ఉత్సాహంగా అరుస్తున్నాడు.

"ఈ బస్సు 'కోదాడ' వెళ్ళేసరికి ఎంతవుతుంది!"- ఆమె అడిగింది అడిగింది ఆ క్లీనరుకుర్రాణ్ణి....

ఓ క్షణం ఆలోచించి చెప్పేడు వాడు-

"పదవుతుందేమోనమ్మా!"

ఆమె సాలోచనగా తల పంకించి- బస్సెక్కేసింది.... అలా ఎక్కేటప్పుడు మరోసారి వెనక్కి చూసి, వాళ్ళిద్దరిమీదా ఓ చిరునవ్వు విసిరింది....

ఆ చూపుకీ, అందులోని చిర్నవ్వుకీ వాళ్ళిద్దరూ కరిగిపోయేరు.

"వెరీగుడ్.... మన పంట పండింది!" హుషారుగా అన్నాడొకడు.... రెండో వాడు అర్థంకానట్టు చూసేడు.

"నీ జేబుల్లో డబ్బెంత వుందో బయటకు తియ్!" — మళ్ళీ అన్నాడు వాడు.

"ఎందుకురా?"

"చెప్తానుగా ముందు తియ్."

రెండోవాడు తన జేబులోంచి ఓ పది రూపాయల కాగితం, మరికొంత చిల్లరా తీసి –

"ఇదిగో! మొత్తం పదీ ఎనభై!–" అంటూ వాడిచేతిలో పెట్టాడు.

"వెరీగుడ్! నా దగ్గర అయిదు రూపాయలు ఉన్నాయి మొత్తం పదిహేను ఎనభై. మనిద్దరం 'కోహెడ' వెడుతున్నాం! ఒక్కొక్క టిక్కెట్టు మహా వుంటే అ్రరూపాయలుంటుంది!" – అంటూనే బుకింగ్‌వైపు నడిచేడతను.

"కోదాడ ఎందుకురా ఇప్పుడు?"

"ఎందుకేమిటి నీ మొహం! నువ్ విన్లేదూ? ఆ పిల్ల కోహెడ వెడుతోంది!"

"వెడితే!"

"అదే చెబుతున్నా! కోదాడ చిన్న వూరు! కానీ బస్సు ఊళ్లోకి వెళ్ళదు." రోడ్డుమీద దిగి చాలా దూరం నడిచి వెళ్ళాలి. బస్సు అక్కడికి వెళ్ళేసరికి రాత్రి పదవుతుందట! అంత రాత్రివేళ ఆ పిల్ల ఒక్కత్తీ అలా అడవిలాంటి ప్రదేశంలో దిగి – అంతదూరం నడిచి వెడుతుంది!" –

"అందుకని మనమూ ఆ పిల్లకి సాయం వెళ్ళాలంటావ్?!" సహనాన్ని కోల్పోతూ అడిగేడు రెండోవాడు.

"వెడితే తప్పేమిటి? పిట్ట వలలో పడాలేగాని – అంతకంటే మనకేం కావాలి?" ఆశగా అన్నాడు వాడు.

"ఏడ్చినట్టేవుంది! కథ బెడిసికొట్టిందంటే చచ్చినంత పని అవుతుంది. అసలే చలిగాలి దంచేస్తోంది. రాత్రికి తిరిగి రావాలంటే మనకు బస్సు దొరుకుతుందో లేదో? పైగా వున్న డబ్బంతా వెళ్ళటానికే సరిపోతుంది!" – అంటూ ఇంకా ఏదో చెప్పబోతుండగానే – బస్సు కదలబోతున్న సూచనగా హారన్ వినిపించింది.

ఒక్క క్షణంలో బుకింగ్ దగ్గరకెళ్ళి 'కోహెడ'కి రెండు టిక్కెట్లు తీసుకుని బస్సువైపు పరుగెత్తాడు మొదటివాడు. రెండోవాడు కూడా అతన్ని అనుసరించేడు.

కదుల్తూన్న బస్‌లోకి ఇద్దరూ చొరబడ్డారు. అదృష్టంకొద్దీ లోపల చాలా సీట్లే ఖాళీగా వున్నాయి. ఆ అమ్మాయి కూర్చున్న సీటుకి ఎదురుగా వాళ్ళిద్దరూ చతికిలబడ్డారు.

బస్సు వేగాన్ని అందుకుంది చలిగాలి రొద చేస్తూ లోపలకు ప్రవేశిస్తోంది.

తన హేండ్‌బ్యాగ్ లోంచి సిల్కు రుమాలు తీసి, తలమీదుగా, చెవులచుట్టూ కట్టుకుంది ఆ అమ్మాయి.

ఆమెవైపు అప్పుడే పరిశీలనగా చూడగలిగేరు వాళ్ళు.

విశాలమైన నేత్రాలతో – గులాబీ రేకులవంటి పెదవులతో ఆమె వదనం

పున్నమి చందమామలా వెలిగిపోతూంటే వచ్చీరాని వయసు ఆమె వంటిమీద పరవళ్ళు తొక్కుతోంది

"చాలా అందంగా వుంది! . కదూ!" నెమ్మదిగా అడిగేరు ఒకడు.

"అవును! దేవకన్యలా వుంది!" రెండోవాడు చెప్పేడు.

ఆమె వాళ్ళిద్దరివైపూ చూసి చిన్నగా నవ్వింది. మళ్లీ అంతలోనే చూపులు మరల్చుకుని - కిటికీలోంచి బయటకు చూడసాగింది.

ఉధృతంగా వీస్తున్న గాలికి ఆమె పైట అల్లరిపెడుతూ, వాళ్ళిద్దర్నీ వెర్రెక్కిస్తోంది.

"ఇంక గంటలో బస్సు కోహెడ చేరుకుంటుంది. అక్కడ ఆమె బస్సు దిగితే - ఊళ్ళోకి బోలెడు దూరం నడవాలి ఈలోగా ఆ చీకట్లో ఎవరూ లేకుండా తామిద్దరూ ఆమెను " వాళ్ళిద్దర్లోనూ దాదాపు అలాంటి ఆలోచ నలే ఉవ్వెత్తున వీస్తున్నాయి.

మరి కాసేపటికి బస్సు ఆగింది

"కోహెడ త్వరగా దిగాలి... కోహెడ!" - బస్ కండక్టర్ అరిచేడు.

అంతవరకూ అంతూదరీ లేకుండా సాగిన వాళ్ళిద్దరి ఆలోచనలూ విరిచి పోయాయి.

అంత చలిలోనూ శరీరంపై చిరు చెమటలు పడుతూంటే గుండె దడదడ లాడుతూంటే - వాళ్ళిద్దరూ చటుక్కున లేచి క్రిందకు దిగేరు దిగేముందు ఆమె వైపు ఒకసారి చూసేరు

సీటుపక్కన ఉన్న తన హేండ్ బ్యాగ్‌ను తీసుకుంది ఆ అమ్మాయి.

కండక్టర్ 'రైట్' అన్నాడు.

"అయ్యో బస్ కదిలిపోతోంది! త్వరగా దిగండి!" కిందనుంచి అరిచేడు అతను, ఆమెను చూస్తూ.

"మీ బ్యాగ్ ఇలా కిటికీలోంచి నాకు అందించి మీరలా దిగిపోండి!"- రెండో వాడు ఉచిత సలహా ఇచ్చేడు.

కానీ ఆమె కదల్లేదు

తన హేండ్‌బ్యాగ్‌ని ఒళ్ళో పెట్టుకుని చిన్నగా నవ్వుతూ అంది -

"సారీ నేనింకా చాలా దూరం వెళ్ళాలి! మాది హైదరాబాద్!. . వస్తాను!" —

బస్సు మళ్ళీ వేగాన్ని అందుకుంది. తల ఇవతల పెట్టి ఆమె, చేయి ఊపు తూనే వుంది.

వెర్రిమొహాలు వేసుకుని వాళ్ళిద్దరూ అలా చూస్తూ నిలబడిపోయారు ఆ చలిలో



# హంస మంజీరాలు

(గత సంచిక తరువాయి)

"ఎవరు ఏమైనా అనుకోనివ్వండి మీరు నా కళ్ళముందు వుంటే తన్మయత్వంలో నన్ను నేను మరచిపోతాను. మీరు కనుమరుగైతే మీ ధ్యానంలో నన్ను నేను మరచిపోతాను. ఈ అనుభూతి నాకు [illegible] దొరికిన వరమని పరవశించిపోతున్నాను," అంది రాధ.

"రెండు రోజులు మన ఎడబాటు తప్పదు తాసిల్దారుగారు ఎందుకో రమ్మని కబురంపారు పట్నానికి వెళ్ళాలి నేను"

"అయ్యబాబోయ్ రెండు రోజులే"

"నా ధ్యానంలో వుండు. రెండు రోజులూ యిట్టే దొర్లిపోతాయి. పట్నం

సి. యస్. రావు & శివదత్త్

నుంచి నీకు ఏమి తీసుకురమ్మంటావు? చీరలా? నగలా? ఏం కావాలి?"

అప్పటికే రాధ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఛ! ఏమిటది మరీ చిన్న పిల్ల లాగ? ఏం కావాలో చెప్పు?" అన్నాడు కృష్ణమరాయుడు

రాధ అతని చేతిని తన చెక్కిలికి వత్తుకుంటూ," మీరు నా కళ్ళముందు వుంటే అదే పదివేలు నాకు. నాకు నగలూ వద్దు నాణ్యాలూ వద్దూ. చీరలూ వద్దు వరహాలు వద్దూ" అంటూ అతని గుండెలమీద వాలిపోయింది, వచ్చే ఏడుపును ఆపుకోవడం చేతగాక

ఆ రాత్రంతా అలా ఆమెతో గడిపి, మూడవరోజు ఉదయానికి వూళ్ళో వుంటానని మాటిచ్చి, తెల్లవారుఝామున రాధను వదలలేక వదలలేక వదలి యింటికొచ్చాడు కృష్ణమరాయుడు. ఉదయాన్నే పట్నానికి బయలుదేరాడు తల్లితో చెప్పి.

## 15

పార్వతమ్మ తన వదినగారు కామక్షమ్మ రాకకై వేయికళ్ళతో ఎదురు చూస్తోంది పట్నానికి వెళ్ళిన కృష్ణమ రాయుడు తాలూకా ఆఫీసులో పని ముగించుకొని మూడవనాటి ఉదయానికి తిరిగి వచ్చేసాడు.

వీధివైపు వరండాలో కృష్ణమ రాయుడు కరణంగారితోటి, రెవిన్యూ యినస్పెక్టరుతోటి మాట్లాడుతున్నాడు.

ఇంతలో గేటులో నరెడ్లబండి కనపడింది. బండిని పరకాయించి చూసి, "అమ్మా! కామాక్షమ్మ అత్తయ్య వస్తోంది," అని ముందు వరండానుంచే కృష్ణమరాయుడు లోపల వున్న తల్లిని పిలిచాడు.

ఆ పిలుపు విన్న పార్వతమ్మ పెరటి వైపునుంచి వదినగారికి ఎదురు సన్నాహం చేయడానికి వీధివైపుకు వచ్చింది.

నరెడ్లబండి వీధిగుమ్మం ముందు ఆగింది. కొండయ్య గబగబా ముక్కాలు పీట బండిదగ్గర వేసాడు దిగడానికి వీలుగా.

కామక్షమ్మ నెమ్మదిగా ముక్కాలు పీటమీదుగా బండి దిగింది లక్ష్మి దిగ బోతూ వుంటే కృష్ణమరాయుడే ఆమెను ఎత్తుకొని చంటిపిల్లను దింపినట్టు బండి దింపాడు.

లక్ష్మి పద్దెనిమిదేళ్ళ వయసుగల యుక్తవయస్కురాలు. సన్నగా, విందుగా, వెన్నముద్దలా వుంది పట్టు పరికిణీ, మెడలో కంటికాసుల పేరు, కాళ్ళకు కడియాలు- చెవులకు జూకాలూ- పదహారణాల పల్లెటూరి పిల్ల లక్ష్మి.

అంత చనువుగా కృష్ణమరాయుడు లక్ష్మిని బండదించి దించడం వరండాలో కూర్చున్న కరణంగారికీ రెవిన్యూ యిన స్పెక్టరుకు ఆశ్చర్యంగానూ, వింతగానూ

వున్నా, పార్వతమ్మకి, కామక్షమ్మకి ఎంతో ఆనందంగా వుంది. వారి వారి ఆనందాలను చూపులతోనే వ్యక్తం చేసుకున్నారు.

అలా బావ తనను బండి దించి నందుకు లక్ష్మి కూడా ఏం సిగ్గుపడలేదు. పైగా "నువ్వు నన్ను మోయలేవేమో అనుకున్నాను. తేలిగ్గానే మోసేసావే" అంది లక్ష్మి.

ఆ మాటకు కృష్ణమరాయుడు నవ్వి "పీ బరువు ఎంతే పిచ్చి మొఖమా" అన్నాడు

"పద వదినా లోపలికి- రా అమ్మా లక్ష్మీ" అంటూ కామక్షమ్మనూ, లక్ష్మినీ లోపలికి తీసుకువెళ్ళింది పార్వతమ్మ.

స్నానాలూ ఫలహారాలు అయ్యాక సావకాశంగా కూర్చున్నారు వదినా మరదళ్ళు. లక్ష్మి వామనగుంటలాట ఆడు కుంటోంది ఒంటరిగా.

"ఏమిటి మరదలా అర్జంటుగా రమ్మని కబురంపావు? సంగతేమిటి" అనడిగింది కామక్షమ్మ పార్వతమ్మను.

"ఎవరికి చెప్పుకుందుకు వీలులేక- ఏం చేయాలో తోచక నిన్ను రమ్మని కబురంపాను వదినా" అంది పార్వతమ్మ.

"అసలు సంగతేమిటి?"

"మన కృష్ణుడూ లక్ష్మికీ వెంటనే వీలైనంత త్వరలో ముహూర్తం పెట్టించి పెళ్ళిచేసెయ్యాలి వదినా!"

"బలేదానివే పార్వతమ్మా. నేనెప్పుడు కాదన్నాను చెప్పు. కాకపోతే కళ్యాణ ఘడియలు రావాలి కదా!"

"కళ్యాణ ఘడియలకోసం ఎదురు చూస్తూ కూర్చుంటే లాభంలేదు వదినా. కొంపలు మునిగేలా వున్నాయి," అంటూ ఆందోళన వ్యక్తపరిచింది పార్వతమ్మ.

"ఏం జరిగిందేమిటి?" అంది కామాక్షమ్మ పార్వతమ్మకు కొస్త దగ్గరగా జరుగుతూ.

"అబ్బాయి యీ మధ్య సరిగ్గా యింటిపట్టున వుంటుంటలేదని నా అను మానం. పైగా వూరంతా రాధ అనే పిల్లతో కాస్త చనువుగా వుంటున్నాడని చెప్పుకుంటున్నారు. మన యింటా వంటా ఇల్లాంటివి ఏనాడేనా ఉన్నాయా? నువ్వే చెప్పొదినా?" అని పార్వతమ్మ బాధ పడింది.

కామక్షమ్మ నిట్టూర్చి, "ఏం చేస్తాం అటు నీకూ, యిటు నాకూ మొగదిక్కు లేకపోవడంచేత - అతగాడిని అడిగి వాళ్ళెవరూ లేరు. అది కాకపోయినా నీకేం భయం? యిదేం పని అని నిలదీసి అడక్కపోయావా?" అంది.

"పదిమందిలోనూ తలెత్తుకు తిరిగే వాడు నా కొడుకే కావచ్చు. అందుకే అడగలేకపోయాను వదినా."

"మరిప్పుడేం చేద్దామంటావు?" అంది కామాక్షమ్మ ఏమీ తోచనిదానిలా.

"ఏముంది వదినా ? లక్ష్మికి పెళ్ళీడు వచ్చింది కదా ముహూర్తాలు ఎప్పుడో పెట్టించమంటావని అడుగు వాళ్ళ నాన్న గారు వుండగా అనుకున్నమాటేగా - కాదనడు ఆ మూడు ముళ్లూ పడిపోతే పెళ్ళామే అదుపులో పెట్టుకుంటుంది" అంది పార్వతమ్మ

"ఆ మాట నువ్వే అడక్కపోయావా ?"

"నేనడిగితే ఇప్పుడు నా పెళ్ళికేమి తొందరమ్మా అంటూ మాట దాటవేస్తాడు అంత దూరం నుంచి నువ్వు వచ్చి అడిగావంటే నోరెత్తకుండా ఒప్పుకుంటాడు" అని కామాక్షమ్మను ప్రోత్సహించింది పార్వతమ్మ.

"ఎవరినో ఏదో అడగాలంటున్నారేమిటి అత్తయ్యా" అంటూ లక్ష్మి వామనగుంటాలాట మానేసి తల్లి దగ్గరకు వచ్చింది.

"నీ పెళ్ళి సంగతి బావతో మాట్లాడమంటున్నానమ్మా అమ్మని," అంది పార్వతమ్మ.

"మరైతే పదండి. బావను అడుగుదాం," అంటూ లక్ష్మి లేచింది.

"నువ్వు అడక్కడదే పిచ్చి మొఖమా దీనికేమీ తెలీదు పార్వతమ్మా," అంటూ చిరాకుపడింది లక్ష్మిమీద కామాక్షమ్మ

"ఇంకా చిన్నతనం కదా వదినా ?"- సర్దింది పార్వతమ్మ

"నా మొఖం చిన్నతనం. పద్దెనిమిదేళ్లు వచ్చినా దీనికి సిగ్గూ తెలీదు -" అంది కామాక్షమ్మ

"ఇప్పుడు నేనేమన్నానని అత్తయ్యా- నేను రానులే మీరేవెళ్లి అడగండి బావని ఏమి అడుగుతారో" అంటూ లక్ష్మి అక్కడ నుంచి వెళ్ళిపోయింది మూతి ముడుచుకొని.

* * *

ఇంతలో మధ్యాహ్న భోజనాల వేళ అయింది కృష్ణమరాయుడు వీధివైపు వరండానుంచి లోపలికి వచ్చాడు

ఎదురుగా కనపడిన కామాక్షమ్మను "ఏమిటి అత్తయ్యా ? యీ మధ్య అసలు రావడమే మానేసావు ఇది పుట్టిల్లన్న సంగతే మరచిపోయావా ? పునఃప్రతిష్టకు రాలేదు - గత సంక్రాంతికి రాలేదు" అని పలకరించాడు కృష్ణమరాయుడు

కామాక్షమ్మ లేచి నిలబడి కొంగు నిండా తీసుకొని "ఏవో పనులు తొందర బాబు వంటరిదాన్ని - అన్ని పనులూ నేనే పురమాయించి చేయించుకోవాలి యింట్లోంచి కాలు కదపాలంటే పనివాళ్ల మీద, పాలికాపులమీద యిల్లూ వ్యవసాయం వదిలిపెట్టి రావాలి కదా" అంది.

"పోనీలే యిప్పటికేనా వచ్చావు ?" అన్నాడు కృష్ణమరాయుడు

"ఆడపిల్లని కన్నవాళ్ళం - రాక తప్పుతుందా బాబూ" అంది కామాక్షమ్మ.

ఇంతలో పార్వతమ్మ భోజనం

వడ్డించింది కృష్ణమరాయుడికి కృష్ణమ రాయుడు భోజనంముందు కూర్చున్నాడు.

లక్ష్మి నెయ్యి వడ్డించింది

"అబ్బో పెద్ద పనిమంతురాలివై పోయావే. సమిటలు వేయడం, వొద్దికగా కొంగు మొలలో దోపుకోవడం- ఇంకేం" అన్నాడు కృష్ణమరాయుడు లక్ష్మిని వేళాకోళంగా

"అందుకేగా బాబూ తొందర" అని మాట కలిపింది కామాక్షమ్మ

"తొందరేముంది అత్తయ్యా - లక్ష్మి యింకా చిన్నపిల్లే కదా "

"మన కంటికి అలాగే కనపడడం సహజమనుకో కాని మా వూరా పల్లె టూరు 'లక్ష్మికి పెళ్లెప్పుడూ? లక్ష్మికి పెళ్లెప్పుడూ!' అని అడిగేవాళ్ళకు సమాధానం చెప్పలేక నోరు కాయకాసి పోతోందంటే నమ్ము ఎప్పటికైనా యీ యింటి కోడలు కావాల్సిందే కదా మీ నాన్న వాళ్ళ నాన్నగారు వుండగా అనుకున్న మాటే కదా అందుకని విన్ను కనుక్కొని రేపు మాఘమాసంలో ముహూర్తాలు పెట్టించమని చెబుదామని వచ్చాను" అని వచ్చిన పని వివరించింది కామాక్షమ్మ

"మా బాగా చెప్పావు" అన్నట్టు చూసింది పార్వతమ్మ వదినగారివైపు.

"అలాగే అత్తయ్యా! ఏదేనా మంచి సంబంధం చూసి ముహూర్తాలు పెట్టేదాం," అన్నాడు కృష్ణమరాయుడు ఏదో ఆలోచిస్తూ

"నువ్వుండగా వేరే సంబంధం దాని కెందుకు కృష్ణా" అంది పార్వతమ్మ

కృష్ణమరాయుడు తలవంచుకొనే "లక్ష్మిని ఆ దృష్టితో నేనెన్నడూ చూడలేదమ్మా నా కంటికి యీనాటికి చిన్నపిల్ల లాగే కనిపిస్తుంది. అందుకే బండిలోంచి ఎత్తుకొని దింపాను యీ విషయంలో నువ్వేమీ అనుకోకు అత్తయ్యా," అని చెప్పి చేయికడుక్కొని వెళ్ళిపోయాడు

కామాక్షమ్మ, పార్వతమ్మ ముఖ ముఖాలు చూసుకున్నారు.

లక్ష్మి తనకేమీ పట్టనట్టు తన ఆటల్లో తాను మునిగిపోయింది

తన మేనత్త కామాక్షమ్మ లక్ష్మి పెళ్ళి సంగతి ఎత్తినప్పుడు తాను లక్ష్మిని ఆ దృష్టితో ఏనాడు చూడలేదనీ, మంచి సంబంధం చూసి పెళ్ళి చేద్దామని సమాధానం చెప్పి బయటపడిన కృష్ణమ రాయుని మనసు ఎందుకనో వ్యాకులతకు లోనయింది.

లక్ష్మిని పెళ్ళిచేసుకొనే వుద్దేశ్యం లేదని మాటైతే అన్నాడుగాని, ఆ అనుబంధం తన చిన్ననాటినుంచీ వస్తున్నదేననీ, తన తండ్రి తోబుట్టువుకు యిచ్చిన మాట అది అనీ తనకి తెలుసు తన తిరస్కృతి తన తల్లినీ, మేనత్తనూ

ఎంతగానో బాధపెట్టి వుంటుందని తనకి తెలుసు

కాని ఎంత నచ్చచెప్పుకున్నా రాధను కాదని లక్ష్మి మెడలో తాళి కట్టడం అతను వూహించుకోలేక పోతున్నాడు ఎప్పుడూ చిరునవ్వుతో కలకలలాడుతూ వుండే కృష్ణమరాయుడు ఎవో ఆలోచనల సుడిగుండంలో చిక్కుకొని అస్థిమితంగా వున్నాడు ఏమీ తోచక ఆలయానికి వెళ్ళాడు స్వామి దర్శనం చేసుకొని పూజారి పూర్ణయ్యగారి వద్ద ప్రసాదం తీర్థం తీసుకున్నాడు.

బాగా చీకటిపడేదాకా మండపంలోనే వంటరిగా కూర్చున్నాడు గుడి తలుపులు మూసి పూర్ణయ్య కృష్ణమరాయుని వద్దకు వచ్చి కూర్చున్నాడు పూర్ణయ్య రాకను కృష్ణమరాయుడు ముందుగా గుర్తించలేదు

"ఏదో పరధ్యానంలో ఉన్నట్లున్నావు" అన్నాడు పూర్ణయ్య

"అబ్బే ఏమీలేదండి గుడి తలుపులు మూసేసారా?" అన్నాడు కృష్ణమరాయుడు పూర్ణయ్య పలకరింపుతో తన ఆలోచనల నుంచి తేరుకొని

"చాలా సేపయింది నీవు వంటరిగా మండపంలో కూర్చున్నావు కదాని పలకరించి పోదామని యిటు వచ్చాను"

"దయచేయండి" అంటూ కూర్చోమని చోటు చూపించాడు కృష్ణమరాయుడు

పూర్ణయ్య కృష్ణమరాయునికి ఎదురుగా కూర్చున్నాడు

"ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావు బాబూ?" అని అడిగాడు పూర్ణయ్య

"ఒక సమస్య ఎంత ఆలోచించినా తెగడం లేదు మీరు విప్పగలరేమో ప్రయత్నిస్తారా"

"అసలు సమస్య ఏమిటి?"

"ఎప్పుడూ నిర్మలంగా ప్రవహించే యేటికి వరదవచ్చి పడింది కట్టలు తెగాయి. తల్లినీ, మరో యిద్దరు దగ్గర బంధువులని నావలో ఎక్కించుకొని దాటేస్తున్నాడు ఓ యువకుడు ఇంతలో ఆ యువకుడ్ని మనసారా ప్రేమిస్తున్న ప్రేయసి ఆ వరదలో తన ప్రియుడు ఏమైపోతాడోనని వెతుక్కుంటూ యేటికి అడ్డంగా యీదుకుంటూ బయలుదేరింది ఆమెను ఆ యువకుడు చూసాడు ఆమెకోసం పడవ వదలి యేటిలోకి దూకితే తన తల్లీ తన వాళ్ళూ వున్న పడవ ఏమైపోతుందో తెలీదు యేటిలోకి దూకకపోతే ప్రియురాలు యేటిపాలైపోతుంది అప్పుడు ఆ యువకుడు తన వాళ్ళున్న పడవను ఒడ్డుకు చేర్చాలా? లేక యేటిలోకి దూకి తన ప్రియురాలిని కాపాడాలా? ఏది సబబంటారు? ఏది ధర్మం అంటారు?"

"చాలా క్లిష్టమైన సమస్యే కృష్ణమరాయా!"

"పెద్దలూ, అనుభవజ్ఞులు ఆలోచించి సెలవియ్యండి" అన్నాడు కృష్ణమ రాయుడు వినయంగా

ఒక్క క్షణం యిద్దరు మౌనంగా వుండిపోయారు

కృష్ణమరాయునికి పూర్ణయ్య మీద, పూర్ణయ్య విజ్ఞత మీద కొండంత నమ్మకం అందుకే అతన్ని అడిగాడు తన సమస్యకో సమాధానం

కొద్దిసేపు ఆలోచించిన తరువాత పూర్ణయ్య తన అభిప్రాయన్ని చెప్పడం మొదలుపెట్టాడు.

"ఇది ఏ ఒక్కరి పరంగానూ ఆలోచించకూడదు కృష్ణమరాయా కనిపించినది కాబట్టి తల్లి, దగ్గర బంధువులు కాబట్టి బంధువులూ, తమని ఒడ్డుకు చేర్చడమే ధర్మం అనుకుంటారు అతని బాధ్యత అనుకుంటారు.

"కాని ప్రియుడు క్షేమంకోరి నిండు వరదలో వున్న యేటికి అడ్డుపడి ప్రియుడ్ని వెతుక్కుంటూ వస్తున్న ప్రియురాలు తనను కాపాడుమని కోరడం లేదు తన ప్రియుడు ఏమైపోతాడోనని తన ప్రాణాలకే తెగించి బయలుదేరింది. ఆమె అడక్కపోయినా ఆమెను కాపాడడం ప్రియుని బాధ్యత

"ఇందులో తల్లీ తనవాళ్ళూ కోరేదాంట్లో, ఆశించేదాంట్లో కొంత స్వార్థం వుంది తను కనిపించింది కాబట్టి తల్లీ, తమవాడు కాబట్టి బంధువులూ ఆ యువకుడు తమనే కాపాడాలను కుంటారు. ఇది ప్రతిఫలం ఆశించడం.

ప్రియురాలిది స్వార్థం అనడానికి వీల్లేదు. అవలు బయలుదేరడమే ప్రియుడు ఏమైపోతాడోనన్న ఆతృతతో బయలుదేరింది. ఆమెలో వున్నది ప్రేమ తప్ప మరేమీలేదు. భక్తి తప్ప స్వార్థం లేదు

ఆలాగే ఏనుగు మొసలి నోటచిక్కి హరిని ప్రార్థించగానే ఏ ఆయుధాలూ చేపట్టకుండానే పైపంచె జారిపోతున్నా పట్టించుకోకుండా బయలుదేరాడట ప్రేమపాశంతో అలా బయలుదేరింది ఆ ప్రియురాలు ?

"అందుకని ఆ ప్రియురాలినే ఆదుకోవడం ఆ యువకుని బాధ్యత అంటారా ?" అన్నాడు కృష్ణమరాయుడు

"అలా అనీ ఖచ్చితంగా చెప్పలేను. తల్లిని కాదని ప్రియురాలిని కాపాడితే లోకం వప్పదు తనను వెతుక్కుంటూ వచ్చిన ప్రియురాలిని ఏటిపాలు చేయడం ధర్మంకాదు ఆ ప్రియుడికి గడ్డు సమస్యే కృష్ణమరాయా! ఈ సమస్యకి పరిష్కారం అతనే ఆలోచించుకోవాలి" అన్నాడు పూర్ణయ్య

"అయితే మీకు పరిష్కారం తోచలేదన్నమాట పదండి" అంటూ లేచాడు కృష్ణమరాయుడు

ఇద్దరూ ఆలయ ప్రాంగణం నుంచి

బయటకి వచ్చారు పూర్ణయ్య తన యింటివైపు బయలుదేరాడు

కృష్ణమరాయుడు వెన్నెల మాటులో రాధ యింటివైపు నడిచాడు

## 17

వసంతానికై నిరీక్షించే తరువులా తనువంతా కళ్ళుచేసుకొని రాధ కృష్ణమరాయుని రాకకై వేయికళ్ళతో ఎదురు చూస్తోంది గాలి కదిలినా, తెర రెపరెపలాడినా, పక్షులు కిలకిలలాడినా కృష్ణమరాయుడే వచ్చాడని ఆమె మనసు భ్రమ చెందుతోంది కాదని తెలుసుకున్నాక కుంగిపోతోంది.

కృష్ణమరాయుడు రానే వచ్చాడు అతని రాకను గమనించిన రాధ తనువూ మనసు ఏదో తీయని అనుభూతుల చివురులు తొడగి పులకించిపోయాయి

హాలులో వున్న పుష్పావతి భీముడు కృష్ణమరాయుడు రాగానే వత్తిగిలారు రాధ ముందుకువచ్చి అతని కుడిచేతిని తనచేతులలోకి తీసుకొని ముద్దాడి అప్యాయంగా అహ్వానించింది. అంతలోనే అతని ముఖంలోకి చూసింది

"ముఖాన ఆ ముచ్చెమట లేమిటి చల్లని వెన్నెలవేళలో కూడా" అంది రాధ తన పమిటకొంగుతో వత్తుతూ

కృష్ణమరాయుడు చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు బదులు చెప్పలేదు.

"రాచకార్యాలలో అలసిపోయారా? లేక అలసిపోయేంతగా ఆలోచించారా?" అంది రాధ అతని కళ్ళలోకి చూస్తూ

ఇద్దరూ ఆమె గదిలోకి వచ్చి అమర్చిన పాన్పుపై కూర్చున్నారు

పక్కనే వున్న పాలగ్లాసు అతని పెదువులకు అందించింది రాధ

ఆటలాడి అలసిన పసిపాపను బుజ్జగించి పాలుపట్టించే తల్లిలా అనిపించింది రాధ కృష్ణమరాయునికి ఆ క్షణంలో. తన మనసులోని మాటలు ఆమెకు చెప్పాలో వద్దో తెలియక తికమక పడుతున్నాడు కృష్ణమరాయుడు

పాలు తాగాడు

చివరికి తన మనసులోని సమస్య చెప్పకూడదనే నిర్ణయించుకున్నాడు

పానుపుమీద నడుం వాల్చాడు రాధ అతని గుండెలమీద వాలింది ఆమె మెడలోని పులిగోరు పతకం వయ్యారంగా వూయల లూగుతోంది ఆ పతకాన్ని కృష్ణమరాయుడు తన చేతిలోకి తీసుకున్నాడు

"రాధా!" అన్నాడు గోముగా

"ఊ" అని మాత్రం అంది రాధ

"నీకు పెళ్ళిచేసుకొని అందరిలాగా కాపురం చేయాలనిలేదూ!" రాధ వులిక్కిపడి అతని గుండెలమీద నుంచి లేచి నిటారుగా కూర్చుంది

"ఎందుకంత కంగారూ గాబరాను?" అన్నాడు కృష్ణమరాయుడు కూడా లేచి కూర్చుంటూ

"దేవుని పూజకు ఉపకరించిన పుష్పం దేవేరినే కావాలనుకోవడం దురాశ అని పించుకుంటుందే గాని సమంజసమైన కోరిక అనుపించుకోదు. నేనేమిటో నాకు తెలుసు నా పుట్టుకేమిటో నాకు తెలుసు నేను పెళ్ళినీ, పవిత్రమైన మాంగాళ్యాన్ని ఆశించడం దురాశ కాదా? నన్ను ఆటపట్టించడానికి అంటున్నారు గాని మీకు మాత్రం తెలీదా?" అంది రాధ

ఆమె మాటల్లో అంతటి అదృష్టం తనకు లేదనే బాధ కొట్టొచ్చినట్టు కనిపించింది కష్ణమరాయునికి ఆమెను చూస్తే ఆ క్షణంలో అతనికి జాలేసింది

"నీ వుద్దేశ్యం నువ్వు దేవదాసివి కనుక వివాహానికి అర్హురాలివి కావనేగా?" అన్నాడు కృష్ణమరాయుడు

ఔనన్నట్లు తలవూపింది

"అయితే దేవదాసీలు దేవుడి పేరు మీద-జనదాసీలుగా వుండిపోవాలనా నీ వుద్దేశ్యం?"

"దేవుడి పేరుమీద నైవేద్యం పెట్టే ప్రసాదం దేవుడే పూర్తిగా అరగిస్తు న్నాడా? భక్తులనబడేవారు పంచుకు తిన డమేగా చివరకు జరిగేది?" అంది రాధ

ఆమె యిచ్చిన సమాధానానికి జవాబు దొరకలేదు కృష్ణమరాయునికి ఆమె సమయస్ఫూర్తికీ, తెలివికి లోలోపలే మురిసిపోయాడు ఒక్క క్షణం ఆమెనే తదేకంగా చూసి-

"రాధ నేనో మాట చెప్పనా?" అన్నాడు కృష్ణమరాయుడు

"ఒక్కటేమిటి? వెయ్యి మాటలు చెప్పండి మీరలా చెబుతూవుంటే నేనిలా వింటూ వుంటాను రాత్రి మనకు తెలియ కుండానే గడిచిపోతుంది," అంది రాధ

"మన కింకా ఎన్నో రాత్రులు వున్నాయి గానీ, శకుంతల ఎవరు?"

"దుష్యంతుని భార్య"

"ఎవరి కూతురు?"

"మేనకా విశ్వామిత్రుల కూతురు"

"మేనక ఎవరు?"

"అంటే దేవదాసీలాంటిదే కదా?"

"కావచ్చు, కాని ఆమె దేవలోకానికి చెందిన స్త్రీ కదా?"

"అయినా వృత్తిరీత్యా దేవదాసీయే కదా?"

"ఔను"

"ఆమెకూ విశ్వామిత్రునికి పుట్టిన శకుంతలను దుష్యంతుడంతటి మహా రాజు పెళ్ళాడాడు ఆమె కన్న భరతుడు పేరుమీదనే మన జాతీ దేశం యీనాటికీ పిలువబడుతున్నాయి అర్హత పుట్టుకను బట్టి రాదు రాధా! మనిషి జీవిత విధానాన్ని బట్టి కృషిని బట్టి వస్తుంది" అన్నాడు కృష్ణమరాయుడు

"ఇంతకి మీరు చెప్పదలచిన దేమిటి?"

"అందుకని నీవు వివాహానికి అర్హురాలివి కావనుకోనక్కర్లేదు."

"మీరలా అంటున్నారు కదా! మేనక

కడుపున పుట్టిన శకుంతల పెళ్ళి అందరి స్త్రీల పెళ్ళిళ్ళ లాగానే జరిగిందా? అందరూ కాపురానికి వెళ్ళినట్టే ఆమె వెళ్ళగలిగిందా ఆ శకుంతలకు కణ్వ మహర్షి అండే లేకపోతే ఆమె బతుకు ఏమైపుండేదో.. సంఘం ఆమెను ఏమి చేసి వుండేదో?" అంది రాధ

"నీ అనుమానం ఏమిటో—అసలు నీ అభిప్రాయం ఏమిటో నాకర్థంకావడం లేదు ఆమె పట్టపురాణి కాలేదా। ఆమెకు పుట్టిన కొడుకు రాజ్యానికి వారసుడు కాలేదా ఆమెకు ఏ లోటు జరిగింది?"

"ఎంత పరీక్ష, ఎన్నాళ్ళ ఎడబాటూ తర్వాత శకుంతల ఆ అర్హతనూ, ఆదరణను పొందగలిగింది? మనకీ వాదన వద్దుగానీ— నాకు పెళ్ళి అక్కర్లేదు మీ నీడ నాకు లేకుండా చేయకండి కల కాలం మీ నీడనే బతికి—మీ నీడనే కన్ను మూయాలని వుంది—" అంటూ అతన్ని గట్టిగా కౌగలించుకుంది రాధ.

ఆమెను హృదయానికి హత్తుకొని— "అయితే నన్ను పెళ్లాడటం నీ కిష్టంలేదన్న మాట—" అన్నాడు కృష్ణమరాయుడు.

"లేక కాదు. నాకా అర్హత లేదని తెలుసు. అంతకు తెగించి మిమ్మల్ని నిందించాలని చేయలేను." అంటూన్న రాధ స్వరం బొంగురుపోయింది

ఆమె తల నిమురుతూ 'రాధా' అన్నాడు కృష్ణమరాయుడు ఆ పిలుపులోనే తన సర్వస్వాన్ని ఆమెకే ధారాదత్తం చేస్తున్నట్టు.

ఇక వారిరువురి మధ్యా మాటల్లేవు. మౌనమే ఎన్నో విషయాలు మాట్లాడింది అది మనసుల భాష మాటలకందని మౌనంలో మనసులు చేసుకొన్న బాసలు

## 18

కృష్ణమరాయుడు లక్ష్మిని పెళ్ళిచేసుకునే వుద్దేశ్యం తనకులేదని కామాక్షమ్మ ముఖంమీదనే చెప్పడంతో కామాక్షమ్మ ముఖం చింతాకంత అయిపోయింది

ఇంటి ఆడబడుచు అని కూడా ఆలోచించకుండా తన కొడుకు ముఖంమీదనే తన అభిప్రాయాన్ని కొట్టినట్టు చెబుతాడని పార్వతమ్మ కూడా వూహించిలేదు

తన వదినగారు కామాక్షమ్మను పిలిపించి అడిగిస్తే తన కొడుకు పెళ్ళి సమస్య తీరిపోతుందని ఆశపడింది పార్వతమ్మ. పూర్ణయ్యగారు ఇచ్చిన సలహా ఎంతో బాగుందనుకొంది కృష్ణమరాయుడు నలుగురి నోళ్ళలోనూ పడకుండా ఒక ఇంటి వాడవుతాడనుకుంది. తన వంశం నిలబడుతుందని సంతోషపడింది. నోటికీ చేతికీ అంటులేని ఆడబడుచు కూతురు తన కోడలైతే తనకిక ఏ చింతా లేదని మురిసిపోయింది.

కాని తానొకటి తలిస్తే దైవం మరొకటి తలస్తాడన్నట్లు తానుగానీ, కామాక్షమ్మగాని వూహించని సమాధానం వచ్చింది కృష్ణమరాయుని దగ్గరనుంచి.

అతని సమాధానం గురించి లక్ష్మి




# మెజెస్టిక్ తన రూపాన్ని చెక్కు చెదరనివ్వదు

మెజెస్టిక్ ప్రెషర్ కుకర్‌రూపం ఎల్లప్పుడూ చెక్కుచెదరకుండా వుండేలా నిర్మించబడింది. రెండుసార్లు రీసెస్ చేయబడిన క్రిందిభాగం, చిరకాలం మన్నేవిధంగా ఒత్తిడితో నిర్మాణం ఇందుకు కారణం.

---

**ఇతర ఆకర్షణలు :**

- ఐ.ఎస్.ఐ. గ్రేడు అల్యూమినియం అలాయ్‌తో చేయబడింది.
- మీరు ఎంపిక చేసుకోడానికి వైరుస్టాండుతో గిన్నెల సముదాయం.
- 4 నుంచి 12.5 లీటర్లవరకు ఏడు సైజులున్నాయి.
- అందమైన 4 రంగులలో కూడా లభిస్తాయి.

---



అంతగా పట్టించుకోలేదు. బాధపడలేదు. ఆమెకు తెలిసీతెలియనితనం.

కాని కామాక్షమ్మా, పార్వతమ్మా చాలా బాధపడ్డారు. కామాక్షమ్మ అయితే పెద్ద అవమానంగానే బాధపడసాగింది. చివరికి తన మరదలు పార్వతమ్మతో కూడ కలిమిడిగా మాట్లాడలేకపోతోంది. కృష్ణమరాయునికి ముఖం చూపించలేక అతను యింట్లోకి వచ్చినపుడు తప్పుకు తిరుగుతోంది. నిజానికి ఆ రోజున పార్వతమ్మ, కామాక్షమ్మ యిద్దరూ భోజనాలు కూడా చేయలేదు. అటువంటి పరిస్థితి వస్తుందని వాళ్ళిద్దరూ ఏనాడూ వూహించలేదు. ఆ రెండు సంసారాలకూ కృష్ణమరాయుడే మొగదిక్కని, ఆస్థి పాస్తులకు వారసుడని అనుకున్నారు వాళ్ళిద్దరూ. వాళ్ళిద్దరే కాదు. ఆ రెండు సంసారాలను ఎరిగినవారి అభిప్రాయం కూడా అదే.

ఇప్పుడు చుక్కెదురైంది.

అలా ఒక్కరోజు కామాక్షమ్మ పుట్టింట వుండగలిగింది. రెండవ రోజున ఆమెకు యిహ వుండబుద్ధి కాలేదు. పుట్టింటితో తనకిక సంబంధం తెగిపోయి నట్లనిపించింది ఆమెకు.

తన కూతురు తన పుట్టింటి కోడ లవుతుందన్న తన ఆశ చెదిరిపోవడంతో ఆ యిల్లు యిక కామాక్షమ్మకు పరాయి యిల్లుగానే అనిపించింది.

మరునాటి పొద్దున్నే సామానంతా సర్దేసింది కామాక్షమ్మ.

ధాన్యంకొట్లు దగ్గర కుక్కపిల్లల్ని పెట్టింది. ఆ కుక్క పిల్లలతో విశ్వం తగా ఆడుకుంటోంది లక్ష్మి.

లక్ష్మిబట్టలుకూడా సర్దేద్దామని లక్ష్మి ఎక్కడ ఉందోనని వెతికింది కామాక్షమ్మ. కుక్కపిల్లలతో ఆడుకుంటూన్న లక్ష్మిని వెతికి పట్టుకొని లోపలికి తీసుకువస్తూ "ఇంత వయసొచ్చినా కుక్కపిల్లలతోటీ పిల్లపిల్లలతోటీ ఆటలేమిటే. అందుకే నీ ముఖానికి పెళ్ళిరాత పట్టలేదు. ఏనాటి నుంచో అనుకుంటున్న సంబంధం కాకుండా పోయింది. ఇప్పుడేనా కొత్త సిగ్గుతెచ్చుకొని వయ్యంగా బతుకే తల్లీ- పద నీ బట్టలు ఎక్కడెక్కడ వున్నాయో వెతికి సర్ది బయలుదేరదాం మన యింటికి" అంటూ సణిగింది.

ఆ మాటలు పార్వతమ్మ వింది. అంత త్వరగా తనను పరిస్థితిలో వదిలేసి ఏ విషయం తేలకుండా కామాక్షమ్మ బయలుదేరుతుందని పార్వతమ్మ అనుకోలేదు.

భయపడుతూ భయపడుతూ- "ఇంత త్వరగా ప్రయాణమా వదినా?" అంది పార్వతమ్మ.

"ఇంకా ఏ మొహం పెట్టుకొని వుండ మంటావమ్మా - జరిగిన అవమానం చాలు," అంది కామాక్షమ్మ.



# హై పవర్ సర్ఫ్
# అమిత తెల్లగా ఉతుకుతుంది...

**అమిత తెల్లగా కనువిందుగా.**

హై పవర్ సర్ఫ్‌లోని హెచ్చు డిటర్జంట్ శక్తి
మురికినీ, జిడ్డు మరకల్నీ మటుమాయం
చేస్తుంది బాగా మాసిపోయిన దుస్తుల్ని
కూడా, తెల్లగా మిలమిల మెరిసేలా
చేస్తుంది సర్ఫ్. ఎక్కువ మంది
తల్లులు మరే ఇతర వాషింగ్
పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే
వాడటంలో ఆశ్చర్యం
ఏముంది గనక ?






**ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు.**

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.

లింటాస్–SU. 225-1811 TE

ఆమె మాట తీరే అంత. ఆ సంగతి పార్వతమ్మకు తను కాపురానికి వచ్చి నప్పటినుంచీ తెలుసు. కాని ఆమె మనసు మంచిదని కూడా తెలుసు ఆమెకు

అందుకే పార్వతమ్మ కామాక్షమ్మ మాటకు మొహం చిట్లించకుండా– "అనుకున్నది అనుకున్నట్టు జరగడం లేదే అన్న బాధ నాకు మాత్రం లేదా వదినా! ఇటువంటి సమయంలో నన్ను వంటరిదాన్ని చేసి నువ్వెళ్ళిపోతే నాకు ధైర్యంచెప్పేవారు, సలహా చెప్పేవారు ఇంకెవరున్నారు చెప్పు." అంది విస్సహాయంగా.

ఆమె మాటలకు కామాక్షమ్మ మనసు కరిగిపోయింది.

"నన్నేం చెయ్యమంటావు చెప్పు. నువ్వు రమ్మని కబురంపితే వచ్చాను. కృష్ణను అడిగాను. నాకు మాత్రం ఎవరున్నారు లక్ష్మి తప్ప. నా ఆస్తంతా వాళ్ళిద్దరికే కదా– అన్నీ తెలిసి కూడా కృష్ణ కాదంటే – నా బిడ్డ కాళ్ళూ చేతులు కట్టి అతని కాళ్ళముందు పడెయ్య మంటావా. తాళి కట్టించుకునే ఆడపిల్ల మెడలు వంచగలంగాని, బలవంతంగా మగవాడిచేత తాళి కట్టించలేముగా. ఇంతకీ వాళ్ళిద్దరికీ రాసిపెట్టిలేదు." అంటూ తన మనసులోని మాటను పార్వతమ్మ ముందు చెప్పేసింది కామాక్షమ్మ.

"అలా అని వదిలేస్తే ఎలా వదినా. ఏదో మార్గం ఆలోచించాలి. వాళ్ళిద్దరినీ ఓ యింటి వాళ్ళని చేయాలి. మన వంశ గౌరవాలు నలుగురి నోళ్ళలోనూ నానకుండా కాపాడుకోవాలి. నువ్వు నాలుగు రోజులు వుంటే ఏదో మార్గం ఆలోచిద్దాం. అది కాకపోయినా సావిత్రో సాంగత్యం ఎన్నాళ్ళు వుంటుంది చెప్పు" అంది పార్వతమ్మ.

"ఏమో బాబు. యిలాంటి గొడవలు మన యింటా వంటా లేవు?"

"అదేగా నా బాధ కూడాను. నా మాట విని నాలుగురోజులు వుండు. పూర్ణయ్య గారితో కూడా ఆలోచించి ఏదో మార్గం ఆలోచిద్దాం. ఆ మాయలమారి రాధను ఎలా వదిలించుకోవాలన్న ఉపాయం ఆలోచిద్దాం" అని బతిమాలింది పార్వతమ్మ.

"రాధ ఎవరు అత్తయ్యా?" అంది వాళ్ళిద్దరి సంభాషణ వింటూ బట్టలు మడుస్తున్న లక్ష్మి.

"నీ పాలిటి దెయ్యం." అంది కామాక్షమ్మ.

"దెయ్యాలు లేవటలే. ఇదివరకు వచ్చినప్పుడు బావ చెప్పాడు." అంది లక్ష్మి నవ్వుతూ చిన్నపిల్లలా.

ఒక్క క్షణం లక్ష్మిని చూసి కామాక్షమ్మ "ఇదీ దాని వరస పార్వతీ– యీ అమాయకపు పిల్ల ఏ యింటి కోడలవుతుందో, వాళ్ళేం బాధలుపెడ తారో అనే నా బాధ. నీ కడుపులోవేస్తే

నాకు వుండే తృప్తి మరో యింటికి దాన్ని పంపితే నాకెలా వుంటుంది చెప్పు" అంటూ కంట తడిపెట్టుకుంది.

"ఊరుకో వదినా- మనం ఎవరికీ అపకారం చేసినవాళ్ళమూ కాదు- తల పెట్టిన వాళ్ళమూ కాదు. అన్నింటికీ ఆ వేణుగోపాలస్వామినే నమ్ముకున్న వాళ్ళం. ఆయనే మనల్ని వర్ధిల్లజేస్తాడు"

"అంతే మరి. మనవల్ల కానప్పుడూ మన చేతులు దాటిపోయినప్పుడూ దేవుడి మీద భారంవేయక చేయగలిగిందేముంది" అంది కామాక్షమ్మ కళ్ళు వత్తుకుంటూ.

"ఇప్పుడు నాకేమైందనత్తయ్యా- అమ్మ అంతగా ఏడుస్తోంది." అంది లక్ష్మి.

ఆమె ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో తెలియక, ఆమె తెలియని తనానికి లోలోపలే బాధపడుతూ- "ఏమీ లేదమ్మా. నీ గురించి కాదు. నువ్వెళ్ళి వామనగుంటలు ఆడుకో!" అని లక్ష్మిని బుజ్జగించి పంపేసిందక్కడ నుంచి పార్వతమ్మ.

లక్ష్మి వెళ్ళిపోయిన తరవాత కామాక్షమ్మ పార్వతమ్మ ఒక్క క్షణం మౌనంగా వుండిపోయారు. ఇద్దరూ లోలోపల ఆలోచిస్తూనే వున్నారు.

"వదినా!" అని పలకరించింది, పార్వతమ్మ కామాక్షమ్మను.

"ఏమిటి?" అంది కామాక్షమ్మ.

"మనం పూర్ణయ్యగారితో యిలా జరిగిందని చెప్పి సలహా అడిగితే మంచిది కదూ- ఆది మంచి మన కుటుంబాల సంగతి తెలిసినవారు. పైగా పెద్దవారు" అంది పార్వతమ్మ.

"సరే ఆ ప్రయత్నం కూడా చెయ్యి" అంది కామాక్షమ్మ నిరాశగానే.

కృష్ణమరాయుడు పనిమీద పట్నానికి వెళ్ళాడు. ఆ సంగతి రాధకు తెలుసు. అతను వూళ్ళో లేకపోతే ఆమెకు తోచదు క్షణం ఒక యుగంలా గడుస్తుంది. కళ్ళ ముందు లేకపోయినా వూళ్ళో వుంటే కృష్ణమరాయుడు తనకు చేరువుగా వున్నాడన్న తృప్తి ఆమెకు.

అతను వూళ్ళో వుంటే పొద్దున్నే వస్తుంది ఆలయానికి రాధ. అతను వూళ్ళో లేకపోతే సాయంత్రం కూడా ఆలయానికి వస్తుంది.

వారిద్దరూ తొలిసారి కలసిన ఆ స్వామి సన్నిధి- తాను తొలిసారి గజ్జ కట్టిన మండపం చూసుకుంటుంది కళ్ళారా. గడచి ఆ తొలి మధుర క్షణాలను- వారిరువురి చూపుల కలియకలను స్మరించుకుంటూ తనలో తనే నవ్వుకొని తన్మయత్వాన్ని పొందుతుంది.

అలాగే తన మేనమామ భీముడుని వెంటబెట్టుకొని ఆలయానికి వచ్చింది రాధ ఆ సాయంవేళ.

స్వామి దర్శనంచేసుకొని పూర్ణయ్య గారి దగ్గర తీర్థ ప్రసాదాలు తీసుకుంది.

పూర్ణయ్యగారు రాధను ఎంతో అప్యాయంగా పలకరించాడు ఎప్పటిలాగే

ఇంతలో చిలకల దండులా లక్ష్మి చుట్టుపక్కల వున్న తన యీడు పిల్లల్ని వెంటబెట్టుకొని అలయానికి వచ్చింది అదే సమయానికి.

లక్ష్మి, వెంటవున్న స్నేహితురాళ్ళూ కిలకిల నవ్వుతూ వచ్చి ఒరసగా జయ గంట కొట్టారు ఒకళ్ళ తరువాత ఒకళ్ళు

రాధ పూర్ణయ్యగారితో మాట్లాడటం అపి ఆ ఆడపిల్లల అలికిడికి నవ్వులతూ వెనక్కి తిరిగిచూసింది. భీము దూ చూసాడు. పూర్ణయ్యగారు చూసాడు.

"ఎప్పుడు వచ్చావమ్మా లక్ష్మీ!" అని పలకరించాడు లక్ష్మిని

"మొన్నండీ- యీవేళ వెళ్ళిపోదా మనుకున్నాం. నేను కాదు. మా అమ్మ అంది. మళ్ళీ ఎందుకో అగిపోయాం. ప్రసాదం పెట్టరా నాకు." వనపిట్టలా మాట్లాడేసింది లక్ష్మి.

పూర్ణయ్య నవ్వుకొని "ఎందుకు పెట్టనమ్మా ముందు తీర్థం తీసుకో- తరవాత ప్రసాదం పెడతాను." అంటూ తీర్థ ప్రసాదాలు యిచ్చారు లక్ష్మికీ, లక్ష్మి స్నేహితురాళ్ళకూ.

భీముడు రాధను కాస్త పక్కకు తీసు కెళ్ళాడు.

"ఆ అమ్మాయి ఎవరో తెలుసా" అన్నాడు లక్ష్మిని రాధకు చూపిస్తూ.

"ఎవరూ ?" అంది రాధ.


మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది-చార్మినార్!
CHARMINAR
THE VAZIR SULTAN
TOBACCO CO.LTD
AZAMABAD HYDERABAD

"కృష్ణమరాయుడు గారికి కాబోయే భార్య. పేరు లక్ష్మి" అన్నాడు రాధ చెవిలో భీముడు.

"అచ్చు లక్ష్మిదేవిలానే వుంది" అనుకుంది రాధ తన మనసులోనే.

లక్ష్మిని తదేకంగా చూస్తో నిల బడింది.

"నవ్వితే సొట్టలు పడే బుగ్గలూ - స్వేచ్ఛగా పరుగులెత్తే లేడిపిల్ల చూపుల్లాంటి చూపులూ - ఉంగరాల జుట్టూ - బొద్దుగా శరీరం - వెన్నముద్దలా వుంది" అనుకుంది రాధ లక్ష్మిని చూస్తూ.

లక్ష్మి బాగా కాకపోవచ్చుగాని అనాకారికాదు. కామాక్షమ్మకు ఫేషనులూ ముస్తాబులూ సరిగ్గా తెలియక సాదాగా పెంచింది లక్ష్మిని. పెద్ద అలంకరణలూ అవీ తెలియవు లక్ష్మికి

చాలా సేపు లక్ష్మినే చూస్తూ వుండి పోయింది రాధ.

ఇంతలో లక్ష్మి స్నేహితురాళ్ళలో ఓ బాల లక్ష్మి చెవిలో "అదెవరో తెలుసా" అంది రాధను చూపిస్తూ.

"ఎవరూ", అంది లక్ష్మి కాస్త గట్టిగానే.

"ఉష్:" అని, "మీ బావ దాన్నే వుంచుకున్నాడట" అని చెవులు కొరికింది ఆ అమ్మాయి.

"ఎంత బాగుందో" అంది లక్ష్మి చాలా అమాయకంగా రాధనే చూస్తూ.

రాధా, లక్ష్మి యిద్దరూ ఒకరి నొకరు అలా చూస్తూ వుండిపోయారు.

రాధపట్ల లక్ష్మికి యీర్ష్య కలగ లేదు. లక్ష్మి తెలియనితనం దానికి కారణం కావచ్చు. కాని రాధకు కూడ లక్ష్మిపట్ల ఈర్ష్య, అసూయ కలగలేదు. లక్ష్మిని చూసే కొద్దీ చూడాలనిపించి రాధకు ఆమె ఎంతో అదృష్టవంతు రాలనుకుంది ఇద్దరూ ఒకరికి తెలియ కుండా ఒకరు దగ్గరవుతున్నారు. వారిరువురి మనసుల్లోనూ ఆ క్షణం ఏదో తెలియని ఆత్మీయత ఒకరంటే ఒకరికి అభిమానం తప్ప జుగుప్సకూ- అసూయకూ తావేలేదు.

ఒక్క క్షణం ఆగితే యిద్దరూ కౌగలించుకొనేవారే.

లక్ష్మిని ఆమె స్నేహితురాలూ - రాధను భీముడూ ఆ స్థితినుంచి మేలు కొలిపారు. రాధ వెళ్ళిపోయింది భీముడితో.

లక్ష్మి దైవదర్శనం చేసుకొని యింటికి వెళ్ళిపోయింది స్నేహితురాళ్ళతో కలిసి. (సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

# సూపర్ రిన్‌తో
# తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు




మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం— క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.

**దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి :**

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

**సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ**

# యువ

## దీపావళి ప్రత్యేక సంచిక

*ఈ సంచికలో...*

శ్రీమతి భానుమతీ రామకృష్ణ, సి. ఆనందారామం, పోల్కంపల్లి శాంతాదేవి, మాదిరెడ్డి సులోచన, పవని నిర్మల ప్రభావతి, కావిలిపాటి విజయలక్ష్మి, కె. లలితాచలం, టెంపోరావ్, వి. మోహనరావు, ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి, వేమకోటి సీతారామశాస్త్రి, వాకాటి పాండురంగారావు, ఇచ్ఛాపురపు జగన్నాధరావు, ద్విభాష్యం రాజేశ్వర రావు, కాటూరి రవీంద్రత్రివిక్రమ్, కప్పగంతుల మల్లికార్జునరావు, శాలివాహన, అజీజ్, కె. యస్ వి నరసింహం, అవసరాల రామకృష్ణా రావు, శ్రీరాజ్, పాలగుమ్మి పద్మరాజు, గొల్లపూడి మారుతీరావు, వి. రాజారామమోహనరావు, యమ్. వి. ఎన్. ప్రసాదరావు, సి. యస్. రావు కథలు, ఒక పూర్తినవల ప్రచురింపబడతాయి.

డా॥ జయదేవ్ బాబు, రాగతి పండరి, ఇతర ప్రముఖ చిత్రకారుల బొమ్మలకథలు, కార్టూనులు ఉంటాయి

వడ్డాది పాపయ్యగారి ముఖచిత్రం, లోపలి వర్ణచిత్రాలు. ప్రత్యేక ఆకర్షణ




నేడే మీ ఏజంటువద్ద మీ కాపీ రిజర్వుచేసుకోండి.

వెల : ఎనిమిది రూపాయలు

## శుభ్రమైన తాజా శ్వాస...
## ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
### డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అటుపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

**కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:**



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు లోగా తోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా మింటే రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.

## నోటి దుర్వాసనను ఆపండి...
## కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
## దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC.G.74 TL

దివ్యమైన
తెలుపు
డెట్ యొక్క
తెలుపు

క్రొత్త ఫార్ములా
డెట్
డిటర్జెంట్ ఉతికే పౌడర్




సాటిలేని వుతుకు శక్తి, అదనపు నురుగు,
తాజా సువాసన మరియు దివ్యమైన తెలుపు!

